ప్రథమ ముద్రణ
రౌద్రినామ సంవత్సర
విజయదశమి ది 18-10-1980

మూల్యము : 12-00

ముఖచిత్రం
శ్రీ మద్దాలి వెంకట శేషగిరిరావు
మచిలీపట్టణము



## ఉపాధ్యాయుల ప్రతిజ్ఞ

సత్ప్రవర్తన కలిగిన ప్రతిభావంతులైన పౌరులుగా విద్యార్థులను రూపొందించుటలో విధ్యుక్త ధర్మనిర్వహణయందు దీక్ష, పట్టుదలతో కృషిచేసి విద్యాలయమును ఆదర్శముగా నిర్వహించగలనని ప్రతిజ్ఞచేయుచున్నాను.

Paper used for the printing of this book was made available by the Government of India at concessional rate through the Convener & Director of A. P. Govt., Text-book Press, Hyderabad. We are grateful to the authorities.

# విషయసూచిక


పేజీలు

1. గణేశ పంచరత్నం v
2. మనవి — కొమరగిరి vi
3. పరిచయము — భావరాజు నరసింహారావు xii

1. **ప్రథమ భాగము :** ప్రార్థన శ్లోకములు

ప్రార్థన 3
విఘ్నేశ్వర ధ్యానము 4
సరస్వతీ ధ్యానము 5
దైవప్రార్థన 6
ఆచార్యదేవోభవ 7
జననీజన్మభూమి 8
హనుమత్ స్తోత్రము 9
ప్రతిజ్ఞ 10

2. **ద్వితీయ భాగము :** సుభాషితములు 11-18

3. **తృతీయ భాగము :** పసిడిపలుకులు

ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్యవరాన్నిబోధత !
— స్వామి వివేకానంద 21
గురువు - శిష్యుడు — రామకృష్ణ పరమహంస 23
స్త్రీ - భక్తి — శారదామాత 25
విద్య - వినయం — కంచి కామకోటి జగద్గురు 27
ఆదర్శం - త్యాగం — నేతాజీ సుభాష్ చంద్రబోస్ 29
వివేకం - విజ్ఞానం — ముట్నూరి కృష్ణారావు 30
ధర్మం - మతం — మహాత్మాగాంధీ 31
" మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ "
— సత్యసాయిబాబా 32
పునాదిరాయి — గురూజీ 34
నాయకత్వం — నార్ల వేంకటేశ్వరరావు 35
గొప్పతనము - మంచితనము
— 'కులపతి' ఎక్కిరాల కృష్ణమాచార్య 36

స్నేహం - మిత్రుడు — కొమరగిరి 39
మానవ జీవితం — కొమరగిరి జయప్రద 41
ధార్మికవిద్య — మహాత్మాగాంధీ 44
దేశసేవయే దైవసేవ — స్వామి రామతీర్థ 45
హిందూధర్మవైశిష్ట్యము — భరద్వాజ్ 47
హరిజనసేవ — మహాత్మాగాంధీ 50
గురువు — గురునానక్ 51
మతము —'ఆర్షవిద్యాలంకార' కల్లూరి చంద్రమౌళి 52
సద్గ్రంథాలను చదవాలి — రమణ మహర్షి 55
గ్రంథములు - గ్రంథాలయములు
— రావూరి వెంకటసత్యనారాయణ 58

**4. చతుర్థ భాగము :** 'ఆణిముత్యాలు' 65-116
**5. పంచమ భాగము :** 'నిత్యసత్యాలు' 117-136
**6. షష్ఠమ భాగము :** సంస్కృత నీతిలోకోక్తులు - సామెతలు 137-150
**7. సప్తమ భాగము :** ఆంగ్లనీతిలోకోక్తులు - సామెతలు 151-166
**8. అష్టమ భాగము :** ప్రశ్నలు - సమాధానములు 167-198
**9. నవమ భాగము :** ప్రవక్తల జీవితచరిత్రలు

గౌతమబుద్ధుడు 201
శ్రీ జగద్గురు శంకరాచార్య 208
శ్రీ రామానుజాచార్యులు 214
శ్రీ మధ్వాచార్యులు 218
గురునానక్ 222
రాజా రామమోహనరాయ్ 226
స్వామి దయానందసరస్వతి 233
రామకృష్ణ పరమహంస 238
కందుకూరి వీరేశలింగంపంతులు 243
స్వామి రామతీర్థ 246
ఏసుక్రీస్తు 251
మహమ్మదు ప్రవక్త 257



# గణేశ పంచరత్నం

ముదాకరాత్త మోదకం సదా విముక్తి సాధకం
కళాధరావతంసకం విలాసి లోకరక్షకమ్
అనాయకైక నాయకం వినాశితే భదైత్యకం
నతా శుభాశునాశకం నమామి తం వినాయకమ్ ॥

నతేతరాతి భీకరం నవోదితార్క భాస్వరం
నమత్సురారి నిర్జరం నతాధికాపదుద్ధరమ్
సురేశ్వరం నిధీశ్వరం గజేశ్వరం గణేశ్వరం
మహేశ్వరం తమాశ్రయే పరాత్పరం నిరన్తరమ్ ॥

సమస్తలోక శంకరం నిరస్తదైత్య కుఞ్జరం
దరేతరోదరం వరం వరేభవక్త్ర మక్షరమ్
కృపాకరం క్షమాకరం ముదాకరం యశస్కరం
మనస్కరం నమస్కృతాం నమస్కరోమి భాస్వరమ్ ॥

అకించనార్తి మార్జనం చిరన్తనోక్తి భాజనం
పురారి పూర్వనన్దనం సురారిగర్వచర్వణమ్
ప్రపంచనాశ భీషణం ధనంజయాది భూషణం
కపోలదాన వారణం భజే పురాణ వారణమ్ ॥

నితాన్తకాన్త దన్తకాంతి మన్తకాన్త కాత్మజం
అచిన్త్యరూపమంత హీన మన్తరాయ కృన్తనమ్
హృదన్తరే నిరన్తరం వసన్తమేవ యోగినాం
తమేకదన్త మేవతం విచిన్తయామి సన్తతమ్ ॥

మహాగణేశ పంచరత్న మాదరేణ యోన్వహం
ప్రజల్పతి ప్రభాతకే హృదిస్మరన్ గణేశ్వరమ్
అరోగతాం అదోషతాం సుసాహితీం సుపుత్రతాం
సమాహితాయు రష్టభూతి మభ్యుపైతి సోచిరాత్ ॥

# మనవి

అంతర్జాతీయ బాలల సంవత్సరం కడు వైభవోపేతంగా ముగిసింది. ప్రతి విద్యాలయంలో బాలల ఉత్సవాలు బ్రహ్మాండంగా జరిగాయి. భారతదేశ భవిష్యత్తు నేటి బాలబాలికల మీదనే ఆధారపడి వున్నదని పెద్దలు ఉపన్యాసా లిచ్చారు. "నేటి బాలబాలికలే రేపటి పౌరులు" అని నాయకులు ఉపన్యాసాలలో పొగిడారు. ఉత్సవాలు, వినోదకార్యక్రమాలు తిలకించిన తల్లిదండ్రులు సంతోషించారు. ఉత్సవాలను ఘనంగా జరిపాముగదా యని ఉపాధ్యాయులు, విజయవంతంగా నిర్వహించాముగదా యని పాలకవర్గంవారు సంతృప్తి జెందారు. ఇటువంటి ఉత్సవాలు వార్షికోత్సవం పేరిట ప్రతిసంవత్సరం, ప్రతివిద్యాలయంలో జరుగుతూనే వుంటాయి. కాని నేటి బాలబాలికలను రేపటి భారత పౌరులుగా తీర్చిదిద్దడానికి, సౌశీల్యవంతులుగా తయారుచేయడానికి అవసరమైన నీతి ప్రబోధక మైన విద్యను గురించి మాత్రం ఎవ్వరూ ఆలోచిస్తున్నట్లు కనుపించడంలేదు. ఒకవేళ ఆలోచిస్తున్నప్పటికీ ఆచరణరూపం మాత్రం దాల్చడం లేదు. అటువంటి విద్యకు అవసరమైన పుస్తకాలను రూపొందించడం లేదు. ఒక వేళ ఎవరైనా అటువంటి పుస్తకాలను తీసుకొని వస్తే ప్రభుత్వంనుంచి అవసరమైన స్థాయిలో ప్రోత్సాహం లభించుట లేదు.

శిష్యుల మనోభావాలు గురువులకు అంతుపట్టటం లేదు. గురువుల మాటలను శిష్యులు శిరసావహించడం లేదు. వీ రుభయుల సాధక బాధకాలను పాలకవర్గం పెడచెవిన పెడుతున్నది. ఉపాధ్యాయుల కష్టనష్టాలను, విద్యార్థుల సాధక బాధకాలను, పాలకవర్గంవారి యిబ్బందులను సానుభూతితో ప్రభుత్వం పరిశీలించడంలేదు. అసంతృప్తి చెందిన విద్యార్థులు ఉపాధ్యాయులమీద విశ్వాసరాహిత్య తీర్మానాలు చేస్తున్నారు. విద్యార్థుల కోరికలను నెరవేర్చలేని నిస్సహాయులైన ఉపాధ్యాయులు పాలకవర్గంమీద పడుతున్నారు. పాలకవర్గంవారు

తమ సమస్యలను ప్రభుత్వం దృష్టికి తీసుకొని వస్తున్నారు. వాటిని పరిష్కరించడంలో ప్రభుత్వం జాప్యం చేస్తున్నది. పాలకవర్గంవారు తమ నిస్సహాయతను ప్రకటిస్తున్నారు. విద్యార్థులు ఆగ్రహావేశపరు లవుతున్నారు. ఈ అవకాశాన్ని కొంతమంది రాజకీయనాయకులు తమ సంకుచిత, స్వార్థ స్వప్రయోజనాలకు ఉపయోగించుకుంటున్నారు. విద్యార్థులను సమ్మెలకు పురిగొల్పుతున్నారు. పాలక వర్గంవారు పాఠశాలలను మూసివేస్తున్నారు. విద్యార్థులు రెచ్చిపోతున్నారు. పోలీసులు రంగప్రవేశం చేస్తున్నారు. మధ్యలో కొన్ని దుష్టశక్తులు ప్రవేశిస్తున్నాయి. అవాంఛనీయమైన సంఘటనలు జరుగుతున్నాయి. పోలీసులు తమ బల పరాక్రమాదులను ప్రదర్శిస్తున్నారు. అమాయకులైన విద్యార్థులు బలి అవుతున్నారు. ఉద్యమాలు తారాస్థాయికి చేరుకుంటున్నాయి. పవిత్రమయిన విద్యాలయాలు అశాంతికి ఆలవాలమై పోతున్నాయి. క్రమశిక్షణారాహిత్యం పెచ్చుపెరిగి పోతున్నది. ఈ అశాంతికి కారకు లెవరు? ఈ విషవలయానికి బాధ్యు లెవరు? ఏ ఒక్కరూ కాదు. అందరూ కూడాను,

ఇది ఒక జటిల సమస్య. అంత తేలికగా పరిష్కారం కాదు. వందలాది సంవత్సరాలు విదేశీ విష కబంధహస్తాలమధ్య పడి నలిగి, కృంగి, కృశించిన జాతి తిరిగి తలెత్తి నూతనోత్సాహంతో ముందుకు సాగిపోవడం అంత తేలిక కాదు. తేలిక కాదని ప్రయత్నం చేయకుండా వుండటం విజ్ఞత లక్షణం మాత్రం కాదు. అసలు ఈ విషవలయానికి ఎవరు ఎంత వరకు బాధ్యులు అనే విషయం మీద పరిశీలన జరిపి పరిష్కార మార్గాన్ని కనుగొనాలి. ఈనాటి బాల బాలికలను రేపటి భారత పౌరులుగా తీర్చిదిద్దవలసిన బాధ్యత ఎవరి మీద ఎంతవరకు వున్నది? జన్మ నిచ్చిన తల్లి మీద, పోషించి రక్షిస్తున్న తండ్రి మీద, బుద్ధివికాసానికి తోడ్పడవలసిన గురువుల మీద, విద్యాలయాలలో ప్రశాంత వాతావరణాన్ని నెలకొల్పవలసిన పాలకవర్గం మీద, దేశాన్ని తీర్చిదిద్దవలసిన రాజకీయనాయకుల మీద, తమ రచనలద్వారా ఉత్తమ ఆశయ, ఆదర్శములను ప్రచారంచేయవలసిన రచయితల మీద వున్నది. అంతేకాదు. వినయ, వివేక, విజ్ఞానాదులను పెంపొందించేటటువంటి నైతిక, ఆధ్యాత్మిక శీల సంపదలను యినుమడింపజేసేటటువంటి విద్యావిధానాన్ని రూపొందించవలసిన బాధ్యత ప్రభుత్వం మీద కూడ వున్నది. వీరందరూ నిజంగా తమ తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తున్నారా? ఎవరికి వారు ఆత్మ పరీక్ష చేసుకోవాలి. తమ విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించాలి. ఇదే ఈనాటి ప్రధాన సమస్య.

బాలబాలికలలో క్రమశిక్షణా రాహిత్యం పెచ్చుపెరిగి పోవడానికి అనేక కారణా లున్నాయి. కారణాలను కనుగొనకుండా, పరిష్కార మార్గాన్ని అన్వేషించ కుండా, తరుణోపాయాలను సూచించకుండా విద్యార్థుల మీద అభాండం వేయడం ఏమాత్రం న్యాయంకాదు. లోపభూయిష్ఠమైన విద్యావిధానమే దీ నంతటికీ మూల కారణం. భారతీయ సంస్కృతీ వైశిష్ట్యం ప్రతిబింబించే సాహిత్యం, కథలు, పాఠాలు విద్యాలయాలలో బోధించడంలేదు. ఈ సమాజ శ్రేయస్సుకు సర్వస్వాన్ని సమర్పించిన స్వార్థత్యాగుల దివ్య జీవితచరిత్రలు విద్యాలయాలలో చెప్పడంలేదు. మహాప్రవక్తలు, మహానుభావులు ప్రపంచానికి అందించిన పవిత్రములైన ' పసిడి పలుకులు ' పసి హృదయాలకు వినిపించడంలేదు, ఆత్మవిశ్వాసాన్ని కలుగజేసి స్ఫూర్తిని, శక్తిని యిచ్చేటటువంటి సంఘసంస్కర్తలు వెదజల్లిన 'ఆణిముత్యాల'ను బాల బాలికలకు అందించడంలేదు. సౌశీల్యవంతులుగా తయారుకావడానికి మహ ర్షులు ప్రవచించిన పవిత్ర ' సుభాషితా ' లను బాలలకు నేర్పడంలేదు. సత్యవంతు లుగా తయారుచేయడానికి అత్యవసరములైన 'నిత్యసత్యాలను' బోధించుట లేదు, వివేక విజ్ఞానాదులను కలుగచేసి, ప్రజ్ఞావంతులుగా తయారుకావడానికి అవసరమైన సమాచారాన్ని అందివ్వడంలేదు. పురాణ, ఇతిహాస, చరిత్రల గురించి తెలుసు కోవాలనే కుతూహలాన్ని పెంపొందించే ప్రశ్నాపత్రములను రూపొందించడంలేదు. దేశస్వాతంత్ర్యంకోసం అవిరామంగా కృషిచేసి పరమపదించిన త్యాగశీలుర దివ్య సందేశాలను విద్యాలయాలలో చదివించడంలేదు. దేశభక్తి గీతాలను విద్యా లయాలలో ఆలాపించడంలేదు. క్రమశిక్షణ ప్రాముఖ్యతను, అవసరాన్ని గురించి కథల ద్వారా బాలలకు వివరించడంలేదు. నీతిప్రబోధకమైన కథలను ఇంటివద్ద పిల్లలకు తల్లులు చెప్పడంలేదు. మంచి సాహిత్యాన్ని కొని యిచ్చి పిల్లలచేత ఇంటి వద్ద తండ్రులు చదివించడంలేదు. అందువలన ఉత్తమమార్గమేదో తెలుసుకోలేక, అవగాహన చేసుకోలేక చుక్కానిలేని పడవవలె పయనిస్తున్నారు ఈనాటి బాల బాలికలు చాలమంది. ఈ విచారకరమైన దుస్థితికి పెద్దలు, ప్రభుత్వం—అందరూ బాధ్యులే.

భారతీయ పురాణాలు, ఇతిహాసాలు మహావిజ్ఞానానికి నిలయాలు. మహానుభావుల చరిత్రలు మహాసాగరాలు. దేశభక్తుల జీవితాలు దివ్యసందేశాలు. మహాప్రవక్తల పలుకులు పసిడి పలుకులు. మహర్షుల మాటలు ఆణిముత్యాలు.

**ఆదికవి వాల్మీకి పరమపదించినా, అతను రచించి లోకాని కందించిన రామాయణ మహాకావ్యం ఈ భూమిపై సూర్యచంద్రాదుల క్రాంతి**

ప్రసరించినంతకాలమూ జనాదరణ పొందగల శక్తి ఆ మహాకావ్యంలో వున్నది. వ్యాసుడు ఎవరో మనకు తెలియకపోయినా, ఆయన మన కందించి వెళ్ళిన భారత, భాగవతాలు నిత్యనూతనంగా శోభిల్లుతునే వున్నాయి. అసలు పేరేమిటో కూడ ప్రపంచానికి తెలియపరచకుండా కాళిదాసుని పేర కావ్యగానం చేసిన 'శాకుంతలం' యింకా శోభిల్లుతునే వున్నది. విశ్వకవి రవీంద్రుడు అమరత్వ మొందినా ఆయన మన కిచ్చిన 'గీతాంజలి' ప్రకాశించుచునే వున్నది. 'కవి కోకిల' శ్రీమతి సరోజనీనాయుడు కాలగర్భంలో కలిసిపోయినా ఆమె రచించిన 'కాలవిహంగము' కాలముతోపాటు విహరిస్తూనే వున్నది. అరవిందుడు అస్తమించినా అతని అమరవాణి ప్రతిధ్వనిస్తూనే వున్నది. ఆదిశంకరులు లింగైక్య మొందినా ఆయన బోధనలు విస్తృతప్రచారంలోనే వున్నాయి. బుద్ధుని 'అహింసా సిద్ధాంతం' యింకా వెలుగులోనే వున్నది. రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి దివ్యసందేశాలు యింకా వినిపిస్తూనే వున్నాయి. వివేకానంద శంఖారావం యింకా మారుమ్రోగుతూనే వున్నది. శ్రీకృష్ణుని నోట వెలువడిన అమృతతుల్యమైన 'భగవద్గీత' యింకా బహుళ ప్రచారంలోనే వున్నది. కౌటిల్యుని 'అర్థశాస్త్రం' మానవావళి మనగలిగినంతకాలం అత్యున్నతమైన ప్రామాణిక గ్రంథంగా వెలుగొందుతూనే వుంటుంది.

"స్వాతంత్ర్యం నా జన్మహక్కు" అని సింహగర్జన చేసిన తిలక్ మహాశయుని ఈ జాతి ఎన్నటికీ మరువలేదు. మహాత్మాగాంధీ మరణించినా ఆయన అమరజీవే. నేతాజీ వీరగాథలను విస్మరించలేము. శివాజీ శౌర్యం, రాణాప్రతాపుని బలపరాక్రమాదులు, శ్రీకృష్ణదేవరాయల వీరత్వం, బాలచంద్రుని సాహసకృత్యాలు మనకు స్ఫూర్తి ప్రదాయకములు. ఝాన్సీలక్ష్మి, రుద్రమదేవి లాంటి వీరవనితలు మన తోబుట్టువులే. శిబిచక్రవర్తి, బలిచక్రవర్తి, దధీచి, కర్ణుడు, తానాజీ లాంటి త్యాగమూర్తులు ఈ త్యాగభూమిలోనే జన్మించారు. రాజా రామమోహనరాయ్, కందుకూరి వీరేశలింగంపంతులు లాంటి సంస్కర్తలు ఈ పవిత్రగడ్డమీదనే పుట్టారు. చాణక్యుడు, తిమ్మరుసులాంటి మహామంత్రులు. మేధావులను కనిన ఘనత మన భరతమాతకే దక్కింది. తిక్కన, పోతన, శ్రీనాథుడు, తులసీదాసు, సూరదాసులాంటి మహాకవులు ఈ పుణ్యగడ్డమీద జన్మించి తమ కవిత్వంతో ప్రజలను చైతన్యవంతులను చేసారు. త్యాగయ్య, క్షేత్రయ్యవంటి సంగీత విద్వాంసులు తమ గానమాధుర్యాన్ని ప్రజల కందించారు. శ్రీరాముని 'పితృవాక్యపరిపాలన', హరిశ్చంద్రుని 'సత్యవాక్కు,' ధర్మరాజు 'ధర్మబుద్ధి,' సీతా, సావిత్రి, అనసూయల 'పాతివ్రత్య మహిమ,' పుండరీకుడు,

శ్రవణ కుమారుల 'మాతృపితృభక్తి', ఏకలవ్యుని 'గురుభక్తి', ప్రహ్లాదుని 'దైవభక్తి' ప్రపంచాన్ని ఆశ్చర్యచకితులను చేసినాయి. ఇంకా ఎందరో మహానుభావులు, ఎందరెందరో మహాప్రవక్తలు ఈ పవిత్ర భారతావనిలో జన్మించారు. పవిత్ర దివ్యసందేశాల నిచ్చారు. నాటికీ, నేటికీ, ఏనాటికీ అవి శాశ్వతంగా ఉపయోగపడుతూనే వుంటాయి. ఆ మహానుభావులు ఈనాడు మన మధ్యలో లేకపోయినా వారి చరిత్ర చిరస్థాయిగా వర్ధిల్లుతూనే వుంటుంది.

భగవంతుడు మనకు ప్రసాదించిన ఈ కొద్దికాలాన్ని సద్వినియోగం చేయడం నేర్చుకోవాలి. మహానుభావుల చరిత్రలను తరచి చూడాలి, చదవాలి, మననం చేయాలి. అంతటితో సంతృప్తిజెందరాదు. వారి జీవితాలలోని సత్య సందేశాలను ఆకళింపు చేసుకోవాలి. వారి మహోన్నతాశయాలను ఆచరణలో పెట్టి నవభారత నిర్మాణానికి బాలబాలికలు నడుం బిగించాలి. దేశకళ్యాణం కోసం కార్యశూరులై కదనరంగంలోనికి కొదమసింహాలలా కుప్పించి దూకాలి. ఆత్మవిశ్వాసంతో, అకుంఠిత దీక్షతో ముందుకు సాగిపోవాలి. భారతదేశ భవిష్యత్తు నేటి బాలబాలికలమీదనే ఆధారపడి వున్నది. బాధ్యతలను గుర్తించి, హక్కులకోసం పోరాడాలి. ఇది నిద్రించవలసిన సమయంకాదు. ఈ జీవితంలో సాధించవలసిన అమూల్యమైన విషయాలెన్నో వున్నాయి. ఏదో ఒకటి సాధించినంతమాత్రంతో సంతృప్తిజెందరాదు. ఎంతో సాధించవలసినది, నేర్చుకోవలసినది యింకా ఎంతో వున్నదనే నగ్నసత్యాన్ని విస్మరించరాదు. వారిని తీర్చి దిద్దవలసిన బాధ్యత ముఖ్యంగా తల్లి దండ్రులమీద, గురువులమీద కూడా వున్నది. ఆ లేత పసిహృదయాలను వికసింపజేయడానికి అవసరమైన, సౌశీల్యమైన నైతిక, ఆధ్యాత్మిక, దేశభక్తి పరిపూరితమైన విద్యను అందించవలసిన బాధ్యత ప్రభుత్వంమీదకూడ వున్నది,

ఈ మహాప్రయత్నానికి ఉడతాభక్తిగా చేతనయినంత సేవ చేయాలని సంకల్పించుకున్నాను. అదే తలంపుతో అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భమున బాల బాలికలు, యువతీ యువకులను దృష్టిలో పెట్టుకొని 'వివేకవాణి' అను నీతిప్రబోధకమైన గ్రంథమును తీసుకొని వచ్చాను. అది నా ప్రథమ ప్రయత్నం. భగవదనుగ్రహంవలన అది విశేష ప్రజాదరణ పొందినది. 'రామాయణపాత్రలు' నా ద్వితీయ ప్రయత్నం. శ్రీరాముడు, సీత, లక్ష్మణుడు, భరతుడు, హనుమంతుడు, సుమిత్రలు చూపిన ఓర్పు, ఓర్మి, సహనము, చేసిన త్యాగాలు. ప్రదర్శించిన ధైర్యసాహస బల పరాక్రమాదులు, వా రనుసరించిన ధర్మనిష్ఠలను

ఆదర్శముగా గైకొని జీవితాలను సరిదిద్దుకోగలిగితే ప్రపంచం సుఖశాంతులతో విలసిల్లుతుంది. ఆ పుస్తకం కూడా విశేష ప్రశంసల నందుకున్నది.

'బాలవిజ్ఞానకోశము' నా తృతీయ ప్రయత్నం. దీనిని తయారు చేయడానికి మహాప్రవక్తలు, మహానుభావులు, మహానాయకులు, సంఘ సంస్కర్తల జీవిత చరిత్రలు సుమారు పందవరకు చదివాను. వారు పలికిన 'పసిడిపలుకులు', వారు వెదజల్లిన 'ఆణిముత్యాలు', అనుభవంతో చెప్పిన 'నిత్యసత్యాలు', బోధించిన 'సుభాషితాలు' యిందు పొందుపరచాను, సంస్కృత లోకోక్తులు, ఆంగ్ల సామెతలు, అంతేకాదు పురాణ, ఇతిహాస చరిత్రలకు సంబంధించిన వందలాది ప్రశ్నలు వాటికి సమాధానాలు కూడా ఈ పుస్తకంలో యివ్వబడినాయి. ప్రవక్తల జీవితచరిత్రలు, సందేశాలు మరియు భారతీయ సంస్కృతీ పురాణాల వైశిష్ట్యం, సంస్కృత భాషాప్రభావం మొదలగు అనేక విశేషాలను కూడా ఈ పుస్తకంలో వివరించాను.

ప్రతివిద్యాలయంలో ప్రతిరోజు ఒక 'సూక్తి' బోర్డుమీద వ్రాసి దానిని గురించి వివరంగా విద్యార్థులకు ఉపాధ్యాయులు వివరించిన యెడల విద్యార్థులలో మానసికాభివృద్ధి కలుగుతుంది, ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. సౌశీల్యవంతు లవుతారు, క్రమశిక్షణ ఏర్పడుతుంది. గురువుల యెడల భక్తి ప్రబలుతుంది. దేశభక్తిపరాయణు లవుతారు. అంతేకాదు వినయ, వివేక, విజ్ఞానాదులు పెంపొందుతాయి.

ఈ మహాప్రయత్నంలో తల్లిదండ్రులు కూడ ప్రత్యేక శ్రద్ధను ప్రతి నిత్యం ఇంటివద్ద తీసుకొంటే నేటి బాలబాలికలు నిజమైన రేపటి భారతపౌరులుగా తీర్చిదిద్దబడుతారనడంలో ఏ మాత్రం సందేహం లేదు. ఈ మహోత్కృష్టమైన ఆశయాలను, పవిత్రములైన ఆదర్శాలను, మంచి భావాలను, ఉన్నతములైన ఆలోచనలను బాలబాలికలలో మరియు యువలోకంలో కలుగజేయాలనే పరమావధితో, పవిత్ర ఆశయంతో, పట్టుదలతో, సత్సంకల్పంతో ఈ 'బాలవిజ్ఞాన కోశము' అను పుస్తకమును ఆంధ్రప్రజానీకానికి అర్పించుకుంటున్నాను. సాదరపూర్వకంగా సమర్పించుకుంటున్నాను. నా యీ ప్రయత్నానికి సహకరించ వలసినదిగా మనవిచేయుచున్నాను. ఈ నా ప్రయత్నం ఏమాత్రం ఫలించినా, ఏ కొంచెం సఫలీకృతమైనా నిజంగా నేను ధన్యుడనే.

భారతమాతకీ జై !

భవదీయ

కొమరగిరి కృష్ణమోహనరావు

# పరిచయము

"విద్యానామ నరస్యరూప మధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం
విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః
విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరం లోచనం
విద్యా రాజసుపూజ్యతే నహి ధనం విద్యావిహీనః పశుః"

మానవునకు విద్యయే సౌందర్యం; అదే గుప్తధనం; చదువే కీర్తినీ, సుఖాన్నీ, భోగాన్నీ కలిగిస్తుంది; విద్యే గురువులకు గురువైనది; విదేశాలకు వెళ్లినప్పుడు విద్యే బంధువు; అదే మరో కన్నువంటిది; రాజసభలలో పూజార్హత విద్యకేగాని ధనానికి లేదు. ఇలాంటి శ్రేష్ఠమైన విద్య లేనివాడు వింత పశువు - అని భర్తృహరి చెప్పాడు.

నిజమే. చదువువలని ప్రయోజనం చదువుకున్న వాళ్లకీ చదువులేని వాళ్లకీ కూడా తెలుసు. అయితే విద్య అంటే ఏమిటి ? ప్రస్తుతం మన పాఠశాలల్లోనూ, కాలేజీలలోనూ చదువుకున్న విద్యావంతుల్ని చూస్తుంటే విద్యావంతుల్లో ఉండవలసిన, మనకు కనపడవలసిన లక్షణాలు, సంస్కారం చాలామందిలో కనబడటంలేదు. ఎందువల్ల ? విద్యావంతుడు సంస్కారం కూడా కలిగి ఉండాలికదా! లేకపోతే ఈ చదువువల్ల ప్రయోజనం ఏమిటి ? చదువు వేరూ, సంస్కారం వేరూ అని అర్థం అవుతున్నది. అలా అయితే చదువు అంతగా లేకపోయినా సంస్కారం కలిగినవాడు రాణిస్తున్నాడు. కనక, చదువు అనవసరం అనుకోవాలా ? మరి ఏటా యిన్నికోట్లు ఖర్చుపెట్టి యిన్ని లక్షలమందికి చదువు చెప్పటం అంతా దండుగేనా ? పోనీ, చదువుకి బదులు సంస్కారాన్ని నేర్పవచ్చునుకదా, ఈ చదువులు నిరుపయోగం అనుకుంటే ?— ఇలాంటి ఆలోచనలు, ప్రశ్నలు మనకి చాలా ఎదురవుతున్నాయి. అందువల్ల భావిపౌరులయిన మన సంతతికి. మన తరవాత తరాలవాళ్లకి ఎటువంటి విద్యను నేర్పాలి అన్న విషయం మనకందరికీ చాలా ముఖ్యం అయినది.

మన పూర్వీకులు విద్యావంతులై ఎంతో జ్ఞానాన్ని నిక్షిప్తంచేసిన ఉత్తమ గ్రంథాలను మనకు అందించారు. వాళ్లు జ్ఞానవంతులని మనం అర్థం చేసుకుని వాళ్లని గౌరవిస్తున్నాం. అంచేత వాళ్లు ఏ చదువులు చదివారో మనం కూడా ఆ చదువే చదివితే సరిపోతుందిగదా! చదువులలో ఈనాడు మనం చేస్తున్న మార్పులూ, కూర్పులూ ఎందుకు? మన పెద్దల అడుగుజాడల్లో మనం నడిచి, మనం కూడా అంతవాళ్లం అయితే చాలు. వాళ్లు మనకి అందించిన విజ్ఞానం మనం మన తరవాత తరంవాళ్లకి అందించగలిగితే అంతేచాలు— అనేవాళ్ళూ ఉన్నారు.

పురాణ మిత్యేవ న సాధు సర్వం
న చాఽపి కావ్యం నవ మిత్యవద్యం
సంతః పరీక్ష్యాన్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః.

పురాతనమైనదని ప్రతీదీ మంచిదికాదు. కొత్తదని ఏదీకూడా దోషజుష్టం కానక్కర్లేదు. పండితులైనవాళ్లు ప్రతివిషయాన్నీ చాలనచేసి, గుణదోషపరీక్ష చేసి మరీ స్వీకరిస్తారు. కేవలం అవిమర్శగా ఒకళ్లు చెప్పినదాన్నే విశ్వసించడం మూర్ఖత్వం.

— అని మాళవికాగ్నిమిత్రకర్త చెబుతున్నాడు. చాలా చక్కటి సలహా. ఈ దృష్టితో ఆలోచిస్తే మన పూర్వుల పద్ధతిని మన ప్రస్తుత అవసరాలనుబట్టి మనం కొంతవరకు మార్పు చేసుకోవలసిన అవసరం ఉన్నదని అంగీకరించాలి. మార్పులు జరుగుతూనే ఉన్నాయి. కేంద్రంలోనూ, మన రాష్ట్రంలోనూ కూడా మంత్రివర్గం మారినప్పుడల్లా కొంత మార్పు జరుగుతూనే ఉన్నది. ఒకే పార్టీ మంత్రివర్గంలోనే మంత్రి మారినప్పుడుకూడా మళ్ళీ మళ్ళీ మార్పులు వస్తూనే వున్నాయి. అయితే ఈ మార్పులు మన బిడ్డలకు ఎంతవరకు ఉపయోగకరంగా వున్నాయి? వాళ్ళ భవిష్యత్తుకు అవి యెంతవరకు దోహదకారి కాగలవు? కొద్ది మినహాయింపులు చేస్తే ఈ మార్పులవల్ల కలిగిన ప్రయోజనంకన్నా, ప్రమాదం ఎక్కువేమో ననిపిస్తున్నది. కొన్ని తరగతులకి విద్యార్థులకి పరీక్షలు అవసరం లేదన్నారు. అంచేత విద్యార్థులకు ఏడో తరగతి ఎలాగో పాసైతే మళ్ళీ పదో తరగతి వరకూ పరీక్ష బెడదలేకుండా, హాయిగా సినిమాలతో కాలక్షేపం చేస్తున్నారు. పదో తరగతి పరీక్షల్లో నయానో భయానో వాచర్లను సుముఖుల్ని చేసుకుంటున్నారు. అదీ కాకపోతే ఎలాగో ఒక లాగు మార్కుల్ని

వేయించుకుని ఆ గండం గడిచి గట్టెక్కుతున్నారు. అన్ని సబ్జక్టులూ విడి విడిగా పాసైనా కాలేజీలో చేరవచ్చును గదా!

ఇహ కాలేజీ చదువులని గురించి తలుచుకుంటే చాలా నిస్పృహ కలుగుతుంది, తల్లితండ్రులుగాని, టీచర్లుగాని విద్యార్థుల్ని అదుపులో పెట్టలేక పోతున్నారు. క్రమశిక్షణ క్రమంగా అదృశ్యం అయిపోతోంది.

విద్యయా వినయా వాప్తిః
సా చే దవినయా వహా
కిం కుర్మః కం ప్రతి బ్రూమో
గరదాయాం స్వమాతరి

—విద్యవల్ల వినయం కలగాలి. అలా కాకుండా విద్యవల్ల అవినయమే కలిగినట్లయితే ఏం చేయాలి? ఏది దారి? తల్లే విషం పెడితే యిహ ఎవరితో మొరపెట్టుకోవాలి?

ఈ దుస్థితికి బాధ్యులు ఒక్క విద్యార్థులే అనడం న్యాయంకాదు. తల్లి తండ్రులూ, అధ్యాపకులూ, ప్రభుత్వమూ కూడా యిందులో పాలుపంచుకోవలసి ఉంటుంది. విద్యార్థులది కత్తిలేని పాలవంటి మనస్తత్వం. బాధ్యత ఎరగని వయసు. "పుస్తకాలద్వారా పిల్లలలో ధార్మిక భావవ్యాప్తి ఎంతవరకు సాధ్యం అనేది ప్రయోగించి చూచాను. దాని ప్రయోజనం పరిమితం. అధ్యాపకుల ధార్మిక ధర్మాచరణ ద్వారా పిల్లలలో ధార్మిక ప్రవృత్తి ప్రగాఢం అవుతుందని నా దృఢ విశ్వాసం. ప్రభుత్వ విద్యాసంస్థల నుంచి వెలికివచ్చే విద్యార్థులకు ఏవిధమైన ధార్మికవిద్య ఉండడం లేదు అనేది నిస్సందేహం. భారతజాతి ఆధ్యాత్మికంగా దివాలా తీయకుండా ఉండాలి అంటే లౌకిక విద్యలతో పాటు ధార్మిక విద్యాబోధన కూడా తప్పనిసరిగా ఉండితీరాలి" అని గాంధీమహాత్ముడు సెలవిచ్చారు.

బడికి పంపినంత మాత్రంచేత తమ బాధ్యత అంతా తీరిపోయింది అని తల్లితండ్రులు భావించకూడదు. తమ బిడ్డల భవిష్యత్తును తీర్చిదిద్దవలసిన బాధ్యత అంతా అధ్యాపకులదే అనుకోవడం పొరబాటు. తమ బిడ్డలు — మగపిల్లలూ, ఆడపిల్లలూ కూడా — సత్పౌరులుగా భాసించడానికి అవసరమైన అలవాట్లనూ, నడవడినీ వాళ్ళకు అబ్బేటట్లు చూడవలసిన అవసరం తమదేనని తల్లితండ్రులు గుర్తు ఉంచుకోవాలి.

ఇహ అధ్యాపకుల విషయం. నాలుగైదు దశాబ్దాలకు పూర్వం స్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ చదివేవారి సంఖ్య యిప్పటికన్నా చాలా తక్కువ

ఉండేది. అంచేత తమ విద్యార్థులను అందర్నీ అధ్యాపకులు గుర్తుంచుకో గలిగేవారు. వాళ్లు ఫలానావారి బిడ్డలని తెలిసి ఉండేవాళ్లు. ఒక్కొక్క విద్యార్థి మనస్తత్వాన్నీ; శక్తినీ, ఆసక్తినీ అర్థం చేసుకుని వాళ్లకు అనువుగా పాఠాలు చెప్పేవాళ్లు. ఇప్పుడు విద్యార్థుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. సెక్షనుకు అరవైమంది వరకూ హైస్కూళ్లలోనూ, దాదాపు వందమంది వరకూ కాలేజీల లోనూ ఉంటున్నారు. అంచేత మునుపటిలాగు ప్రతివిద్యార్థి విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడానికి అవకాశం ఉండక పోవచ్చును. దీనికితోడు అధ్యాపకులవద్ద ట్యూషన్ చెప్పించుకునే వాళ్ళ సంఖ్యకూడా బాగా పెరిగింది. అందువల్ల తమవద్ద ప్రత్యేక శిక్షణ పొందుతున్న విద్యార్థుల విషయంలో అధ్యాపకులు కొంత శ్రద్ధ తీసుకుంటారు. మిగతా విద్యార్థుల విషయం భగవంతుడే చూచుకోవాలి.

ఈ స్థితికి కారణం ప్రభుత్వం. సెక్షనుకి నలభైమంది కన్నా హైస్కూలు తరగతులలోనూ, అరవై లేక డెబ్భయికి మించకుండా కాలేజీ తరగతులలోనూ విద్యార్థుల సంఖ్యను పరిమితం చేయాలి. టీచర్-ప్యూపిల్ రేషియోను గురించి వేదికలమీద ఉపన్యాసాలిచ్చే అమాత్యశేఖరులు తాము చెప్పిన దానిని అమలుచేసి చూపించాలి. ఎక్కువమంది ఉపాధ్యాయుల్ని వేసుకుంటే ఎక్కువ డబ్బు ఖర్చు అవుతుంది. ఆర్థిక స్తోమతు కలిగినవాళ్ళ దగ్గర స్కూలు ఫీజులు వసూలు చేయడంలో తప్పు ఏమీ లేదు. మినిస్టర్ల బిడ్డలకూ, కలెక్టర్ల బిడ్డలకూ, ధనవంతులైన వ్యాపారస్థుల పిల్లలకూ జీతాలు లేకండా చదువుచెప్పే భారం ప్రభుత్వం వహించ నక్కర్లేదు. ఆర్థికంగా వెనకబడిన వారి పిల్లలకు ఉచితంగా విద్యను అందచేయడం ఉచితం.

ప్రస్తుతం విద్యార్థి లోకంలో ప్రబలిన దుస్థితినీ, కలుషిత వాతావరణాన్నీ అవగాహన చేసుకున్న కృష్ణమోహనరావుగారు రచయితగా తన చేతనైన సేవ చేయడానికి పూనుకున్నారు. ఇది విద్యావేత్తలూ, సంస్కారప్రియులైన తల్లి తండ్రులూ కూడా ప్రశంసించదగిన పని. ప్రభుత్వం కూడా యిలాంటి రచనలని ప్రోత్సహించవలసిన అవసరం ఎంతయినా ఉన్నది.

గ్రంథకర్తగా ఆంధ్రులకు యిదివరకే పరిచయం అయిన కృష్ణమోహనరావు గారు, ఈ పుస్తకంలో చాలా మంచి విషయాలు పొందుపరచారు. తొమ్మిది భాగాలుగా ఉన్నది ఈ పుస్తకం, భావిపౌరులైన బాల బాలికలు ఆధ్యాత్మికంగానూ, నైతికంగానూ, లౌకికంగానూ తెలుసుకోనవలసిన అనేక విషయాలు యిందులో

నిక్షిప్తం అయి ఉన్నాయి. ప్రార్థన శ్లోకాలు, సుభాషితాలు, పసిడిపలుకులు, ఆణిముత్యాలు, నిత్యసత్యాలు, సంస్కృత నీతి లోకోక్తులు - సామెతలు, ఆంగ్ల నీతి లోకోక్తులు - సామెతలు, ప్రశ్నలు - సమాధానాలు, ఉత్తమ జీవిత చరిత్రలు- ఈ విషయాలను ఎంతో శ్రమకోర్చి సేకరించి, చాలా విపులంగా, తేలిక భాషలో అందచేశారు. ప్రతి భాగానికీ ఒక ప్రత్యేకత ఉన్నది.

భారతీయ సంస్కృతినీ, ఆధునిక విజ్ఞానాన్నీ సమపాళ్లుగా యిందులో చేర్చారు. ఒక్కమాటలో చెప్పాలంటే విద్యార్థులకు ఈ గ్రంథం ఒక జ్ఞానదీపిక. ఇటువంటి సత్కార్యాన్ని సమర్థవంతంగా నిర్వహించిన కృష్ణమోహనరావుగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. భావి భారత పౌరులైన మన బాల బాలికలు ఈ గ్రంథాన్ని సద్వినియోగం చేసికొనగలరని ఆశిస్తున్నాను.

"త్రివేణి"
మచిలీపట్నం
1-10-1980

భావరాజు నరసింహారావు



ఉదారస్వభావులు, గురుతుల్యులు, స్నేహశీలి, ప్రేమపాత్రులైన

## శ్రీ మాటూరు గోపాలరావుగారికి

(రిటైర్డు చీఫ్ ఇంజనీర్)

కృతజ్ఞతాభినందనలు

— కొమరగిరి



# ప్రార్థన

" అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ."

చెడునుండి నన్ను మంచిని చేర్చుము. అజ్ఞానము (చీకటి) నుండి నన్ను జ్ఞానము (వెలుగు) ను చేర్చుము. మృత్యువు నుండి నన్ను మోక్షమును చేర్చుము.

" ఓ దేవదేవా! నన్ను చెడుపనులకు ప్రోద్బలం చేయకుము. మంచిపనులు చేయడానికి శక్తిని ప్రసాదించుము. చీకటిలో పడి కొట్టుమిట్టాడుకుంటున్న నన్ను వెలుగులోనికి తీసుకొని రమ్ము. మృత్యుముఖంలోపడి నరకయాతనలు అనుభవిస్తున్న నాకు మోక్షమును ప్రసాదించుము" అని ప్రతి నిత్యమూ ప్రాతఃకాలమున భగవంతుని ప్రార్థించవలెను.



# విఘ్నేశ్వర ధ్యానము

"శుక్లాంబరధరం విష్ణుం, శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్, సర్వవిఘ్నోపశాన్తయే."

తెల్లని వస్త్రములను ధరించినవాడును, అంతటా వ్యాపించిన చంద్రుని కాంతివంటి తెల్లనికాంతి కలవాడును, నిర్మలమైన, స్వచ్ఛమైన ముఖము గలవాడు నగు విఘ్నేశ్వరుని సమస్త విఘ్నములు నశించుట కొఱకు ధ్యానము చేయవలెను.

"అగజానన పద్మార్కం, గజానన మహర్నిశమ్
అనేకదన్తం భక్తానాం, ఏకదన్త ముపాస్మహే."

హిమవత్పర్వతము యొక్క పుత్రికయగు పార్వతీదేవి యొక్క పద్మమువంటి ముఖమునకు సూర్యునివలె సంతోషమును కలిగించువాడును, భక్తులకు అనేక వరములను యిచ్చువాడును, ఒకే దంతము కలవాడు నగు ఆ వినాయకుని పగలు, రాత్రియును (ఎల్లప్పుడునూ) సేవింతును.



# సరస్వతీధ్యానము

"సరస్వతి! నమస్తుభ్యం వరదే! కామరూపిణి
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతుమే సదా."

"ఓ సరస్వతీదేవి! నీ కొఱకు నమస్కారము, వరములు యిచ్చెడిదానా! చక్కని రూపము గలదానా! విద్యను ప్రారంభించుటను చేయుదును. నాకు ఎల్లప్పుడూ ఈ విద్య సిద్ధించుట అగుగాక!"

"పద్మపత్ర విశాలాక్షీ పద్మకేసరవర్ణినీ
నిత్యం పద్మాలయాదేవీ సామాంపాతు సరస్వతీ."

పద్మము యొక్క రేకులవలె విశాలమైన కన్నులు కలదియును, పద్మము యొక్క కేసరములవంటి పసుపుపచ్చని రంగు కలదియును, పద్మమే నివాసముగా కలదియును, దేవతయు నగు ఆ సరస్వతి ఎల్లప్పుడూ నన్ను రక్షించుగాక!



# దైవప్రార్థన

"త్వమేవ మాతాచ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ."

"ఓ దేవదేవా! నీవే తల్లివి, నీవే తండ్రివి, నీవే బంధువు, నీవే స్నేహితుడవు, నీవే నా చదువు, నీవే నా ధనము, నీవే నా సర్వము."

క. నీవే తల్లివి తండ్రివి
నీవే నా తోడు నీడ నీవే సఖుఁడౌ
నీవే గురుఁడవు దైవము
నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా!

"ఓ కృష్ణా! నిజముగా నాకుఁ దల్లిదండ్రులును, సోదరులును, మిత్రుడును, గురుడును, దైవమును, ప్రభువును, దిక్కు ను అన్నిటికి నీవే. నా కితరులు ఆధారము లేదు."

# ఆచార్యదేవోభవ!

"గురు ర్బ్రహ్మ గురు ర్విష్ణుః గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥"

"గురువు బ్రహ్మదేవుడు, గురువు విష్ణువు, గురువు దేవుడగు ఈశ్వరుడు, గురువు ప్రత్యక్షముగానున్న ఆ పరమాత్మయే. అటువంటి తేజోవంతుడగు గురువు కొఱకు నమస్కారము."

భారతీయ సంస్కృతియందు గురువునకు అత్యున్నత స్థాన మివ్వబడింది. గురువుని దైవసమానముగా భావించ మని ఆదేశించింది. భక్తి శ్రద్ధలతో గురువును సేవించిన వారికి దైవము కూడా సహాయపడును.

"అజ్ఞాన తిమిరా న్ధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీ గురవేనమః ॥"

"అజ్ఞానము అను చీకటియందు గ్రుడ్డివాని వలె వున్న (నాయొక్క) కన్ను జ్ఞానము అను కాటుకపుల్లతో ఏ గురువుచే తెరిపింపజేయబడినదో అటువంటి తేజోవంతుడగు గురువు కొఱకు నమస్కారము."

'అజ్ఞానము' అను అంధకారమును పారద్రోలి 'జ్ఞానము' అను వెలుగును ప్రసాదించువాడు గురువు. "జ్ఞానేన హీనాః పశుభి స్సమానాః." జ్ఞానహీనులైనవారు పశువులతో సమానము అని పెద్దలు చెబుతున్నారు. కనుక సమర్థుడైన గురువును ఆశ్రయించి ప్రతి ఒక్కరూ జ్ఞానము పొందవలెను. జ్ఞానోదయంవల్ల నరుడు నారాయణుడు అవుతాడు. జీవుడు శివుడు అవుతాడు. మానవుడు మాధవుడు అవుతాడు. పురుషుడు పురుషోత్తముడు అవుతాడు. పశువు పశుపతిగా మారుతాడు.



# జననీ జన్మభూమి

"అపి స్వర్ణమయీ లంకా, నమే లక్షణ రోచతే
జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపి గరీయసీ."

"ఓ లక్ష్మణా! లంక బంగారు మయమైనను నాకు ఇష్ట మగుటలేదు. తల్లియు, జన్మించిన దేశమును స్వర్గము కంటే కూడ శ్రేష్ఠమైనవి" అని శ్రీరామచంద్రుడు బంగారంతో తులదూగుతున్న లంకాపురిని చూచి మోహపడుతున్న లక్ష్మణునితో అంటాడు. బాలబాలికలు యిక్కడ ఒక నీతిని నేర్చుకోవాలి. జన్మనిచ్చిన తల్లి ఒక వేళ అందవిహీనంగా వుండవచ్చు. కుంటిది కావచ్చు, గుడ్డిది కావచ్చు. తల్లి తల్లే. ఆమె మాతృదేవే. ఆమెను పూజిం చటం, పోషించటం కుమారుల కర్తవ్యం. అదేవిధముగా జన్మించిన దేశం ఒకవేళ పేదది కావచ్చు. భోగభాగ్యాలు లేకపోవచ్చు. అంతమాత్రాన దానిని వదలివేయడం న్యాయమా? కాదు. కనుక మనదేశం సర్వతోముఖాభి వృద్ధి గాంచుటకు కృషిచేయవలసిన బాధ్యత మనదేశంలో పుట్టిన ప్రజల మీద వుంటుంది. ఈ వాస్తవాన్ని ప్రతి ఒక్కరూ గుర్తించాలి. ఆచరణలో పెట్టాలి. ఇది మన కర్తవ్యం. మన విద్యుక్త ధర్మం."



# హనుమత్ స్తోత్రము

అతులిత బలధామం స్వర్ణశైలాభ దేహమ్ ।
దనుజవన కృశానుం జ్ఞానినా మగ్రగణ్యమ్ ॥ 1

సకలగుణ నిధానం వానరాణా మధీశమ్ ।
రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి ॥ 2

గోష్పదీకృతవారాశిం మశకీకృత రాక్షసమ్ ।
రామాయణ మహామాలా రత్నం వన్దేఽ నిలాత్మజమ్ ॥ 3

అంజనా నన్దనం వీరం జానకీ శోకనాశనమ్ ।
కపీశ మక్ష హన్తారం వన్దే లంకా భయంకరమ్ ॥ 4

ఉల్లంఘ్య సింధోస్సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజాయా ।
ఆదాయ తేనైవ దదాహలంకాం నమామితం ప్రాంజలిరాంజనేయమ్॥

ఆంజనేయ మతి పాటలాననం కాంచనాద్రి కమనీయ విగ్రహమ్ ।
పారిజాత తరుమూల వాసినం భావయామి పవమాననన్దనమ్ ॥ 6

యత్ర యత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥ 7

మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం
శిరసా నమామి ॥ 8

# ప్రతిజ్ఞ

భారతదేశము నా మాతృభూమి. భారతీయులందరు నా సహోదరులు.

నేను నా దేశమును ప్రేమించుచున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణము. దీనికి అర్హుడనగుటకై సర్వదా నేను కృషి చేయుదును.

నా తల్లిదండ్రులను, ఉపాధ్యాయులను, పెద్దలందరిని గౌరవింతును. ప్రతివారితోను మర్యాదగా నడచుకొందును.

నా దేశముపట్లను నా ప్రజలపట్లను సేవానిరతి కలిగి కలిగియుందునని ప్రతిజ్ఞ చేయుచున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందమునకు మూలము.

భారతమాతకీ జై!

# సుభాషితములు

'ఉత్సాహం సాహసం ధైర్యం బుద్ధి శ్శక్తిః పరాక్రమః
షడేతే యత్ర తిష్ఠన్తి తత్ర దేవ స్సహాయకృత్.' 1

తా. ఉత్సాహము, సాహసము, ధైర్యము, సద్బుద్ధి, శక్తి, పరాక్రమము—ఈ ఆరు సుగుణములు ఎవరివద్ద స్థిరముగా నుండునో వారికి దైవము కూడా సహాయపడును.

'ఉద్యమేన హి సిధ్యన్తి కార్యాణి న మనోరథైః
నహి సుప్తస్య సింహస్య ప్రవిశన్తి ముఖే మృగాః.' 2

తా. ప్రయత్నము వలననే పనులు సఫలమగును. కేవలము కోరికలుండుటచే పనులుగావు. మృగరాజైన సింహము నిద్రించుచున్నచో మృగములు వాటంతటవే నోటిలో ప్రవేశించవుగదా!

'అల్పానా మపి వస్తూనాం సంహతిః కార్యసాధికా
తృణైర్గుణత్వ మాపన్నైర్బ ధ్యన్తే మత్తదన్తినః.' 3

తా. ఎంత చిన్నవైనను వస్తువులు కలిసిన గొప్ప కార్యములను సాధింపవచ్చును. గడ్డిపరకలను కొన్నిటిని కలిపివేసిన మదగజములను గూడ కట్టివేయవచ్చును. సంఘటనా కార్యమందలి మహాత్వ మిట్టిదియే.

'అయం నిజః పరోవేతి గణనా లఘుచేతసామ్
ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్.' 4

తా. అల్పమైన మనస్సుకలవారు ఇతడు తనవాడా లేక పరాయివాడా అని లెక్కించుచుందురు. విశాలమైన చరిత్ర

కలవారు మాత్రం ఈ ప్రపంచమంతయూ తన కుటుంబమే ననే భావం కలిగి యుందురు.

'నాస్తి లోభ సమో వ్యాధిః నాస్తి క్రోధ సమో రిపుః
నాస్తి దారిద్ర్యవత్ దుఃఖం నాస్తి జ్ఞానాత్ పరం సుఖమ్.' 5

తా. లోభముతో సమానమైన రోగము లేదు. కోపముతో సమానమైన శత్రువు లేదు. దారిద్ర్యమువంటి దుఃఖము లేదు. జ్ఞానముకంటె గొప్ప దైన సుఖము లేదు.

'ప్రదోషే దీపకశ్చంద్రః ప్రభాతే దీపకో రవిః
త్రైలోక్యే దీపకో ధర్మః సుపుత్రః కులదీపకః.' 6

తా. రాత్రియందు వెలుగు నిచ్చువాడు చంద్రుడు. ఉదయమున వెలుగు నిచ్చువాడు సూర్యుడు. ముల్లోకములందును వెలుగు నిచ్చెడిది ధర్మము. కులమునకు కీర్తి దెచ్చువాడు మంచి కుమారుడు.

'పరోపకారాయ ఫలన్తి వృక్షాః పరోపకారాయ వహన్తి నద్యః
పరోపకారాయ దుహన్తి గావః పరోపకారార్థ మిదం శరీరమ్.' 7

తా. పరోపకారము కొఱకు చెట్లు ఫలముల నిచ్చుచున్నవి. పరోపకారము కొఱకు నదులు ప్రవహించుచున్నవి. పరోపకారము కొఱకు ఆవులు పాల నిచ్చుచున్నవి. మన యీ శరీరము కూడా ఇతరుల కుపకారముచేయుట కొఱకే యని తెలిసికొనవలెను.

'ఖలో మృగయతే దోషం గుణపూర్ణేషు వస్తుషు
వనే పుష్పఫలాకీర్ణే పురీష మివ సూకరః.' 8

తా. పంది మంచి పుష్పములతో, ఫలములతో నిండియున్న తోటయందు మలము కోసమే వెతుకును.

అదేవిధముగ నీచుడు మంచి గుణములతో నిండిన వస్తువుల యందు కూడా దోషమునే వెతుకును.

'మాతృవత్ పర దారేషు పర ద్రవ్యేషు లోష్ఠవత్
ఆత్మవత్ సర్వ భూతేషు యః పశ్యతి సః పణ్డితః.' 9

తా. ఇతరుల భార్యలను తన తల్లి వలెను, ఇతరుల డబ్బును మట్టిపెడ్డ వలెను, ప్రాణులందరిని తనవలెను ఎవడు చూచుచున్నాడో వాడే సరైన పండితుడు.

'కృషితో నాస్తి దుర్భిక్షం జపతో నాస్తి పాతకమ్
మౌనేన కలహో నాస్తి నాస్తి జాగరతో భయమ్.' 10

తా. కృషి చేయుట వలన కఱువు రాదు. జపము చేయుట వలన పాపం రాదు. మౌనము వలన కలహము రాదు. జాగ్రత వలన భయముండదు.

'కోకిలానాం స్వరోరూపం పాతివ్రత్యం తు యోషితామ్
విద్యారూపం విరూపాణాం క్షమారూపం తపస్వినామ్.' 11

తా. కోకిలకు స్వరమే రూపము. స్త్రీలకు పాతివ్రత్యమే రూపము. రూపహీనులకు విద్యయే రూపము. తపస్సు చేసికొను వారికి ఓరిమియే రూపము.

'స్వగృహే పూజ్యతే మూర్ఖః స్వగ్రామే పూజ్యతే ప్రభుః
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే.' 12

తా. మూర్ఖుడు తన ఇంట పూజింపబడును. ప్రభువు తన గ్రామంలో పూజింపబడును. రాజు తన దేశమునందు పూజింపబడును. విద్వాంసుడు లేక పండితుడు అన్ని దేశముల యందును పూజింపబడును లేక గౌరవించబడును.

'గౌరవం లభ్యతే దానాత్, నతు విత్తస్య సంచయాత్
స్థితి రుచ్చైః పయోదానాం, పయోధీనామధః స్థితిః.' 13

తా. దానము చేయుట వలన ధనమునకు గౌరవము లభించుచున్నది. కూడబెట్టుట వలన మాత్రము గౌరవము లభించదు.

అదేవిధముగా నీటిని యిచ్చెడి మేఘముల ఉనికి ఉన్నతమైనది. నీటిని కూడబెట్టెడి సముద్రముల ఉనికి మాత్రము క్రింద అయినది.

'విద్యా వివాదాయ ధనం మదాయ శక్తిః పరేషాం పరిపీడనాయ
ఖలస్య సాధోః విపరీతమేతత్ జ్ఞానాయ దానాయ చ రక్షణాయ.' 14

తా. దుష్టుడు విద్యచేత వితండవాదము చేయును. ధనము చేత పొగరుబోతు అగును. బలముచేత ఇతరులను మిక్కిలి పీడించును. ఈ గుణములే సత్పురుషునకు కలిగినచో అతడు విద్యచేత జ్ఞానమును సంపాదించుచూ, ధనమును దానము కొఱకు ఉపయోగించుచూ, బలమును ఇతరులను రక్షించుట కొఱకు ప్రయోగించును. కనుక విద్య, ధనము, బలములు ఆశ్రయమును బట్టి చెడుఫలమును, మంచిఫలమును యిచ్చును. అనగా అవి యున్నంత మాత్రముననే మానవుడు గౌరవింపబడడు. సత్ప్రవర్తన చేతనే అతనికి లోకములో గౌరవము కలుగుచుండును.

'సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్య మప్రియమ్
ప్రియం చ నానృతం బ్రూయాత్
ఏషః ధర్మః సనాతనః.' 15

తా. సత్యమును పలుకవలెను. ప్రియముగా పలుకవలెను. సత్యమైననూ అప్రియముగా పలుకరాదు. ప్రియముగానైననూ అసత్యమును పలుకరాదు. ఇది సనాతనమైన ధర్మము.

'అజరా అమరవత్ ప్రాజ్ఞః విద్యాం అర్థం చ సాధయేత్
గృహీత్వైవ కేశేషు మృత్యునాధర్మ మాచరేత్.' 16

తా. బుద్ధిమంతుడు జరామరణములులేని వానివలె ధనమును, విద్యను సాధించవలెను. మృత్యువుచే చుట్టుకొనబడిన వానివలె ధర్మము నాచరించవలెను.

'ఆలస్యం హి మనుష్యాణాం శరీరస్థో మహాన్ రిపుః
నాస్త్యుద్యమ సమో బన్ధుః కుర్వాణో నావసీదతి.' 17

తా. సోమరితనమే మనుష్యులకు శరీరములో నుండు గొప్ప శత్రువు. ఉద్యమము (ప్రయత్నము) తో సమానమగు బంధువు వేరులేదు. ఉద్యమశీలి ఎప్పుడును దుఃఖమును పొందడు.

'సంపత్తౌ చ విపత్తౌ చ మహతా మేక రూపతా
ఉదయే సవితా రక్తో రక్తశ్చాస్త మయే తథా.' 18

తా. మహాపురుషులు సంపదలు వచ్చినప్పుడును, ఆపదలు వచ్చినప్పుడును ఒకే విధముగా నుందురు. అనగా సంపదలకు ఉబ్బితబ్బిబ్బు కారు. ఆపదలకు విచారముతో క్రుంగిపోరు. సూర్యభగవానుడు ఉదయాస్తమయ సమయములయందు ఎఱ్ఱగానే ఉండునుగదా!

'అశ్వం నైవ గజం నైవ, వ్యాఘ్రం నైవ చ నైవ చ
అజాపుత్రం బలిం దద్యాత్, దేవో దుర్బల ఘాతకః.' 19

తా. గుఱ్ఱమునుగాని, ఏనుగునుగాని బలి యీయరు. పెద్దపులిని అంతకంటెను యీయరు. మేకపిల్లను మాత్రమే బలి యిత్తురు. దేవుడు కూడ బలహీనులనే నాశనము చేయునుగాని బలాఢ్యుల నేమియూ చేయడు.

'యస్మిన్ దేశే న సమ్మానో, నప్రీతిర్నచ బాన్ధవాః
న చ విద్యా గమః కశ్చిత్, న తత్ర దివసం వసేత్.' 20

తా. ఏ దేశమునందు గౌరవము వుండదో, ప్రేమ వుండదో, బంధువులుగాని, విద్యావంతులుగాని వుండరో ఆ దేశమున ఒక్క నాడైనను నివసించరాదు.

'ధనికః శ్రోత్రియో రాజా నదీ వైద్యస్తు పంచమః
పంచ యత్ర న విద్యన్తే న తత్ర దివసం వసేత్.' 21

తా. ధనవంతుడు (అప్పిచ్చువాడు), వేదజ్ఞానియగు బ్రాహ్మణుడు, రక్షకుడగు రాజు, ప్రవహించెడి నది, వైద్యుడును అను ఐదుగురు ఎక్కడైతే వుండరో, అక్కడ ఒక్కనాడైననూ నివసించరాదు.

'పిపీలి కార్జితం ధాన్యం, మక్షికా సంచితం మధు
లుబ్ధేన సంచితం ద్రవ్యం, సమూలం హి వినశ్యతి.' 22

తా. చీమలచేత సంపాదించబడిన ధాన్యముయును, తేనెటీగెలచేత కూడబెట్టబడిన తేనెయును, లోభిచేత కూడబెట్టబడిన సంపదయును పూర్తిగా నాశనమగుచున్నదికదా! (వానికి దక్కుట లేదు కదా!)

'అహో దుర్జన సంసర్గాత్, మానహానిః పదే పదే
పావకో లోహ సంగేన మృద్గరై రభి హన్యతే.' 23

తా. అగ్నిహోత్రుడు లోహముతో కలియుటచేత సమ్మెటలతో సాగగొట్ట బడుచున్నాడు. దుర్జనులతో స్నేహము చేయుట వలన అడుగడుగునా గౌరవము నశించును. అయ్యో!

'గృధ్ర దృష్టి ర్బకాలీనః శ్వచేష్ట స్సింహ విక్రమః
అను ద్విగ్నః కాక శఙ్కీ భుజంగ చరితం చరేత్.' 24

తా. కార్యసాధకుడు విచారముతో కూర్చుండడు. అతడు గ్రద్దకున్న దూరదృష్టిని, కొంగకున్న నిశ్చలతను, కుక్కకున్న సావధానతను, సింహమునకున్న పరాక్రమమును పొందును. ఆపదల విషయమున కాకివలె శంకించు చుండును. పామువలె పరసాధనముల నుపయోగించుకొను చుండును. (చీమలు పెట్టిన పుట్టను పాము తనకై ఉపయోగించుకొనునట్లు, కార్యసాధకుడు శత్రువుల సాధనములను తనకై ఉపయోగించుకొనును.)

# బాల
# విజ్ఞానకోశము

## తృతీయ భాగము

## పసిడి పలుకులు

# ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్నిబోధత!

" లేవండి! మేల్కొనండి! లక్ష్యము సాధించువరకు విశ్రమించకండి! నాయనలారా! కావాల్సింది ఇనుప కండలూ, ఉక్కు నరాలు, వజ్రకఠోరమైన మనసు, శక్తి, సామర్థ్యం, పౌరుషం, క్షాత్రవీర్యం, బ్రహ్మతేజం కావాలి.

" నేడు కావాల్సింది జీవితాన్ని సుఖోద్యానవాటికగా భావించే ప్రేమకలాపి కాదు ; జీవన సంగ్రామ రంగంలో మహాయోధుడై నిలువ గలిగిన వీరుని ఆదర్శం. ప్రస్తుత పరిస్థితులలో శ్రీకృష్ణుని దివ్యక్రీడలు నీకు ఉపకరించవు. మురళిని ప్రయోగించి నందున దేశం ఉద్ధరింపబడదు. అద్భుత రాజసిక తేజము, ఆపాదమస్తకము తొణికిసలాడే ఒక మహావీరుడు, సత్యాన్వేషణకై తెగించి ప్రాణాలొడ్డగల ధీరుడు, త్యాగమే ధనుస్సుగా, విజ్ఞానమే కరవాలముగా కలిగిన వీరుడు—నేడు మనకు ఆదర్శమై నిలవాలి.

" ధీరవత్సలారా! మీరందరూ మహత్కార్యాలు సాధించడానికి జన్మించామనే విశ్వాసం కలిగి ఉండండి. కుక్కపిల్లల అరుపులకు భయపడరాదు. ఆకాశంనుండి విరిగిపడే పిడుగులకైనా చలింపరాదు.

" సోదరులారా! మనం కష్టించి పనిచేయాలి. ఇది నిద్రించ తగిన సమయం కాదు. మనపై భవిష్య భారతావతరణం ఆధారపడి వున్నది. ఆ తల్లి మనకై నిరీక్షిస్తున్నది. ఆమె ప్రస్తుతం నిద్రిస్తున్నది. అంతే. లేచి, మేల్కొని పునరున్మిషిత జీవనంతో, అపూర్వ యశంతో విరాజిల్లేట్లు విజృంభించి మన మాతృదేవిని తన శాశ్వత సింహాసనంపై అధిష్ఠింప జేయండి!

"భారతవర్షమే నశిస్తే ప్రపంచంలో ఆధ్యాత్మికతయే నశిస్తుంది. నైతిక సమగ్రత సాంతం నశిస్తుంది. మధురాత్మికమైన ధర్మానుభూతే నశిస్తుంది. ఆదర్శవాదమే నశిస్తుంది. వీనికి బదులుగా కామ భోగములే స్త్రీ పురుష దైవములవుతాయి. ధనమే వీటికి పురోహితుడు. వంచన, బలత్కారము వీటికి పూజలు. మానవాత్మయే బలి అవుతాయి. అది జరుగరాదు.

"మనకు మహోత్తమాదర్శం ఉండాలి. ఆ ఆదర్శానికై జీవన మర్పిద్దాం. సౌశీల్యం, బుద్ధీ, ఇతరులను సేవించడానికి సమస్తమూ త్యాగం చేయగల సంసిద్ధతా, వినయాదులతో తమ సర్వస్వం సమర్పించగల యువకులు కావాలి. అటువంటివారే తమకూ, దేశానికీ మేలు చేయగలరు. మొదట వినండి. తరువాత గ్రహించండి. పిమ్మట తొణకకుండా, బాహ్య ప్రభావాలకు లోను కాకుండా మనస్సును నిగ్రహించుకొని మీలో నున్న సత్పదార్థాన్ని వికసింపచేసుకోడానికి కృషి చేయండి.

"నాయనలారా! ఈ సందేశాన్ని మీరు ప్రపంచానికి చాటగలరా! అప్పుడే ఈ సమస్త విషాదము, విచారము, పాపము మటుమాయ మవుతాయి. దుర్బల భావాలు మచ్చుకైనా కన్పించవు. ఈ అద్భుతమైన మార్పును దర్శించండి. మీరు సర్వశక్తివంతులు. ఫిరంగుల ముఖంలోనికి చొరబడటానికి కూడా భయపడకండి.

"లెండు! మేలుకొనుడు! గమ్యస్థానం చేరువరకు వెనుక చూపులేక యుండుడు."

*AWAKE! ARISE! STOP NOT,*
*TILL THE GOAL IS REACHED.*

— **స్వామి వివేకానంద**

# గురువు - శిష్యుడు

గురువును శిష్యు డెన్నడు ఆక్షేపింపరాదు. గురు వేది చెప్పినను దాని కాతడు పూర్తిగా విధేయుడై యుండవలెను. గురువు మానవునికి భగవంతునితో అనుసంధానము కూర్చు మధ్యవర్తి. ముత్యమును గైకొని ముత్యపు చిప్పను పారవేయుము. గురువు ఉపదేశించిన మంత్రమును స్మరింపుము గాని, అతని దౌర్బల్యముల నెన్నకుము. నీ గురువును గూర్చి ఇతరు లాడు నిందావాక్యములను విని సహింపకుము. అతడు నీ తల్లిదండ్రులకన్నా ఉత్తముడు. నీ తల్లిదండ్రుల నెవ్వడేని నీ ఎదుట దూషించినచో విని ఊరు కుందువా? అవసరమగుచో పోరాడియైనను నీ గురువు ప్రతిష్ఠను కాపాడుము.

గురువు గంగాభవాని వంటివాడు. గంగానదిలో పెంటకుప్ప లను, చెత్తా చెదారమును ఎంత పడవేసినను పవిత్రతకు లోపము రాదు. అట్లే గురువు కూడా దూషణ తిరస్కారములకు అతీతుడు.

గురువు మానవ స్వరూపుడై మంత్రమును చెవిలో ఉచ్ఛ రించును. భగవత్స్వరూపుడై మంత్రభావమును ఆత్మ కెక్కించును.

క్రొత్తచోటికి పోవునప్పుడు దారి తెలిసినవాని నొక్కని మాత్రమే నమ్ముకొనవలెను. అట్లుగాక అనేకుల సలహాలు అనుసరించినచో గందరగోళము తప్పదు. ఇట్లే బ్రహ్మమును చేరకోరుదువేని బ్రహ్మవేదియగు గురువు నొక్కని నమ్ముకొని వానికి సంపూర్ణముగా విధేయుడవై యుండుము.

తన గురువు అనంతశక్తిసంపన్నుడని దృఢముగా విశ్వ సింపుము. శ్రద్ధ వలన ఎట్టి అద్భుత విషయములనైనను సాధింప వచ్చును. కాని అహంభావము సర్వనాశనమును కలిగించును. అహంకారము వల్ల తీరని నష్టము వాటిల్లును.

భగవంతునిపై హృదయపూర్వకమగు ప్రేమ కుదిరి భక్తి సాధనలు శ్రద్ధతో చేయుచూ, తహతహపడుచుండు వానికి భగవంతుడే సద్గురువు నొకనిని చూపును. గురువు నామము ఒక్కరికే వర్తించును. కాని ఉపగురువులు మాత్రము పెక్కండ్రు ఉండవచ్చును. ఎవరియొద్ద ఏ యోగ్యవిషయము లభ్యసించినను వా రెల్లరూ ఉపగురువులే అగుదురు.

గురువులలో మూడు తరగతులవారు కలరు. ఆధ్యాత్మిక విధులను ఉపదేశించి, ఇక వాని సంగతియే పట్టించుకొనని గురువు మూడవ తరగతికి చెందినవాడు. అట్లుగాక బాగుగా అర్థమగునంత వరకు శిష్యునకు తన బోధనలను నూరిపోసి, అతని యోగక్షేమ ముల విషయంలో శ్రద్ధవహించు గురువు రెండవ తరగతికి చెందిన వాడు. ఇక శిష్యుడు తన ఉపదేశములను ఆలకింపకున్నను, ఆచరింపకున్నను, వానిని శాసించి బలాత్కారముగానైనను ప్రయత్నించి సరి అయిన మార్గమున పెట్టు గురువు మొదటి తరగతికి చెందినవాడు.

గురు పదవి నధిష్ఠింప గల్గుట అతికష్టసాధ్యము. నారద శుక శంకరుల వలె దివ్యసత్యముల నుపదేశించుటకు భగవదానుగ్రహ మును గురువు పొందవలెను. నైతిక, ఆధ్యాత్మిక, శీల సంపదలు గురువులో మూర్తీభవించవలెను.

గురువులు వందల కొలది లభింతురుగాని, సచ్ఛిష్యులు అరుదుగా కాని దొరకరు. శారీరక, మానసిక, ఆధ్యాత్మిక వికాసమునకు వలయునట్టి సమగ్రవిద్యాభ్యాసమే విద్యార్థులకు ఆవశ్యకము.

— శ్రీ రామకృష్ణ పరమహంస

# స్త్రీ - భక్తి

స్త్రీలకు ముంగోపము తగదు. వారు ఓరిమి నలవఱచు కొనవలెను. వినమ్రత యొక్కటియే స్త్రీలకు విభూషణము. వారికి శైశవముననుు, బాల్యముననుు తల్లిదండ్రులు, యౌవనమున భర్తలు, వృద్ధాప్యమున కుమారులు పోషకులు. స్త్రీలు ఓరిమి నభ్యసించి తల్లిదండ్రుల యొక్కయు, భర్తయొక్కయు, కుమారుల యొక్కయు మెప్పును బడయవలెను.

అదృష్టము పండుట చేతనే మనకు మానవజన్మ లభించింది. దైవమునందు పరిపూర్ణభక్తి కలిగి యుండుము. పని ఒత్తిడి వలన ఏమాత్రం తీరిక లేకుండు వేళలో కూడ దైవప్రార్థనకు కొంత కాలమును వెచ్చింపుము. ఇతరవిషయముల నెఱుగుటకై కుతూహలము చూపకుము. ఎవరితోను విస్తారముగా చనువు కల్పించు కొనకుము. ధ్యాన ప్రార్థనా కాలమును క్రమక్రమముగా అధికము చేయుము.

మగవారితో, నీ తండ్రితో, నీ సోదరునితో గూడ విస్తారము మచ్చికగా నుండవలదు. ఇతరుల విషయము ఇక వేరే చెప్ప వలెనా? మగవా రెవరితోను ఒక వేళ భగవంతు డారూపమున వచ్చినను మచ్చికవలదు.

నీ ప్రేమను ఏమానవుని యందైన నుంచినచో నీకు సంతాపము తప్పదు. లోకు లందరి యెడల నీ ధర్మమును నిర్వర్తించు చుండుము. నీ ప్రేమమాత్రము భగవంతు నొక్కని యందే నిలుపుము. ఐహికప్రేమ లెప్పుడును చెప్పరానంత పరితాపమునకు కారణమగును. భగవంతుని ప్రేమించగల స్త్రీ ఎంతో అదృష్టవంతురాలు. భగవంతుని ప్రేమించుట సంతాపకారి కాజాలదు.

మాటలచేత కూడా ఇతరులను నొప్పింపరాదు. సత్యమైనను అప్రియముగా నుండు దానిని అనవసరముగా పలుకరాదు. పరుషవాక్యము లాడుట కలవాటు పడినవారి స్వభావము కూడా పరుషమై పోవును. నోరు స్వాధీనములో లేని వానికి ఇది అనదగినమాట, ఇది అనదగని మాట అని గ్రహించు శక్తి కూడ లేకుండా మొద్దుబారి పోవును.

మనకు కావలసినది ఈశ్వరకృప ఒకటియే. అది భగవన్నామ స్మరణము వలననే సిద్ధించును. మీ ఆచరణమందును, మాటలందును, చేతలందును చిత్తశుద్ధి కలిగి యుండుడు. అందుచే ఎంత ఆనందం కలుగునో మీకే తెలియును. భూమిపై వుండు సర్వప్రాణుల మీద ఆయన కృపారసము సర్వదా వర్షించుచుండును. అందుకై యాచింప నవసరంలేదు. నిష్కపటముగా ధ్యానము నభ్యసింపుడు. భగవంతుని ఆకర్షించునవి చిత్తశుద్ధియు, సత్యశీలతయు, ప్రేమయు మాత్రమే.

మానవుడు ఎప్పుడూ ఏదో ఒక కార్యమునందు నిమగ్నుడై యుండవలెను. ఏపని చేయకుండా ఊరకుండరాదు. అట్లున్నచో చెడు తలంపులు మనస్సులో ప్రవేశించును.

నిష్ఠ లేకుండా గంటల కొలది భగవంతుని ప్రార్థించుట కన్న, ఏకాగ్రబుద్ధితో రెండు నిమిషములపాటు భగవత్ప్రార్థన చేయుట మేలు, శ్రేష్ఠము.

నీవు చేయు సత్కర్మము నీ పూర్వ దుష్కర్మమును పరిహరించును. మంత్రోచ్చారణచే శరీరము కల్మషరహితమగును. భగవన్నామస్మరణము మానవుని పవిత్రమొనర్చును. జప ధ్యానముల చేతను, పారమార్థిక చింతనము చేతను పూర్వజన్మలో చేసిన పాపములు నశించును.

— **శ్రీమతి శారదామాత**

# విద్య - వినయం

విద్య యొక్క ముఖ్య ప్రయోజనం వినయం. వినయమంటే అణకువ. అణకువలేని చదువు ఒక చదువుకాదు. తన్ను తాను సంయమించుకొనే మంచిగుణం విద్యచే అలవడాలి. సత్యస్వరూపం తెలుసుకోవడమే విద్యా ప్రయోజనం.

ప్రస్తుత చదువులవల్ల ఈ ప్రయోజనం చేకూరుతున్నదా? లేదు. ఈ విద్య వల్ల రావలసిన వినయం మాత్రం మనకు అంటడం లేదు. జనులు గుణవంతులుగా తయారుకావడం లేదు. ఇంకా కొంచెం పరిశీలనాదృష్టితో చూస్తే చదువురాని గ్రామీణుల మంచితనం పట్టణాలలోని ప్రజలకు లేదు. కొండజాతి వారికున్న సుగుణాలు విద్యావంతుల కున్నట్లు కనపడదు. వారికి మేజిస్ట్రేటు కోర్టులుగాని, హైకోర్టులుగాని లేవు. యూనివర్శిటీలు, కాలేజీలూ అధికంగా ఉన్న చోటులలో న్యాయస్థానాలున్నూ ప్రబలినవి. మోసం, దగా, లంచగొండితనం, అన్యాయం, జేబు దొంగతనం—ఇవన్నీ పట్టణములయందే అధికంగా కనపడుతుంది.

చదువు అంటే డిగ్రీలు సంపాదించడమే గాదు. సత్సంస్కారాలూ, సద్గుణాలూ అలవరచుకోవాలి. వినయ విధేయతలు నేర్వాలి. మానవుడు భౌతికంగానే కాక పారమార్థికంగా కూడ ఎత్తుగా పెరగవలసిన ఆవశ్యకత ఎంతైనా వున్నది. అట్టి ఔన్నత్యం ఒక్క జ్ఞానం మూలంగానే కల్గుతుంది. అట్టి జ్ఞానం భక్తిద్వారా సాధ్యపడుతుంది. జ్ఞానం వల్ల వివేకోదయం కల్గుతుంది. వివేకం వినయాన్ని చేకూరుస్తుంది. అసలు విద్య యొక్క సరియైన ప్రయోజనం అదే.

**'శైశవే భ్యస్త విద్యానాం. విద్య శైశవమునందే నేర్వాలి. భక్తి శైశవము నుంచే అభ్యాసం చేయాలి. ప్రతిదినమూ పాఠాలు**

చదువుకోడానికి ముందు ఒక పదినిమిషాలైనా సరస్వతి ముందు మౌనంగా ధ్యానం చేయడం అత్యవసరం. ఏదో పది శ్లోకాలు వల్లించినాము కదా, ఇక పూజ ఐనట్లే అన్న మనోభావం ఉండరాదు. ధ్యానంలో భావశుద్ధి ప్రధానం. భావము గాఢతయే ప్రార్థన కీలకం. నిశ్చలమైన భక్తితో సరస్వతి ముందు మౌనంగా కూర్చుండి గురుధ్యానమూ, దైవధ్యానమూ, ప్రగాఢమైన భావంతో చేయడమే ప్రార్థనా రహస్యం.

ఇట్టి అలవాటు ముదిరే కొద్దీ మనలో దైవికమైన భావాలు ఉత్పన్నమై, దుష్టాలోచనలు మనోరంగం నుంచి క్రమక్రమంగా తొలగిపోతవి. మనస్సు నిర్మలమవుతుంది. మంచి ఆలోచనలు వస్తాయి. మంచిపనులు చేయాలనే తలంపు కల్గుతుంది. తద్వారా మంచి సంస్కారాలు, మంచి గుణాలు అబ్బుతాయి. వినయాదులు వాటంతట అవే వస్తాయి. విద్యయొక్క అసలు పరమావధి అప్పుడే సఫలీకృతమవుతుంది.

— శ్రీ కంచి కామకోటి జగద్గురు

*

# తల్లిపాలు - డబ్బాపాలు

పాఠశాలలో ఉపాధ్యాయులు సమర్థవంతమైన బోధనాశక్తి, శ్రద్ధ, పట్టుదల కలిగివుండి, ఉన్నతవిద్యాప్రమాణాలుగల విద్యార్థులను తయారుచేసిననాడు ప్రయివేటు ట్యూషన్లు, గైడ్లు యొక్క ఆవశ్యకత వుండదు.

పాఠ్యపుస్తకము ‘ తల్లిపాలు ’ అయితే, ‘ గైడు ’ డబ్బాపాలు. తల్లి ఏవిధంగా తన పిల్లలను తీర్చిదిద్దడానికి ఎంత శ్రమిస్తుందో, అదేవిధముగా పాఠశాలలోని ఉపాధ్యాయులు బాలబాలికలను సక్రమమార్గాన పెట్టడానికి శ్రమించగలిగిన నాడు పిల్లలు పాఠశాలలలోని ఉపాధ్యాయులను తల్లులలాగా, ప్రయివేటు చేప్పే మాష్టర్లను సవతితల్లుల్లా భావిస్తారు.

# ఆదర్శం - త్యాగం

"ఈ అశాశ్వతమైన ప్రపంచంలో ప్రతిదీ మరణిస్తుంది, నశిస్తుంది. కాని ఆశయాలు, ఆదర్శాలు నశించవు. ఒకవ్యక్తి ఒక ఆశయం కోసం మరణించవచ్చు, ఆదర్శానికి బలికావచ్చు. కాని అతని అనంతరం అదే ఆశయం, ఆదర్శం కొన్ని వేల మనస్సులలో ప్రవేశించి రూపం దాలుస్తుంది. ఈరీతిలో ఉత్తమ ఆకాంక్షలు ఒక తరంనుండి మరొక తరంవారికి అందజేయబడుతాయి. ప్రపంచంలో ఏ ఆశయం, ఆదర్శమూ బాధలు, యాతనలు అనుభవించకుండా సాధించ బడలేదు. ఒక సిద్ధాంతం కొరకు, ఒక ఆశయం కొరకు, ఆదర్శం కొరకు జీవితాన్ని అర్పించి అవసరమైతే మరణించడంలో నున్న ఆనందం ఇంకెందులో నున్నది? తన అనంతరం తన ఆత్మ అనేకమంది యొక్క మనస్సులలో ప్రవేశించి వారిని ఉత్తేజపరచి తాను అసంపూర్తిగా వదలివేసిన పనిని వారిచేత చేయిస్తుందనే సంతృప్తి కంటే మిన్నమైన సంతృప్తి ఎందులో వున్నది?

బాధల నెదుర్కోవడం వలన, త్యాగంచేయడం వలన ఎవడూ ఏమీ కోల్పోడు. భూమి మీద అత డేదైనా కోల్పోయినట్లయితే, నశించనటువంటి కీర్తికి అతడు వారసుడు కావడం ద్వారా పోగొట్టుకొనిన దాని కంటే అధికంగా మరలపొందుతున్నాడు.

జాతి జీవించడం కొఱకు వ్యక్తి త్యాగం చేసి తీరాలి. జాతి అభివృద్ధి గాంచుటకు వ్యక్తి కృషిచేయాలి. అవసరమైతే సర్వస్వాన్ని అర్పించాలి. మరణించడానికి కూడా వెనుకాడరాదు. ఈనాడు నేను మరణిస్తాను, అందుమూలాన భారతదేశం జీవిస్తుంది. స్వతంత్రాన్ని, ఘనతను పొందుతుంది."

— నేతాజీ సుభాస్ చంద్రబోస్

# వివేకం - జ్ఞానం

"బాహుబలంతో సాధించలేనిది బుద్ధిబలంతో సాధించవచ్చును. బుద్ధి తర్కించగలదు. బుద్ధియొక్క ప్రధాన లక్షణం వివేకం. వివేకం మంచి చెడుగులను, ధర్మాధర్మములను, సత్యాసత్యములను వివేకించి నీ ఆత్మోన్నతికి సాధన భూతమైన ఋజుపథాన్ని చూపుతూ వుంటుంది.

వివేకం ఒక్కమారుగా ఉదయించదు. నీలో సత్య జిజ్ఞాస ఎక్కువైన కొద్దీ, పూర్వవాసనల నతిక్రమించిన కొద్దీ బుద్ధిలో దాగియున్న వివేకం ప్రజ్వలించి, నిన్ను ఊర్ధ్వముఖమునకు గొనిపోతుంది.

వివేకరహితమైన బుద్ధి ఆత్మనాశనకరం. వివేకసాధన కత్తిసాము వంటిది. దీనినే పెద్దలు అసిధారావ్రత మన్నారు. తీక్షణమైన కత్తి అంచుమీాద నడక కంటే దీని సాధన మిక్కిలి కష్టం.

బుద్ధి వక్రించినచో లోకమునకెల్ల మహానష్టము వాటిల్లును. బుద్ధి ఇంద్రియాలవలె అతి చంచలమైనది. ఇప్పుడు పుట్టిన తలంపు మరుసటి క్షణము ఉండదు. అందుకే 'బుద్ధి చంచలమైనది' అన్నారు పెద్దలు. బుద్ధి నీ సర్వస్వము అని భ్రమించరాదు. బుద్ధి నీ లోపల పనిముట్టు మాత్రమే.

బుద్ధికి సహజమైన వెలుగు లేదు. సూర్యుడు స్వయం ప్రకాశకుడు. చంద్రుడు కాదు. చంద్రుని ప్రకాశం చంద్రునిది కాదు. సూర్యుని వెలుగే చంద్రుని మీాద ప్రతిఫలించి, దానికి కూడ వెలుగున్నట్లు భ్రమ కల్గుతున్నది. అట్లే బుద్ధి యొక్క వెలుగు కూడా స్వయంప్రకాశం కాదు.

బుద్ధిలో దాగియున్న విశ్వవ్యాప్తమైన జ్ఞానము స్వయం ప్రకాశమైనది. దాని వెలుగు కొంచెం నీ బుద్ధిని ప్రకాశింపజేస్తున్నది. అట్టి స్వయంప్రకాశితమైన జ్ఞానాన్ని వివేకంతో సముపార్జించిన వ్యక్తిని బుద్ధికుశలత గలవానిగా ప్రపంచం పరిగణిస్తుంది."

— **ముట్నూరి కృష్ణారావు**

# ధర్మం - మతం

"ధర్మానికి రాజకీయాలతో సంబంధం లేదని అనేవారికి ధర్మమంటే ఏమిటో ఎంతమాత్రం తెలియదని నేను నిస్సందేహంగా అనగలను. లోకకల్యాణార్థం మానవు డెటువంటి ధర్మమార్గా న్ననుసరించాలో మతాలు బోధిస్తాయి. మనుష్యుల శ్రేయస్సుకే మతా లున్నాయి. అన్నిమతముల సారం మానవ శ్రేయస్సే. మతవిశ్వాసం మానవుని జీవితానికి చుక్కాని. మతము లనేవి ఒకే గమ్యానికి చేర్చే విభిన్నమార్గాలు. మతము లనేవి మానవు లను చీలదీసేవి కావు. అందరిని ఏకంచేసేవి.

దేవాలయాలు, మసీదులు, చర్చీలు ఉండటం పాపమని, అది మూఢ సంప్రదాయమని భావించే వారితో నే నేమాత్రము ఏకీభవించను. అందరికీ చెందిన ఆరాధనాకేంద్రా లుండడం మానవావళికి అత్యంతావశ్యకం. మతము లేనిదే మానవుడు మనజాలడు.

సత్య సాక్షాత్కారమే అన్నిమతముల గమ్యం. ఆధ్యాత్మికశక్తిని, శీలసంపదలను యినుమడింప జేయడమే మతముల పరమావధి. ప్రతివారు తమ మతంతాలూకు మూలసూత్రాలను, ప్రధాన లక్షణాలను క్షుణ్ణంగా తెలుసుకోవాలి. ప్రతివారు తమ మతభావాలను ఎలా గౌరవించుకుంటారో, అన్యుల మతభావాలను కూడా అలాగే గౌరవించాలి. మతా లన్నింటిని గౌరవించే సహనశక్తి యున్నప్పుడు వివిధమతముల మధ్య సంఘర్షణ లుండవు.

మన దేశంలో ఎన్ని మతాలకు చెందినవార మున్నప్పటికి, మన మంతా ఒకే జాతికి చెందినవార మనే భావం మాత్రం విస్మరించరాదు."

— **మహాత్మాగాంధీజీ**

# "మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ"

భారతీయ సంస్కృతికి ప్రధాన సూత్రము "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ" అనే పవిత్ర శాసనము. దీనిని ధిక్కరించిన దేవుడు కూడా సహించడు.

తల్లి శరీరాన్ని యిస్తుంది. తండ్రి రక్షణ యిస్తాడు. గురువు బుద్ధి వికాసానికి తోడ్పడుతాడు. అతిథులు సంఘంలో నీకు సరియైన స్థానాన్ని యిస్తారు. కాబట్టి వీరందరూ దైవ సమానులు, పూజ్యులు.

జన్మనిచ్చి, రక్షణ యిస్తూ పోషణ బాధ్యతలను స్వీకరిస్తున్న తల్లిదండ్రుల యెడల, బుద్ధివికాసం చెందడానికి అవసరమైన విద్యనందజేస్తున్న గురువు యెడల, సంఘంలో గౌరవప్రదమైన స్థానాన్ని కలుగజేస్తున్న అతిథుల యెడల ఎల్లప్పుడూ కృతజ్ఞులుగా వుండవలెను. కృతజ్ఞత చూపకపోతే మిమ్ము మీరు మోసగించుకున్నట్లే. కృతజ్ఞత లేని మానవజన్మ జన్మకాదు. అందుకని పిల్లలు మొట్టమొదట నేర్చుకోవలసినది కృతజ్ఞత.

మీ హృదయాలను ఆలయముగా మార్చుకోండి. మీ కాలాన్ని వ్యర్థపరచక భగవంతుని చింతనలో గడపండి. మీ హృదయాల్లో వున్న భగవంతుడే అందరి హృదయాల్లో వున్నాడన్నది మరవవద్దు. పరులకు హాని కలిగిస్తే మీలో వున్న దేవునికి హాని కలిగించినట్లే.

మనం ఏ పనిచేసినా దానికి తప్పక ప్రతిచర్య వుంటుంది. అందువలన మంచిపనినే చేయవలెను. మంచి విషయములు నేర్చుకొని పెద్దలయిన తరువాత వీటిని వదలక మీ భావిజీవితంలో

ఆచరణలో పెట్టవలెను. మీరు ఎటువంటి పరిసరాలలో వున్నా వీటిని వదల కూడదు. ఎక్కడ వున్నా సేవ మీ కర్తవ్యం. నిద్ర లేచినప్పటినుంచి రాత్రి పడుకునే వరకు మీరు చిరునవ్వుతో, ప్రేమ, దయలతో కూడుకొన్న ప్రవర్తనతో వుండవలెను.

భగవంతుని దగ్గర ఆనందం వుంటుంది. మీరు ఆనందంతో వున్నారంటే భగవంతుడే మీలో వున్నాడని అర్థం. నీ దినచర్య రోజూ ప్రేమతో మొదలు పెట్టు. ప్రేమతో నింపు. ప్రేమతో గడుపు. మీరే దేశభవిష్యత్తుకు పునాదులు. ఈనాటి బాలలు రేపటి తండ్రులు. బాలికలు రేపటి తల్లులు. మీరు సరియైన మార్గంలో నడిస్తేనే దేశానికి మంచి భవిష్యత్తు వుంటుంది.

పవిత్రమైన గ్రంథములనుండి పవిత్రమైన విషయాలను నేర్చుకోవాలి. ప్రస్తుతం నశించిపోతున్న సత్యం, ధర్మం, శాంతి. ప్రేమలను పునరుద్ధరించే పౌరులుగా మీరు తయారు కావాలి,

మీరందరూ భారతమాతకు గర్వకారణ మయిన బిడ్డలుగా ఎదిగి విలసిల్లుతారని ఆశిస్తూ, ఆశీర్వదిస్తున్నాను.

— శ్రీ సత్యసాయిబాబా

*

క్రమశిక్షణ అను శాసనముల పేరిట ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యములను హరించరాదు. ప్రజాస్వామ్యంలో ప్రజలు కోరుకొనేది స్వాతంత్ర్యంలేని క్రమశిక్షణ మాత్రం కాదు. స్వేచ్ఛలేని అనుశాసనం అంతకన్నా కాదు. భావప్రకటన మృగ్యమైన పరిపాలన కాదు. హక్కులు లేని విధులు కావు.

రాజమండ్రి సెంట్రల్ జైలు, 28-9-'76 — కొమరగిరి

# పునాదిరాయి

"పునాదిరాయి మనకు ఆదర్శం. అది కంట పడదు. దానికి మెప్పులేదు. అందంగా ఉండక పోవచ్చు. నునుపుగా వుండక పోవచ్చు. అయినా అదే మూలాధారం. అది ఏ మాత్రం కదిలినా, కట్టడం మొత్తం కుప్పగా కూలి పోతుంది. సౌధం నేలమట్ట మవుతుంది.

శిఖరం కంటే, మరే ఇతరభాగం కంటే పునాదిరాయియే అతి ముఖ్యమైనది. అయినా ఆ రాయి తన ఉనికినే విస్మరించి, తనను కాదనుకొని, అక్కడే పడివుండి సేవ చేస్తూ ఉంటుంది. తన విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తిస్తూ ఉంటుంది.

అట్టి భావనతోనే ప్రజాసేవ చేయాలి. తాను వెలుగులోకి రావాలని, పైనే వుండాలని, నల్గురూ తన్ను ఒహో అనాలని, గొప్పగా పొగడాలని కోరుకోవడం వ్యక్తిలోని ఆంతరిక అల్పత్వాన్ని, స్వోత్కర్షను సూచిస్తుంది.

అయినా శిఖరాగ్రాన కూర్చోటంలో ఘనత ఏముంది ? కాకి కూడ అక్కడ కూర్చో గలదు!"

— శ్రీ గురుజీ గోల్వాల్కర్

*

"నీతిలేని వాణిజ్యం, కృషిలేని సంపద, శీలములేని విద్య, త్యాగములేని అరాధన, మానవతలేని శాస్త్రవిజ్ఞానం, నియమ నిష్ఠలులేని రాజకీయం - ఇవే సామాజిక పాపాలు.

— శ్రీ మహాత్మాగాంధీజీ

# నాయకత్వం

ఉత్తమ వంశంలో జన్మించడంవల్ల నాయకత్వం సంప్రాప్తించదు. అంద చందాలను చూచిగాని, విగ్రహపుష్టిని చూచిగాని నాయకత్వం వచ్చి వరించదు. విద్యవల్లనేమి, పాండితి కారణంగానేమి నాయకత్వం లభించదు. వక్తృత్వంవల్ల నాయకత్వం సిద్ధించదు. ధనరాసులవల్ల నాయకత్వయోగం పట్టదు. కుతంత్రంవల్ల నాయకత్వం అబ్బినా, అది ఎంతో కాలం నిలవదు. అదృష్టంవల్ల నాయకత్వం ప్రాప్తించదు. దానిని ఆశించడంవల్లనేమి, దానికై దుగ్ధవల్లనేమి నాయకత్వం చేజిక్కదు. నిజానికి నాయకత్వం వ్యక్తిగత స్థితిగతులనుబట్టికాక, శక్తిసామర్థ్యాలనుబట్టికాక చరిత్ర పరిణామం వల్లనే సిద్ధిస్తుంది. ఒక్కొక్క యుగసంధిలో ఒక్కొక్క నాయకుడు తలయెత్తుతాడు. కేవలం కాలప్రవాహాన్నిబట్టి, దేశపరిస్థితులనుబట్టి, చరిత్ర పరిణామాన్ని అనుసరించి, అందుకు అనుగుణమైన వ్యక్తి నాయకుడు కావడం సంభవిస్తుంది.

గాంధీజీకి భారత ప్రజానాయకత్వం ఒకరిచ్చిందికాదు. ఒకరు తొలగించగోరితే పోయేదికాదు. చివరికి తనకు తానుగా ఆయనైనా దానిని త్రోసిపుచ్చలేడు. చరిత్రే ఆయనను ఎన్నుకొన్నది. చరిత్ర ఆయనచేత తన ఇచ్ఛా పరిపూర్తి చేయించుకొంటున్నది. చరిత్ర సంకల్పాన్ని – దీన్ని భగవత్సంకల్పమని కొందరనవచ్చు – చివరికి గాంధీ సయితం అతిక్రమించలేడు.

ది 8-8-1945 —శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

# గొప్పతనము - మంచితనము

గొప్పతనము, మంచితనము అనునవి మానవుని జీవిత ప్రయాణమును నడుపుచున్న రెండు తారలు. అవి రెండు మార్గములకు దర్శకములు. గొప్పతనము సుందరివలె ఆకర్షించును. మంచితనము మాతవలె పోషించును. గొప్పవారు ఇతరుల వలన పెక్కు లాభములు పొందగలరు. మంచివారు ఇతరులకు పెక్కు విధముల తోడ్పడగలరు. గొప్పతనము వలన తృష్ణ కలుగును. వీరు ద్వైతత్వ మనుభవింతురు. ఇది స్వర్గసుఖము నిచ్చును. మంచితనము వలన తృష్ణ తీరును. వీరు ద్వైతత్వ మనుభవింతురు. ఇది బంధవిమోచనము కలిగించును.

రజోగుణము గొప్పతనమునకు కారణము. సత్వప్రవృత్తి మంచితనమునకు కారణము. గొప్పవారి వలన లోకమున దుష్కార్యములు సాధించబడు చున్నవి. మంచివారివలన సద్వాని యోగము, పరోపకారము జరుగుచున్నవి. గొప్పదనముపై ప్రలోభము నశించిన వారికే మంచితనము యొక్క మాధుర్యము చేజిక్కును. గొప్పతనము వలన సత్కార్మాచరణాభిలాష పెంపొందును. మంచితనము వలన నిష్కామకర్మ యోగం సిద్ధించును. కర్మఫలత్యాగము, అనగా సన్యాసము చేజిక్కును.

సన్యాసము పుచ్చుకునేది గాదు- వచ్చేది గొప్పవారు క్రమముగా మంచివారగుటకు సంకల్పించు కొన్నచో అది తప్పక సాధ్యపడును.

## పుణ్యము - పాపము

పుణ్యపాపములు వేరు. సుఖ దుఃఖములు వేరు. పుణ్యము వలన తాత్కాలిక సుఖము గాని, పాపమువలన తాత్కాలిక దుఃఖము గాని కలుగవు. సుఖము నేర్పరితనము వలనను, దుఃఖము నేర్పరి తనము లేకపోవుట వలనను కలుగును. మాట నేర్పరితన మున్న

వాడు తాత్కాలిక సుఖము నందును. దానికి సత్కర్మ తోడైన చో తరుగని సుఖము వెంట జీవితము నడచును.

కనుక సత్కర్మకును, సుఖమునకును నడుమ నేర్పరితన మను నొక ద్వారబంధము తాళము బిగించబడి యున్నది. జిహ్వాగ్ర మను తాళముచెవితో దానిని వివృతము చేసికొన వలెను. మాట, మంచితనమునకు మనస్సంయమము, క్షమ, సహనము, ఈర్ష్య లేకుండుట కావలెను.

## విద్య - పాండిత్యము

తా నేమి చేయవలెనో, ఎట్లు చేయవలెనో, తనకు, ఇతరులకు సంబంధమేమో తెలుపునది-విద్య. ఇది పానీయము వంటిది. లోకములోని బహువిధానములను, శాస్త్రములను, మార్గములను, అరుదైన విషయములను, వింతలను తెల్పునది-పాండిత్యము. ఇది పరిమళము వంటిది.

బహుభాషలలోని పుస్తకములను పఠించుట ఎట్లో తెలుపునది అక్షరాస్యత. ఇది నింపవలసిన పాత్రవంటిది. విద్యవలన వర్ధించిన విస్తరి యెగిరిపడక అణిగియున్నట్లు - పాండిత్యము, అక్షరాస్యత అణిగి యుండును. విద్యలేని పాండిత్యము తిని విడిచిన ఎంగిలి అన్నమువలె నితరుల కుపయోగింపనిది.

విద్య వినయము నొసగును. సుఖ శాంతు లనుభవింప వచ్చును. పాండిత్యము గొప్పతనము కలిగించును. కీర్తిని, అధికారమును సంపాదించుకొన వచ్చును. అక్షరాస్యత తనను మిగిలిన వారికన్న వేరుగా నిలుపును. ధనమును, వస్తు వాహనములను కూడబెట్ట వచ్చును.

కాని, సౌఖ్యము కావలసినవారు విద్యను గౌరవించి, పాండిత్యము, అక్షరాస్యతలను బానిసలుగా చేసికొని సేవచేయు చుందురు.

## ధర్మము - కర్తవ్యము

ధర్మము అద్దము వంటిది. అది మన కర్తవ్యమును ప్రభోదించును. అది మన ప్రవర్తన మనకు చూపించును. తండ్రి కెదురు తిరిగినవాడు తన కొడుకుచే అవమానించబడును. మిత్రులను మోసగించినవాడు మిత్రులను కోల్పోయి తన్ను తాను మోసగించుకొనును. యాజమానికి విధేయత చూపించనివాడు తనభృత్యునిచే తిరస్కరింపబడును. ఫలాపేక్షతో మంచిపనులు చేసినవాడు తనపనులను లంచమిచ్చి చేయించుకొనవలసి యుండును. పేరు ప్రతిష్ఠలకై పాటుపడువాడు, మొగమాటమునకు బద్ధుడై పాటుపడవలసి యుండును.

పుణ్యలోకములను కోరి సత్కర్మ లాచరించినవాడు, విశ్వాస రహితుల చేష్టలకు గురియై శోక మోహములకు కీలుబొమ్మ యగును. కారణము లేకమే ఇతరులను సుఖపెట్టువాడు కారణము లేకయే సుఖపడును.

సత్సాంగత్యము, సద్గ్రంథపఠనము, విద్యావ్యాసంగము వలన మానసికారోగ్యము నిలబడును. తాను చేసిన మంచిపనిని ఇతరులు గుర్తించవలెనని, కృతజ్ఞులై యుండవలెనని భావించుట అనారోగ్య లక్షణము. ఇతరులపై వాత్సల్యము కలిగి, తన బాధ్యతలను నిర్వర్తించుట ఆరోగ్య లక్షణము.

శారీరకమైన అనారోగ్యము ఔషధము వలన శమించును. మానసికమైన అనారోగ్యము పెద్దలను సేవించుట వలన ఉపశమించును. మానిసికారోగ్యము లేని వానికి కేవలము భౌతిక సుచిత్వము, ఔషధ సేవనము వలన ప్రయోజన ముండదు. ఒకవేళ వుండినా అది తాత్కాలికము మాత్రమే. నిరంతర భక్తి భావము వలన మానసిక శారీరకారోగ్యములు పరిపూర్ణత చెందును.

— కులపతి శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య

# స్నేహం - మిత్రుడు

"విశాలమైన హృదయం, వ్యక్తిత్వం కలిగిన మనుష్యుల మధ్యనే స్నేహం పొసగడానికి అవకాశం వుంటుంది. సంకుచిత మనస్తత్వం, పెంకితనం కలిగిన మనుష్యులు నిజమైన స్నేహితులు కాలేరు." —ఛార్లెస్ కింగ్స్లే.

నిజాయితీ స్నేహానికి పునాది వంటిది. మానవ స్వరూప స్వభావాల అధ్యయనానికి స్నేహం ఎంతగానో దోహదకారి అవుతుంది. ఒక పొరపాటు కప్పిపుచ్చుకోవడానికి పది అబద్ధాలు ఆడవలసి రావచ్చు. అబద్ధాలు ఆడి స్నేహాన్ని నిలబెట్టుకోవడానికి ప్రయత్నించే కంటే నిజాన్ని ధైర్యంగా ఒప్పుకోవడంవల్ల మిత్రుడి ముందు నీ గౌరవం పెరుగుతుందే తప్ప ఏ మాత్రం తరగదు. స్నేహం చిరస్థాయిగా వర్ధిల్లుతుంది.

స్నేహాన్ని చెడగొట్టుకోవడానికి ఎంతోసేపట్టదు. నిజమైన స్నేహితుడు దొరకడానికి చాలాకాలం పడుతుంది. రోజు కొక క్రొత్తవ్యక్తితో స్నేహం చేయడానికి ప్రయత్నించే కంటే అసలు స్నేహితులు లేకుండా వుండటమే ఉత్తమమైన మార్గం. స్నేహంలో గాని, ప్రేమలో గాని నిజాయితీ చాలా అవసరం. నిజాయితీలేని మనిషిని అందరూ దూరంగా వుంచుతారు.

మంచి అన్నది కనిపించినప్పుడు మిత్రుణ్ణి హృదయపూర్వకంగా ప్రశంసించాలి. బలహీనతలు కనుపిస్తే వాటిని వీలైనంత వరకు విస్మరించాలి. మిత్రుడి వల్ల ఏదైనా పొరపాటు జరిగితే దానిని గురించి అతనితో నిర్మొహమాటంగా మాట్లాడాలి. కాని అలా మాట్లాడేటప్పుడు అతని అంతర్యాన్ని నొప్పించడానికి మాత్రం ప్రయత్నించరాదు.

ఎదుటివాళ్ల కంటే తానే అన్నివిషయాలలో మిన్న అనే భావం మనస్సులోనికి రానీయరాదు. అవతలి వ్యక్తి కంటే తానే ఎక్కువ పొరపాట్లు చేస్తూ వుండవచ్చునని భావించాలి. అవతలి

వ్యక్తి వేలెత్తి చూపక పోవడంలోనే అతని గొప్పతనం ఇమిడి వున్నది. ఆ మాటకొస్తే పొరపాట్లు చేయని వాళ్లెవరైనా వుంటే, వాళ్లు అసలు ఏ పని చేయలేని వాళ్లలో జమ.

ఇతరుల దోషాలను విస్మరించి, క్షమించడం చాతకాక పోతే—మనదోషాలు కొండంతలుగా పెరిగిపోయే ప్రమాదం కూడా వున్నది. నీలో పొరపాటున్నదని ఎవరైనా అంటే, అదేమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించాలే తప్ప బుకాయించ డానికి ప్రయత్నించ కూడదు.

కోపతాపాలు అందరికీ, ఏదో ఒకప్పుడు వచ్చేవే. అయితే వాటిని సమయం, సందర్భం చూచుకొని మరీ ప్రదర్శించాలి. చీటికి మాటికీ ప్రదర్శించితే స్నేహితులు దూరమవుతారు. పగ, కచ్చ అనేవి మరింత హానినీ, కీడునూ కలుగజేస్తాయి. వాటివల్ల సాధించే దేదీ వుండకపోగా, జీవితంలో అనేక కష్ట, నష్టాలకు గురి అవుతాం. క్షమాగుణం వల్ల మీ వ్యక్తిత్వం ఇనుమడిస్తుంది; దేదీప్యమానంగా ప్రకాశిస్తుంది.

మీ ఆంతరంగిక విషయాలను గురించి పదిమంది ముందు చర్చించకండి. ఎదుటివారు మిమ్మల్ని అలుసుగా చూడవచ్చు. మాట్లాడేటప్పుడు పెద్దపెద్ద పదాలను, సమాసాలను వాడకండి. మీకు తెలియని విషయాలను గురించి అధికంగా మాట్లాడకండి.

అభివృద్ధిలో నున్నప్పుడు అందరూ మిత్రభావమునే చూపుతుంటారు. స్వప్రయోజనం కోసం స్నేహాన్ని ప్రదర్శించుతూ వుంటారు. కాని కష్టకాలం దాపురించినప్పుడు నిజమైన మిత్రులు తప్ప అందరూ దూరమవుతారు. పైపెచ్చు అభాండాలు, అపనిందలు కూడా మోపుతారు. కష్టకాలంలో కూడా ఛాయవలె ఎవరు విడవకుండా అంటిపెట్టుకొని వుంటారో, అట్టివారే నిజమైన 'మిత్రులు'. వారిదే నిజమైన 'స్నేహం'.

—శ్రీ కొమరగిరి

# మానవజీవితం

మానవజీవితం కోనేరులా పసరెక్కి ప్రయోజనం లేకుండా నిష్ప్రయోజనం కాకూడదు. మానవజీవతం సెలయేరులా ముందుకు సాగిపోతూ వుండాలి. పదిమంది జీవితాలతో కలసి పదిమందికి ప్రయోజనం కావాలి.

మానవజీవితంలోని తీపి, చేదులను చవి చూపిస్తూ, సమకాలిక సామాజిక పరిస్థితులకు ప్రతిబింబంగా నిలచే నాటకం, పదిమాసాలపాటు జనంలో నిలుస్తుంది. జీవితం నాటకం కాకపోవచ్చు. కానీ జీవిత మన్నదే నాటకం. అలాంటి నాటక రంగమే సాంస్కృతిక జీవనరంగానికి పునాది.

మానవజీవితం అనేక కవ్వింపులతో కూడుకొని వుంటుంది. జీవితంలో అనేక వేదనలను అనుభవించవలసి వస్తుంది. బాధలకు గురికావలసి వస్తుంది; కష్టాలను ఎదుర్కొనవలసి వస్తుంది. అభాండాలను మోయవలసి వస్తుంది. అపనిందలకు గురి కావలసి వస్తుంది. అయినప్పటికి కొన్ని సమయాలలో వాటిని గురించి బహిరంగంగా మాట్లాడటానికి అవకాశం కూడా లభించక పోవచ్చును. మన మనస్సులో చెలరేగుతున్న వేదనను, ఆవేదనను పాలుపంచుకొనే ఆత్మీయులు కూడా దగ్గర లేకుండా దూరమై పోవచ్చును. అప్పుడు ఏకాకిగా పయనించ వలసి వస్తుంది. సమస్యలను ఎదుర్కొనలేక, పోరాటం సల్పలేక రాజీ పడితే భౌతికంగా కొంతవరకు సంతృప్తి కలుగుతే కలుగవచ్చు. నీలోని సృజనాకాంక్షను, స్వాభిమానాన్ని అణిచివేసుకుంటే శాశ్వతానందం మాత్రం నీకు లభించదు. దానివల్ల భావితరాలు కూడ నష్టపోతాయి.

జీవితం అంటే తీపీ వుంటుంది, చేదూ వుంటుంది. ఒకడిని ఎల్లప్పుడూ తీపే తినమంటే మొహం మొత్తి వెగటుతో చచ్చిపోతాడు. సుఖంతో పాటు బాధ కూడా ఉంది కాబట్టే జీవితం ఇంత ఉత్తేజకరంగా వున్నది. 'చేదు' ను చవి చూచినప్పుడే 'తీపి' మాధుర్యం అర్థమవుతుంది. కష్టాలను చవిచూచినప్పుడే, సుఖం యొక్క గొప్పతనం బోధపడుతుంది.

సుఖాన్నెలా సంతోషంతో స్వీకరిస్తామో, అదేవిధముగా దుఃఖాన్ని కూడా స్వీకరించడం నేర్చుకోవాలి. స్వసుఖమనే సంకుచితత్వాన్ని అతిక్రమించి ఎత్తునుండి చూచినప్పుడే ధర్మాధర్మాలు స్పష్టముగా కంటికి కనుబడతాయి. ఎవరైతే ధర్మానికి సమర్పించుకుంటారో, వారిని ఏ కష్టమూ లేకుండా చేయి పట్టుకొని ధర్మం నడిపిస్తుంది. మానవుడు దిగజారడం సులభం. పైకి వెళ్ళడం చాలా కష్టం. దానిని అర్థం చేసుకున్నప్పుడే మానవ జీవితం సాఫల్య మవుతుంది.

జీవితసమరంలో నెగ్గాలంటే 'మొహమాటం' ముందు వదులుకోవాలి. అది మహా చెడ్డది. మనిషిని ముందుకు పోనివ్వదు. లోకంలో అనేకరకాల వ్యక్తు లుంటారు. విభిన్నమనస్తత్వాలు గల మనుష్యు లుంటారు. ఈ ప్రపంచంలో పెద్దపులులలాంటి క్రూరస్వభావులూ వున్నారు. తోడేళ్లవంటి వంచకు లున్నారు. నక్కలాంటి జిత్తులమారులూ వున్నారు. మొహమాట పడేవారు, అమాయకులూ వాళ్ళకు ఎర అయిపోతుంటారు. జీవితంలో ప్రతి అడుగూ ఆలోచించి ముందుకు వేయటం నేర్చుకోవాలి. మెలకువగా వ్యవహరించాలి. నీ హక్కుల నెప్పుడూ కాపాడుకోవాలి. ఏమి అడగాలనుకున్నా స్పష్టంగా, ధైర్యంగా చెప్పడం నేర్చుకోవాలి. మొహమాటం ఏమాత్రం పనికిరాదు. ఇది నేర్చుకుంటే జీవితంలో మొదటి పరీక్ష నెగ్గినట్లే.

మానవుని జీవిత గమ్యము సుఖమును కాదు, దుఃఖమును కాదు. దేని నుండి యివి పుట్టునో దానిని వశపరచుకొనుటే జీవిత లక్ష్యము. కొన్ని యెడల సుఖముకంటే, దుఃఖమే విశేషముగా జ్ఞానాన్ని యిస్తుంది. లోక శ్రేష్ఠుల జీవితచరిత్రలను పరిశీలించితే, అందు అధిక సంఖ్యాకులకు సుఖములో కంటే దుఃఖంలోనే జ్ఞానోదయమయినట్లు గోచరిస్తున్నది.

ఈ వాస్తవాన్ని, యథార్థాన్ని గుర్తించినప్పుడే మానవ జీవితం సాఫల్యమవుతుంది.

— శ్రీమతి కొమరగిరి జయప్రద

*

## పలక, బలపం

పశ్చిమ జర్మనీలో ఇప్పుడు అక్షరాభ్యాసాలకు పలకా బలపం మాత్రమే ఉపయోగించడం అక్షరాల జరుగుతున్నది. ఈవిషయంలో పశ్చిమ జర్మనీలోని 'అచెన్' సాంకేతిక విశ్వవిద్యాలయానికి చెందిన పరిశోధక బృందం ఒకటి 1973 సంవత్సరంలో 150 మంది ప్రాథమిక పాఠశాల విద్యార్థులపై పరిశోధనలు జరిపి - పెన్సిల్, ఫౌంటెన్‌పెన్, బాల్‌పాయింట్‌పెన్‌లతో అక్షరాలు దిద్దడంవల్ల దస్తూరి సరిగా కుదరకపోగా పిల్లలకు చదువుమీద వెగటు కల్గటం, తప్పులు వ్రాయడంవంటి 'లెగస్తేనియా' అనే మానసిక వ్యాధికి లోనవడం జరుగుతున్నదని వెల్లడించారు.

కనుక పూర్వంవలె అక్షరాభ్యాసానికి పలకా బలపం ఉపయోగించడం అన్నివిధాలా మంచిది. పలకమీద బలపంతో గట్టిగా అక్షరాల్ని దిద్దడం వలన, స్పర్శవలన అక్షరరూపం మనోఫలకంపై గాఢంగా ముద్రితమవుతుంది. ఆరోగ్యం దృష్ట్యాకూడా కాగితంకంటే పలకే మంచిదని పరిశోధనలు ఋజువుచేస్తున్నాయి. అందువలన పశ్చిమజర్మనీ అంతటా ప్రాథమిక పాఠశాలలో పలకా బలపం వాడటం జరుగుతున్నది.

## ధార్మిక విద్య

"పుస్తకాల ద్వారా పిల్లలలో ధార్మిక భావ వ్యాప్తి ఎంతవరకుసాధ్యమనేది ప్రయోగించి చూచాను. దాని ప్రయోజనం పరిమితం. అధ్యాపకుల ధార్మికా ధర్మాచరణ ద్వారా పిల్లలలో ధార్మిక ప్రవృత్తి ప్రగాఢ మవుతుందని నా దృఢవిశ్వాసం.

ప్రభుత్వ విద్యాసంస్థల నుండి వెలికివచ్చే విద్యార్థులకు ఏవిధమైన ధార్మికవిద్య ఉండడం లేదనేది నిస్సందేహం. భారత జాతి ఆధ్యాత్మికంగా దివాలా తీయకుండా ఉండాలంటే లౌకిక విద్యలతోపాటు ధార్మిక విద్యాబోధనకూడ తప్పనిసరిగా ఉండి తీరాలి.

అంతేకాదు. వృత్తి విద్యావిధానం పిల్లలను ఆదర్శ గ్రామీణులుగా, పౌరులుగా తీర్చి దిద్దుతుంది. ఆరోగ్య సూత్రములకు, ఆహార నియమములకు, కుటుంబ జీవనమునకు సంబంధించిన అంశాలు కూడా విద్యా ప్రణాళికలో భాగం కావాలి."

— శ్రీ మహాత్మా గాంధీజీ

*

## భారత్ లో...

క్రీ. పూ. 300 సంవత్సరమున అలగ్జాండరుతో భారత్‌కు వచ్చిన 'అనిసిక్రిటను' అను చరిత్రకారుడు తాను చూచిన యోగులను గురించి చెబుతూ "అకస్మాత్తుగా ఒక యోగి కూర్చున్నవాడు కూర్చునట్లే నిటారుగా గాలిలో నిలులెత్తు లేచెను, మరొక యోగి నిలకడ నీటిపై జీలగచెండువలె నొక్క అవయవమైనను కదల్చక ఈదుకొని పోసాగెను" అని వివరించెను.

# దేశసేవయే దైవసేవ

దేశ సేవయే దైవసేవ. అదే అనుష్ఠానవేదాంతమని నమ్ము. నీవు ఒక దేశ సేవకుడివి కావాలని కోరుతున్నావా, నీ హృదయాన్ని ఈ దేశ ప్రజల ప్రేమతో శ్రుతి కలుపు. నీవూ వారూ ఒకటే ననుకో. నీకూ వారికీ మధ్య ఒక సన్నటి పొర కూడా అడ్డం లేదనుకో! జాతి కొఱకు ప్రాణత్యాగం చేసిన ఒక ఆధ్యాత్మిక సైనికుడివికా! ఈవిధముగా నీవు భావించు. సకలజాతి నీతో భావిస్తుంది.

ఈ భారతభూమి నా శరీరం. కన్యాకుమారిఅగ్రం నా పాదయుగళం. హిమాలయాలు నా శిరస్సు. నా జటల్లోంచి గంగ ప్రవహిస్తున్నది. నా శిరస్సునుంచి బ్రహ్మపుత్ర ప్రవహిస్తున్నది. సింధునది పొంగిపోతున్నది. వింధ్యాచలాలు నా కటీ మండల మేఖల. కారమాండల్ తీరము నా కుడికాలు. మలబారు నా ఎడమకాలు. నేను భారత సర్వస్వాన్ని. భారతదేశం యొక్క తూర్పు పడమర దిక్కులే నా మహాచేతులు. సకల మానవ ప్రపంచాన్ని ఆలింగనం చేసుకోవడానికి దిక్కులనే యీ చేతులను నేను చాచాను. నా ప్రేమ సర్వవిశ్వాన్ని ఆవరించింది. ఇది నా విశ్వరూపం. అనంతమైన ఆకాశంలో నిలబడి నా విశ్వరూపాన్ని ప్రపంచానికి ప్రదర్శిస్తాను. నేను నడిస్తే సర్వ భారతం నడిచినట్లుంటుంది. నేను మాట్లాడితే అఖండ భారతం మాట్లాడినట్లుంటుంది. నేను గాలి పీలిస్తే మహాభారతం గాలి పీలుస్తుంది. నేను అఖండ హిందూస్థానాన్ని. నేను శంకరుణ్ణి. నేను పరమ శివుణ్ణి. ఇదే దేశభక్తియొక్క సిద్ధస్థితి. ఇదే అనుష్ఠాన వేదాంతం.

ఇతర దేశాలలో భగవంతుణ్ణి తండ్రిగా అర్చిస్తారు. భారత్ లో భగవంతుడు తండ్రిగానే కాకుండా, తల్లిగా కూడా

అర్చించబడుతాడు. 'మాత' అనే పదం భారత వాఙ్మయంలో అతి పవిత్రమైనది. హిందువుడు జబ్బుతో భరించలేని బాధపడు తున్నప్పుడు, అతనినోట వెంట 'హే భగవంతుడా!' అని కాదు వచ్చేది. "అమ్మా!...అమ్మా!" అని వస్తుంది. ప్రతి హిందువుని హృదయాంతరాల్లో నుండి వినిపిస్తుంది అమ్మా అనే శబ్దం. ప్రతిహిందువుని హృదయంలో గాఢోద్వేగాన్ని కలిగిస్తుంది అమ్మ అనే మాట. 'అమ్మ' అనే రెండు అక్షరాలలోనే యిమిడి వున్నది. కమ్మని కథ. అమ్మలేని జీవితం చుక్కానిలేని పడవతో సమానం. జన్మ నిచ్చిన అమ్మను సృష్టి నిచ్చిన దైవంతో సమానంగా భావిస్తాడు ఇచటి ప్రతి హిందువు.

భారతదేశంలో స్త్రీకి అత్యున్నతమైన గౌరవస్థానం వున్నది. ఇచట పురుషుడు తన భార్యను 'నా భార్య' అని పిలవడానికి సాహసించడు. భార్యను గురించి చెప్పవలసి వచ్చినప్పుడు "మా పిల్లవాడి తల్లి, మా కృష్ణుడి తల్లి, మా రాముడి తల్లి" అని చెబుతాడు.

— శ్రీ స్వామిరామతీర్థ

*

## భారత్‌లో...

డా. మాగ్రిగర్ 'సిక్కుల చరిత్ర' అను గ్రంథములో తాను కండ్లారా చూచిన ఒక యోగిని గురించి "40 రోజులు పెట్టెలో పెట్టి భూస్థాపనము గావించిన తరువాత తెరచి చూడగా ఆ యోగి నమస్కరించి మాట్లాడెను. రాజా రంజిత్‌సింగ్ తానే స్వయముగా ఆ యోగి మెడలో బంగారు గొలుసు తగిలించెను" అని వ్రాసెను.

# హిందూధర్మ వైశిష్ట్యము

" విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవ శ్వపాకేచ పణ్డితాః సమదర్శినః "

— భగవద్గీత

తా. విద్యా, వినయము కలిగియున్న బ్రాహ్మణుని యందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కమాంసము వండుకొని తిను చండాలుని యందును సమదృష్టి కలవారే (వారిని సమముగా జూచువారే) పండితులు లేక జ్ఞానులు (ఆత్మానుభవముగలవారు) అని చెప్పబడుదురు.

సామాన్యముగా పండితు లనగానే పాండిత్య ప్రకర్ష, సాహిత్య కౌశలము, వేదవేదాంగాలు, పురాణ ఇతిహాసాలలో మంచి ప్రవేశంగలవా రని చాలామంది భావిస్తుంటారు. కాని భగవద్గీత దీనిని అంగీకరించడం లేదు. సమస్త చరాచర కోటియందు సమదృష్టికలవాడే 'పండితుడు' అని గీత బోధిస్తున్నది. విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని ఏ విధంగా గౌరవించుతారో, అదేవిధముగా ఏ మాత్రం తగ్గకుండా కుక్క మాంసమును తిను చండాలుని కూడా గౌరవించాలని, పవిత్ర భావనతో ఏ విధముగా గోవును పూజించుతామో, అదే విధముగా ఏనుగును, కుక్కను కూడా గౌరవించాలని గీత మనకు ఆదేశమిస్తున్నది.

భారతీయునకు సమస్త వస్తువులు పూజనీయములే. హిందువునకు గర్హింపదగు వస్తువు నీ జగమున లేనేలేదు. ఱాయి మొదలు రత్నము వరకు, పచ్చిక మొదలు పారిజాతము వఱకు, చీమ మొదలు సింగము వఱకు, కాకి మొదలు గరుత్మంతుని వఱకు, మాల మొదలు మహర్షి వఱకు సర్వమును భారతీయులకు దేవతా స్వరూపములే.

తాయిని దేవునిగా భావించి, పంచామృతములచే నభిషేకించి షోడశోపచార పూజలను అతిశ్రద్ధతో గావించుటయు, తులసీ, అశ్వత్థవటాది వృక్షములను బూజించుటయు, విషజంతువులని తెలిసియు పాములకు పాలు పోయుటయు, చీమలకు నూకలిడుటయు, కాకులకు అన్నము పెట్టుటయు, గ్రద్దల కాహార మొసంగుటయు, కుక్కలను భైరవవాహనములని పూజించుటయు, గోవులను, వృషభముల నారాధించుటయు, గుఱ్ఱములను హయగ్రీవ రూపములని యలంకరించుటయు, ఏనుగులను గజేంద్రులని నమస్కరించుటయు, గంగాది నదులు దేవీ వర్గములనియు, పర్వతములు దేవతలనియు వానికి మహత్తరపూజ లొనర్చుటయు— వేయేల నుచ్చ నీచ భేదములు లేక జగమున గల సర్వ వస్తువులను, జంతువులను సమదృష్టితో చూచి పూజించి, ప్రేమించి, గౌరవించగల దివ్యమతమే హిందూమతం. హిందూమతము హిందూధర్మ వైశిష్ట్యము కూడా అదే.

భారతీయుని దృష్టిలో దేవుడు కానిది లేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ"; "సర్వం విష్ణుమయం జగత్"; "సర్వం శివమయం జగత్"; "వాసుదేవః సర్వం"; "మత్తః పరతరం నాన్యత్కించి దస్తి" మొదలగు మహావాక్యములు ఈ సత్యమునే చాటుచున్నవి. ఈ వాస్తవమును, రహస్యమును తెలుసుకోలేక కొందరు అజ్ఞానులు హిందూమతము రాళ్లను, చెట్లను, జంతువులను పూజించు మూఢవిశ్వాసముగల మతమని అవహేళన చేయడం జరుగుతున్నది.

ప్రేమ యను దైవగుణము మానవులవఱకే పరిమితం చేయక జంతుజాలములపైన గూడా విస్తరింప జేయవలెను. అంతేకాదు సమస్త చరాచర ప్రాణికోటి యందు దయ, కరుణ కలిగి వుండాలని గీత బోధిస్తున్నది. భగవంతునియందు భక్తి, జీవరాసుల యెడల ద్వేషము కలిగియున్నచో ఆ భక్తికి అర్థం లేదు.

అది భగవంతునికి ఉపచారం కాదు, అపచారమే అవుతుంది. "సర్వజీవి తిరస్కారః కేశవం ప్రతి గచ్ఛతి." ఏ జీవిని తిరస్కరించినను, బాధించినను భగవంతుని బాధించినట్లే యగును. "నిర్వైర స్సర్వభూతేషు" అన్నట్లుగా సమస్త ప్రాణులయందు ద్వేషము లేకుండా వుండవలెను. సమస్త ప్రాణులు భగత్స్వరూపులు, నారాయణ స్వరూపులు. కనుక సర్వభూతదయ కూడా పరమాత్కృష్టమైన ధర్మములలో ఒకటి.

హిందూ ధర్మంలో ఒక మనుజునికే గాక సమస్తచరాచర ప్రాణికోటికి అత్యున్నతమైన, గౌరవప్రదమైన స్థానం యివ్వబడింది. ముఖ్యంగా భగవద్గీతలో యింకా ఒక మెట్టు పైకి పోయి సర్వమానవ సౌభ్రాతృత్వము (Fraternity) తోనే సంతృప్తి చెందరాదని, 'సర్వాత్మదృష్టి' ని కూడ అలవరచుకోవాలని చెప్పబడినది.

పై భగవద్గీత శ్లోకము అత్యున్నతమైన విశాలభావమును ప్రోత్సహిస్తున్నది. ఉత్తమ, మధ్యమ, అధమ తారతమ్యములు లేకుండా, ఉచ్ఛ, మధ్య, నీచ భావములకు తావివ్వకుండా సర్వభూతముల యందు సమభావం, సమదృష్టి కలిగి వుండాలని బోధిస్తున్నది. మనదేశంలో తప్ప ప్రపంచంలో మరెక్కడా యింతకన్నా మించిన సాంఘికన్యాయం (Social Justice) కనుపించక పోవచ్చును. ఇటువంటి అత్యున్నతమైన తత్త్వజ్ఞానం (Philosophy) కూడా మరెచటా లేదేమో! ... అదే హిందూధర్మ వైశిష్ట్యము.

— భరద్వాజ్

*

"ఆధునిక శాస్త్రముల కన్నింటికిని గణితశాస్త్ర మెట్టిదో, ప్రపంచ భాష లన్నింటికిని సంస్కృతం అట్టిది. మానవ పుస్తకభాండాగారములో ఋగ్వేదమే మొదటి గ్రంథం."

— మాక్సుముల్లర్

# హరిజనసేవ

"హరిజనసేవ ఒక ధార్మిక కార్యం. హరిజనోద్ధరణ మానవత్వంతో కూడుకున్న ఉద్యమం. విద్యార్థులు తమ విరామ సమయాలను దీనికి వినియోగించాలి.

హరిజనులలో ఆత్మాభిమానము, ఆత్మగౌరవాదులను నిర్మించడం, వారిని ఆదర్శపౌరులుగా తీర్చిదిద్దడం, పరిశుభ్రత, పరిశ్రమ, విద్యా, సదాచారములను అలవరచడం—ఇదే సరియైన హరిజనోద్ధరణ. ఇందుకు త్యాగం, సహనం, శ్రమ ఇత్యాదు లావశ్యకం.

హరిజన పోషణ కని మీరు నాకు కొంత ధనమిస్తే నిరాకరిస్తాను. ఎందుకంటే మీ ధనంతో వారిని పోషించి వారిని సోమరులుగా, భిక్షుకులుగా చేయడానికి నేను అంగీకరించజాలను.

ప్రతి ఒక్కరూ ప్రతి అస్పృశ్యుని తాకాలని కాదు నేను లక్ష్యించేది. మనస్సులోని అస్పృశ్యతా భావం పోవాలి. అంతర్వర్ణ వివాహాలు, అంతర్వర్ణ భోజనాలు - ఇవే అస్పృశ్యతా నివారణగా భావించను. నేను మీతో కలిసి భోజనం చేస్తే అపవిత్రమై పోతాననే భావం పోవాలి."

—శ్రీ మహాత్మాగాంధీజీ

*

# సంస్కృతము...

"గ్రీకు, లాటిన్, గోతిక్ మొదలయిన భాషలన్నియు భిన్న భిన్న కాలములయందు సంస్కృతభాష నుండియే, ముఖ్యముగా వైదిక సంస్కృతము నుండియే ఉద్భవించినవి"

— కర్జన్ పండితుడు

# గురువు

"గురువు అమృత సరస్సు. గురూపదేశాన్ని మననంచేస్తే శిష్యుడి అజ్ఞానం పోతుంది. గురువును కలుసుకోవడంవల్ల బుద్ధి ఉదాత్త స్థితిని పొందుతుంది. మనస్సు నిర్మల మవుతుంది.

సద్గురువు దర్శనంవల్ల అజ్ఞాన తిమిరం తొలగి పోతుంది. అహంకారం నశిస్తుంది. సద్గురువు లభించిన వెంటనే సంశయా లన్నీ పటాపంచ లవుతాయి. మనోవికారం, చిత్తచాంచల్యాం తొలగిపోతాయి. అప్పుడు అమృతం స్రవిస్తుంది.

గురువు ముత్యాలు వున్న సముద్రం. యోగులు హంసల లాగ వాటిని స్వీకరించి, గురువునే ఆశ్రయించుకొని వుంటారు.

— **శ్రీ గురునానక్**

*

# రష్యాలో రామాయణం

ఇటీవల సోవియట్ యూనియన్‌లోని ఉజ్బెకిస్తాన్‌లో ఉన్నత విద్యా భ్యాసం చేసేవారికోసం ముద్రించిన ప్రపంచ సాహిత్య విజ్ఞాన సర్వస్వంలో "రామాయణగాథ" కు సంబంధించిన ఘట్టాలు పొందుపరచబడ్డాయి. ప్రముఖ ఉజ్బెక్‌కవి "మహమ్మద్ ఆలీ" రామాయణంలోని ఘట్టాలను "ఉజ్బెక్" భాషలోనికి అనువదించారు. ఈ అనువాద కార్యక్రమం కోసం "ఆలీ" అయిదేళ్లపాటు శ్రమించారు. ఉజ్బెక్‌స్థాన్‌లో ఉన్నత విద్యకు రామాయణాన్ని ఒక గ్రంథంగా నిర్ణయించారు. ప్రపంచ ఉత్తమ సాహిత్యగ్రంథాల వరుసలో రామాయణాన్ని చేర్చారు. "రామా యణ అనువాదము మా సాంస్కృతిక జీవనంలో ఒక మహత్తర ఘట్టం" అని ఉజ్బెక్‌స్థాన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్‌కు చెందిన ఒక మేధావి వాఖిద్‌జాఖిదోవ్ అన్నారు. రామాయణగాథకు ఒక్క భారత దేశంలోనే గాక విదేశాలలో కూడ ఎంతగానో ప్రచారం లభించడం విశేషం.

# మతము

మన జాతి వికాసమునకు, మానవ శ్రేయస్సునకు మతమే మహత్తరమైన సాధనము. ఆలసించక ఈ సత్యమును నెంత బాగుగ గ్రహించిన నంత విశేషముగా మనకును, సకల ప్రపంచమునకును శుభము లభించును, సుఖము చేకూరును. ఆధ్యాత్మికతా విహీనమగు జీవితము శవసదృశము. చైతన్య వంతమగు ప్రాణశక్తిని ప్రసాదించునది మతమే. అట్టి శక్తి సనాతన ధర్మ జీవనమున మాత్రమే సిద్ధించును.

## ఆధ్యాత్మికవిద్య

ఆధ్యాత్మిక వికాశము నొసంగని విద్య యథార్థమగు విద్య కాజాలదు. అట్టి విద్య యుదర పోషణమునకు తోడ్పడ వచ్చును. అసహజము, అధార్మికము నగు నేటి మన బిడ్డల నడవడి దోష భూయిష్ఠమగు విద్యావిధాన ఫలితమే. ఆధ్యాత్మిక శిక్షణతో గూడిన విద్య నేడెంతయు నావశ్యకము. శైశవమునుండియు మత సత్యములను బోధించవలెను. ఆధ్యాత్మిక చైతన్యమును కలిగింపవలెను. జీవిత వికాసమును, అభ్యున్నతిని, ప్రయోజనము లను, విలువలను ప్రసాదించునదియే నిక్కంపు విద్య. ఈ శక్తి విమల నైతిక విధానములనుండి మాత్రమే యుద్భవించును.

## తత్త్వశాస్త్రము

తత్త్వశాస్త్రము (దర్శనము) నైతిక శిక్షణము నిచ్చును. ఆదర్శముల నందించుటకు తత్త్వశాస్త్రము దిక్సూచి. అది లేని-చో చుక్కానిలేని నావవలె మన మెటకేగుదుమో తెలియదు. తత్త్వశాస్త్రము విద్యకు మూలము. విద్య, జీవితము, తత్త్వ శాస్త్రము -ఇవి మూడును పరస్పర సంబద్ధములు, అవిభాజ్యములు. తత్త్వము మననమును, విద్యానడవడిని చూపించెడి ఒకే నాణెము

నందలి రెండువైపులు. ఆత్మగౌరవమును గాపాడుకొనుచు, నుదరపోషణార్థము ధనము నార్జించు సామర్థ్యము నీయజాలని విద్యావిధానము నిష్ప్రయోజనకరము. కేవల ముదరపోషణమును సాధించు విద్య క్షుద్రము. తాను చక్కని పరిశ్రమమును గావించుచు తన జీవిత నిర్వాహణమునకే కాక పరులకును తోడ్పడ వీలు గలిగించెడి సుశిక్షిత విద్యయే సద్విద్య.

## ప్రయోజనం శూన్యం

భగవత్సేవ కర్పింపబడని లలితకళలు, ఉన్నత సత్య శిఖరములకు గొంపోవజాలని సాహిత్యం, శీలము నొసంగని విద్య, నైతికంపు పునాదులు లేని రాజకీయములు, ఆధ్యాత్మిక శక్తుల నావిష్కరించి దివ్యత్వము నుద్దేశింప జేయజాలని సమాజ జీవితము, ధర్మము ననుష్ఠింపజాలని ప్రభుత్వము లున్నా ప్రయోజనం శూన్యం. అంతేగాక ఇవి సమాజమునందు సంక్షోభమును, స్పర్ధలను, అశాంతిని ప్రకోపింప జేయుచుండును.

## పరిష్కారము

మన జీవితములం దెదుర్కొనవలసిన సమస్యలను ధైర్య సాహసములతో, ఉత్సాహముతో, వివేకపూరితమగు బుద్ధి కుశలతతో పరిష్కరింపవలెను. కాబట్టి మానవులను యంత్రములుగ నొనర్చు ఫ్యాక్టరీలుగా నుపకరించెడి నేటి మన విద్యాలయములను ఆ మూలముగ, వికాసవంతములగు విధానముల జూపెడి పథకములపై చక్కగా సంస్కరించి, సరిదిద్దవలెను. మానవుని యంతఃకరణమును పరిశుద్ధముగ నొనర్చి వికసింపజేసెడి యాదర్శమే శ్రేయోదాయకము. దీనిని సఫల మొనర్చునది పవిత్ర మతధర్మ నిర్వాహణమే.

## దైవీశక్తి

నవీన మానవ సమాజము కుతర్కముల మాసలో భౌతిక వాదవహ్నికి సలసల క్రాగి కఱగుచున్నది. ధనతృష్ణ మితిమీఱి

చున్నది. ఆ తృష్ణ దీరకుండుటచే నీతికి స్థానము లభించుటలేదు. ధనికవాదము, భౌతికవాదము, విప్లవవాదము మున్నగు భిన్న భిన్న సిద్ధాంతరాద్ధాంతములను ప్రబలించు వితండవాదములను వ్యాప్త మొనర్చెడి చార్వాకులు నేడు గజ్జగట్టి విచ్చలవిడిగ రచ్చకెక్కి రభసజేయుచున్నారు. ఇట్టి తరుణమున మన భౌతిక చక్షువులకు గన్పింపని, మనము స్పృశింప జాలని యొకానొక అతీతశక్తి మనలను నడుపుచున్నదను సత్యమును – దైవీశక్తిని మనము మఱువకుండుముగాక! సత్యము, ప్రేమము అనే సాధనములతో నీ శక్తిని గాంధీజీ ప్రకటన జేసిరి. ధర్మము హృదయము నుండి వికసింపగనే శీలసంపత్తి వ్యాప్తమై వెలుగొందును. సమత్వమును పెంపొందును. సహన సఖ్యములు, భక్తివిశ్వాసములు తేజరిల్లును. సుశిక్షణము, అనుభవము సుస్థిరముగ పాదుకొనును. శాంతి సుఖములు స్థాపితములై జీవితమునకు స్థాయిని, హాయిని చేకూర్చును. మధురఫలముల నాస్వాదింపజేయును. అప్పుడే మానవుడు సంపూర్ణవికాసము నందును. అంతకంటెను ముఖ్యమైన అనుభూతి మరియొకటి లేదు. ఇదియే మానవజీవిత పరమావధి.

— 'ఆర్షవిద్యాలంకార' శ్రీ కల్లూరి చంద్రమౌళి

*

## నిజం

కళ్లముందే కనుపించే నిజం, దాన్ని సమాజ మార్పునకు మలిచే "ఇజం" అదే అభ్యుదయ భావం.

నిజం నిద్రపోతున్నంతసేపు అబద్ధమే నిజంగా 'చలామణి' అవుతుంది. నిజం నిద్రపోకుండా ఘర్షణకు దిగుతే అబద్ధం, అన్యాయముల ఆట కట్టుతుంది.

నిజం అనేది నిలకడమీద తప్పక బయట పడుతుంది.

# సద్గ్రంథాలను చదవాలి

ప్రార్థనా స్థలం ఏకాంతంగా, నిశ్శబ్దంగా వుండాలి. ధ్యానానికి ఏకాంతం అత్యవసరం. ఏడువందల శ్లోకాలు పారాయణం చేయడం కంటే నాలుగు శ్లోకములు అర్థంచేసుకొని అభ్యసించడం మేలు. విద్యుక్తధర్మం మరువక ప్రతిక్షణమూ పాటుపడాలి. ఒకరికి మనముకాదు. మనకు ఒకరుకాదు. ఎవరెవరి ఆచరణ వారిదే. ధర్మ మొకటే మన తోడవుతుంది. అనవసరంగా మనం వారిని వీరిని చూడరాదు. రాకపోకలు మితిలో వుంచుకోవాలి. ఒక గుడ్డివాడు మరొక గుడ్డివానికి తోడయ్యే విధానం వదలుకోవాలి. తర్కంతో, ఉపన్యాసాలతో కాలం బుచ్చకూడదు. మహాత్ములు, ఆత్మదర్శనం చేసినవారి సద్గ్రంథాలను చదువుకుంటూ, వారు చెప్పినది ఆచరణలో పెట్టుకుంటూ ఆత్మ లాభానికి పాటుబడాలి.

ఏకారణము చేతనైనా శాంతమూ, దీక్ష వీడరాదు. ఏగాలి వీస్తే ఆ గాలికి కొట్టుకొని పోరాదు. మనం అలవరచుకోవల్సింది ఉద్వేగరాహిత్యం. ఎప్పుడు మందహాసంతో, ప్రశాంతంగా వుండటం నేర్చుకోవాలి. ఆత్మపై మన చూపు వుంచుకోవాలిగాని, వస్తువులపై కాదు. ఆత్మవిచారణచేత ఉద్వేగాన్ని అణచుకోవాలి. ధ్యానంలో స్థిమితంగా వుండాలి. ఆవేశాన్ని లోపలనే యిముడ్చుకోవాలి. విజ్ఞానమునకై సద్గ్రంథ పఠన చేయాలి. ఇతరులను బలవంతపరచరాదు. మన అభిప్రాయాలను అదేపనిగా ఇతరులపై రుద్దరాదు.

మనిషి మనిషికావలంటే, మనిషిగా అవాలంటే భగవంతుని యందు ఎడతెగని భక్తి కలిగి వుండాలి. భక్తులచరిత్ర, భక్తుల

సాంగత్యము ఆధ్యాత్మిక జీవితానికి సింహద్వారం లాంటిది. మూర్ఖులు వెయ్యిమంది కంటే ఒక పండితుడు వుంటే చాలు. నలుగురు పండితులకంటే ఒక భక్తుడుంటే మేలు. మన జీవితంలో ఒక విషయం గమనించాలి. కుటుంబంలో తండ్రి వున్నంతకాలం తండ్రి వెనుక, తదుపరి పెద్దల వెనుక నడవాలి. రాముని వెనుక లక్ష్మణస్వామివలె, భరతుని వెనుక శత్రుఘ్నుడివలె వుంటే అప్పుడు మన జీవితంలో సర్వమంగళములు లభిస్తాయి. ముందు గాక వెనుకవుండటం అంటే వినయంగా కాలం గడపటమే—అంటే అహంకారం పోవటం. అహంకారం పోతే ఇక ఏముంటుంది? విజ్ఞానం వికాసం. వికాసమే ఆత్మ. విజ్ఞాన వికాసానికి సద్గ్రంథ పఠన అత్యవసరం.

'తృణాదపి సునీచేనతరోరపి సహిష్ణునా' భక్తులందరూ సమానమనే భావం కంటే అందరికంటే తక్కువవాడిని అనేభావం ఉత్తమ భావం. 'వినయం నాకెప్పుడు ఇస్తావు దేవుడా!' అనే ఆవేదనవుంటే, అది మనకు అబ్బుతుంది. ఇతరులకంటే ఎంత తక్కువవాడనని అనుకుంటామో అంతా నిండుతుంది. ఎంత ఎక్కువవాడనని అనుకుంటామో, అపుడు దేవుడు, గురువు ఇచ్చినా దొర్లిపోతుంది. దిబ్బమీద నీళ్లు పడుతాయి. గుంటలోనూ నీళ్లు బడుతాయి. ఎత్తుగా నున్న దిబ్బమీద నీళ్లు నిలువవు. గుంటలోనికే చేరుతాయి. అదేవిధముగ తక్కువ అనే భావం వుంటే గురువు ఇచ్చిన కృపతోడు, ఇతరభక్తులు యిచ్చినది కూడ మనకు అబ్బుతుంది.

భగవంతునికీ, భక్తునికీ మధ్యకెళ్లరాదు. అదేవిధముగ నందీశ్వరునికి, ఈశ్వరునికీ మధ్య పోరాదు. అలాగే 'రాములవారి వద్దకు సరాసరి వెళ్లితే గ్రహించలేవయ్యా, అందుచేత ఆంజనేయ స్వామి వెనుకాల వెళ్ల'మన్నారు పెద్దలు. అందువల్ల ప్రమాదాలు

పొరపాట్లు ఏర్పడవు. ఎంత వెనక్కు వుంటే అంత భద్రతా, క్షేమమూ. అనాలోచింతగా ముందుకు పోయేవాళ్లే కష్టములను ఎదుర్కొన వలసి వుంటుంది. నిదానం ప్రధానం.

కవ్వంతో చిలికితే గాని వెన్న కాదు. కష్టపడితేగాని విలువ దక్కదు. ఊరికే వచ్చేవస్తువుకంటే, కష్టపడి సంపాదించిన వస్తువు విషయంలో జాగ్రత్తగా వుంటాం. జాగ్రత్తగా వుంచుకొని ఎక్కువ అభివృద్ధి పొందుతాం. కనుక కష్టపడటం నేర్చుకోవాలి. అప్పుడే ఫలితాన్ని పొందగలుగుతాం.

— శ్రీ రమణ మహర్షి

*

వినయములేని విద్య ; శీలములేని మనిషి ; దేశభక్తిలేని పౌరులు ; సత్యములేని వాక్కు ; భక్తిలేని పూజ ; క్రమశిక్షణలేని సమాజము ; కృతజ్ఞతలేని సోదరులు ; చేసిన మేలును మరచిన మిత్రులు ; విశ్వాసం చూపని యజమాని ; అర్హతలేని అధికారం ; స్వేచ్ఛలేని స్వాతంత్ర్యము ; న్యాయం చెప్పడానికి భయపడే న్యాయమూర్తులు ; మాధుర్యంలేని సంగీతము ; విద్యాబోధన చేయలేని అధ్యాపకులు ; సభికులను మెప్పించలేని ఉపన్యాసకులు ; సక్రమపాలన చేయలేని ప్రభుత్వము ; పౌరవిధులను నిర్వర్తించని ప్రజలు ; ఓటు హక్కును సద్వినియోగ పరచని ఓటరులు ఉన్నా ప్రయోజనం ఏ మాత్రం వుండదు. శ్రమతప్ప ఫలితం శూన్యం.

— శ్రీ కొమరగిరి

*

## కారము !

కారములేని వంట ; ఉపకారము జేయని జీవితంబు ; ఆ
కారములేని యిల్లు ; మమకారము జూపని స్నేహితుండు ; ప్రా
కారములేని కోట ; గుణకారము నేర్వని పండితుడు ; ఓం
కారములేని మంత్రము ; వికారము కల్గును జానకీపతీ !

—శ్రీ గుండవరపు లక్ష్మీనారాయణ

# గ్రంథములు - గ్రంథాలయములు

"ప్రతి గ్రంథం ఒక గురువు. ఒక అమరలోకపు తరువు. గ్రంథాలయం ఒక వెన్నెల ప్రపంచం. మసికట్టిన మానవ హృదయాలలో వెన్నెల కాంతులు విరజిమ్మే చందమామ వంటిది గ్రంథం. పుస్తకం మానవజీవితానికే అమూల్య సంపద.

తల్లి శరీరాన్ని పోషించి పెంచుతుంది. ఉత్తమ గ్రంథం హృదయాన్ని పోషించి పెంచుతుంది. ఎన్ని ఉత్తమ గ్రంథాలు చదివితే వ్యక్తి అంతగా పెరుగుతాడు.

మన ప్రవక్తల వాక్కులు జీవితానికి వెన్నెల తోరణాలు. మహాకవుల భావనలు మన మనస్సులపై వ్రేలాడగట్టిన పూలపాల వెల్లులు. ప్రతి గ్రంథాలయంలో మనకు వినిపించని గంటలు మ్రోగుతూ ఉంటాయి. కనిపించని హారతులు అందించబడుతూ ఉంటాయి. ఆ గంటలు పాఠకుల గుండెల్లో, హారతులు. పాఠకుల నేత్రాల్లో దాగి ఉంటాయి. ఆ ఆలయాలలో అడుగు పెట్టిన వారికి ఒక అదృశ్యహస్తం వెన్నెలబిక్ష పెడుతూ ఉంటుంది. మనిషిగా మారగలవని ఆశీర్వదిస్తూ ఉంటుంది.

లక్ష్మి, పార్వతీ వంటి దేవతా విగ్రహాలను ఆలయాలలో చూడగలుగుతాం. సరస్వతీమాతను మాత్రం గ్రంథాలయాలలో కళ్లారా చూడగలుగుతాం.

—శ్రీ రావూరి వెంకట సత్యనారాయణరావు

" తరతరాలనుండీ వస్తున్న మానవజాతి నాగరికతనూ, విజ్ఞానాన్నీ పదిలపరచి, ముందు తరాలవారి పురోభివృద్ధికి పాటు పడేవి గ్రంథాలు. ఆ గ్రంథాలను భద్రపరచి ప్రతివారికీ జాతి, మత, కుల, భాషా భేదాలు లేకుండా వారివారి అవుసరాలను బట్టి అంద

జేసి, మానవ విజ్ఞాన తృష్ణను తీర్చే క్షీరసముద్రాలు గ్రంథాలయాలు.

—శ్రీ పర్వతనేని గంగాధరరావు, M.A. (Minn), B.Sc., (Hons.) D. L. Sc.

"శరీరంలో రక్తప్రసరణానికి నరాలు ఎలా తోడ్పడుతాయో దేశంలో భావప్రసరణకోసం గ్రంథాలయాలు అలా కృషి చేస్తుంటాయి. సత్కావ్య పఠనం, సజ్జన సాంగత్యం, సంసార విషవృక్షానికి పండిన రెండు మృతఫలాలని, వాటి నాస్వాదించి మానవుడు సంతరణ మార్గంలో నిష్కంటకంగా పయనించ గలుగుతాడని ప్రాజ్ఞుల సందేశం – ఈ రెంటినీ గ్రంథాలయాలు సమకూరుస్తాయి."

—శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు, "యువభారతి" సికింద్రాబాద్

"గ్రంథాలయములు సరస్వతీ నిలయములు. దేశసౌభాగ్యానికి గ్రంథాలయములు పునాదులు వంటివి. విద్యకు, విజ్ఞానాభివృద్ధికి ఈ విజ్ఞాన భాండాగారముల ఆవశ్యకత ఎంతేని కలదు. పాఠశాలలో పఠింప నవకాశములేని వ్యావహారిక జనులకు, విద్యావినోదాభిలాషులకు, విద్యాభివృద్ధి కాముకులకు గ్రంథాలయము కల్పవృక్షము అనుటలో సందియములేదు. భాషావేత్తలు కావలసి యున్నను, రాజకీయవేత్తలు కావలసి యున్నను, చరిత్ర పరిశోధనలు కొనసాగవలయు నన్నను, మరియే విద్యయందు యోగ్యత సంపాదింప తలంపు యున్నను గ్రంథాలయములు మిక్కిలి ఉపయోగపడును."

—శ్రీ ఆలపాటి రామచంద్రరావు
లైబ్రేరియన్

"దేశదేశాలలో ఉత్తమోత్తమ చలనచిత్రాలలో అనేకం గ్రంథాలయాలనుంచి వెలుబడినట్టివే. ఎన్ని ప్రసిద్ధ గ్రంథాలు ప్రసిద్ధ చిత్రాలు కాలేదు? గ్రంథాలయాలు నిజానికి కొన్ని వేలమంది, లేదా లక్షలమంది గురుదేవులకు నిలయాలు. నా మట్టుకు నాకు ఏదైనా గ్రంథాలయంలో పాదం పెట్టగానే కానవచ్చేవి పుస్తకాల వరుసలు కావు. భుజాలను రాసుకుంటూ వాల్మీకి సరసన హోమర్, కాళిదాసు సరసన షేక్స్పియర్, బుద్ధుని సరసన సోక్రటీస్, ఆర్యభట్టు సరసన న్యూటన్ ప్రభృతులే. మన విజ్ఞానం, మన కళలు, మన సాహిత్యం, మన సంస్కృతి, మన నాగరికత వీరు మనకు పెట్టిన భిక్షే. అందువల్ల, వీరి శుశ్రూష చేయనిదే మనం ఏమీ నేర్వలేము. ఒక్క అడుగైనా ముందుకు వేయలేము. ఈ దృష్టితో మన యువకులు గ్రంథాలయాలను చూడాలి."

—శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

"గతానికి, వర్తమానానికి వారధి కట్టే విజ్ఞాన భాండాగారమే గ్రంథాలయం. ప్రపంచంలో నలుమూలల నివసించే లక్షల కొలది ప్రజలు ఏకసమయంలో ఒకే గ్రంథాన్ని చదువుతూ వుండవచ్చు. ఇటువంటి సదుపాయాన్ని కూర్చే ఆసర గ్రంథాలయంకు వుంది. ఇవి విజ్ఞానాన్ని వెదజల్లే కేంద్రాలు.

—శ్రీ అనంతశయనం అయ్యంగార్

"జీవితానికి అన్నం ఎంత అవసరమో గ్రంథాలు అంతకంటే ఎక్కువ అవసరం కాకపోయినా తక్కువ అవసరం మాత్రం కావు. అన్నం శరీరంలోని ఆకలిని తీర్చి శరీరపోషణకు తోడ్పడితే, గ్రంథాలు మానసంలోని ఆకలిని తీర్చి మానసిక పోషణకు దోహదం చేస్తాయి.

— శ్రీ సంజీవదేవ్

"సర్వులకు విజ్ఞానము సులభముగా అందజేసి తద్వారా సుఖవంతులుగా చేయుటయే గ్రంథాలయ ధ్యేయము. వ్యక్తిగతముగా, ప్రయోజనాత్మకముగా, ప్రత్యక్షంగా కోరిన సమాచారాన్ని వీలైనంత త్వరలో అందివ్వగలుగుటలోనే గ్రంథాలయము యొక్క విశిష్టత వున్నది."

— శ్రీ తిరునగరి వెంకట రమణయ్య
M. A., LLB., D. L. S. C.

"దుర్విధి క్రూర ఆగ్రహానికి దిమ్మెత్తిన మస్తకానికి గ్రంథాలయంలోని మాంచి పుస్తకం లెవండర్ షవర్ బాత్. ఉత్తమ సాహిత్య గ్రంథము మానవుని ధర్మాత్ముని చేయును. సరస్వతీ నివాసమే పుస్తకభాండాగారం."

— శ్రీ పుచ్చా పూర్ణానందం

"గ్రంథాలయం నిజానికి కొన్ని వేలమంది గురువులకు నిలయం. కారణం ఎందరో మహాకవులు, మహారచయితలు సృష్టించిన ఉత్కృష్టమైన గ్రంథాలకు అది స్థావరం. అంతేకాదు విభిన్న రుచులుగల పఠితలకు గ్రంథాలయం ఒక విద్యాకేంద్రం. గ్రంథ అధ్యయనంవల్ల చదువరిలో భావకుశలత, భాషా వైదుష్యం పెంపొందుతాయి. పాఠ్య పుస్తకం అధ్యయన భావాన్ని ప్రేరేపించేది అయితే గ్రంథాలయం ఒక జ్ఞాన యజ్ఞ వాటిక."

— శ్రీ నిడుముక్కల నాగభూషణరావు

"సత్ గ్రంథం తల్లివంటిది. తల్లి తనబిడ్డల సర్వసుఖముల కొరకు ఎట్లు శ్రమించి త్యాగము చేయునో సద్గ్రంథము మానవునియందు అంతర్గతముగ నిద్రాణమై యున్న దైవీశక్తుల నుద్దీపింపచేయుట కుపకరించును. సద్గ్రంథమును మించిన మిత్రుడు దొరకుట దుర్లభము. మంచి స్నేహితుల సహవాస

ములో మానవుడెట్లు తనలోని చెడును సంహరించి మంచి మార్గమున జీవితమును గడుపుట నేర్చుకొనునో సద్గ్రంథ పఠనమువలన అంతకన్న మిన్నయైన శీల సంపదలను అలవరచుకొన గలడు."

—శ్రీ ఇలింద్ర రంగనాయకులు, M. A., L. L. B.

"గ్రంథాలయం నిజానికి విజ్ఞాన నిలయం. విజ్ఞాన సముపార్జనాభిలాషను కలుగ జేయడం, అట్లే మనుష్యులకు విజ్ఞాన తృష్ణను తీర్చడం–ఈ రెండు విధానములైన సేవలను గ్రంథాలయము నిర్వర్తిస్తుంది. విజ్ఞానతృష్ణను తీర్చడానికంటె జ్ఞానార్జనపట్ల ఆసక్తిని కలుగ జేయడం ప్రాథమిక కర్తవ్యం."

— శ్రీ కోదాటి నారాయణరావు

"అభివృద్ధికి విద్య ప్రాతిపదిక అయితే, విద్యకు ప్రాతిపదిక పుస్తకం. సేకరించుకున్న విజ్ఞానాన్ని సంరక్షించుకుని, తరతరాలకు అందించడానికి ఎంతో ఉపయోగ పడతాయి పుస్తకాలు. వైజ్ఞానిక, సాంస్కృతిక, సాహితీ రంగాలలో అభ్యుదయానికి పుస్తక పఠనం ఎంతో దోహదం చేస్తుంది. నైతిక విలువల అవగాహనకు, పరిరక్షణకు పుస్తక పఠనం అవసరం. పుస్తక పఠనం మనస్సుకు నవసత్వం చేకూరుస్తుంది."

—శ్రీ వంగవల్లి విశ్వనాథం, M. Com.

"ఇతర దేశముల యందలి గ్రంథాలయోద్యమములన్నియూ మనుజుని మేధాశక్తిని వృద్ధి నొందించుటకే ప్రయత్నము లొనర్చుచుండగా ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమము మనుజుని సంపూర్ణ మానవత్వమును వ్యక్తీకరించుటకు తగిన సాధన సామాగ్రినంతను సమకూర్చుకొని యున్నది. మాధ్యమికపాఠశాల స్థాయిన తమ విద్యను మానివేయు వారందరికి గ్రంథాలయమే కామధేనువు.

అది వారికి సార్వజనిక విద్యాలయము. జనసామాన్యమునకు కావలసిన చదువులనన్నిటిని, వారి వారికి కావలసిన స్థాయిని ప్రసాదించి విజ్ఞాన ప్రదాయినిమై వర్ధిల్లుచున్నవి.

— శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య

"పుస్తకాల పరమప్రయోజనం అధ్యయనం. కనుక అధ్యయనం నిమిత్తం ఒక చోట చేర్చి పెట్టిన గ్రంథ సముదాయాన్ని గ్రంథాలయంగా పేర్కొన్నారు. విజ్ఞులు దీని కొరకు సూత్రాన్ని కూడ కల్పించినారు. 'ఉపయోగం కొఱకు పుస్తకా' లన్నదే యీ సూత్రం. గ్రంథాలయ సూత్రాలలో ఇది ప్రధానమైనది. ఈ ధర్మం నిర్వర్తించు సంస్థకు మాత్రమే గ్రంథాలయ మనే పేరు చెల్లుతుంది. ఉపయోగం నిమిత్తం చేర్చిన పుస్తకాల సంఖ్య స్వల్పంగా వున్నప్పటికీ, వీని నుంచు స్థలం చిన్న గదియే అయినప్పటికీ, చిన్న బీరువాలో వీటిని సర్ది పెట్టినప్పటికీ, వీటిని అసంఖ్యాకులగు జనం కాక ఒక వ్యక్తి మాత్రమే ఉపయోగించుకొన్నప్పటికీ దీనిని గ్రంథాలయంగా నిర్ణయించినారు."

— శ్రీ పాతూరి నాగభూషణం

*

" సంస్కృతం, అది ప్రారంభంలో కనిపించే విధంగా నేర్చుకొనుటకు కఠినమైన భాష కాదు. అది ఒక కొబ్బరికాయ వంటిది. దాని ఉపరితల భాగం గట్టిగా కన్పించినప్పటికి దానిలోపల మధురమైన జలము, కొబ్బరి ఉన్నవి.

— డా. సరోజినీ మహిషి

# స్వాతంత్ర్య సమరంలో విప్లవవాదుల నియమాలు

" Keep your lips shut. Do not tell others what they need not know. Walls have got ears. The bravest deed is the safest. The lesser the number of persons involved in a conspiracy, greater is the chance of success."

" మౌనంగా ఉండటం నేర్చుకో, అనవసరంగా మాట్లాడకు, గోడలకు చెవులుంటాయి. రహస్యాలోచనకు బహిరంగ ప్రదేశమే భద్రమైన స్థలము. ఎంత ధైర్యసాహసాలతో ఒక కార్యం నెరవేర్చగలిగితే అంత సురక్షితం. రహస్యకార్యాలు ఎంత తక్కువమంది కలిసి చేస్తే అంత భద్రం. "

*

# సంస్కృతం

సంస్కృతంలో వున్న 108 ఉపనిషత్తులను షాజహాన్ చక్రవర్తి కుమారుడు దారాషికోహ్ పార్శీ భాషలోనికి ' శిరర్ అక్బర్ ' అనే పేరుతో అనువాదం చేశాడు. సర్వమతసామరస్యాన్ని దృష్టియందుంచుకొని అతనే ' సాగర సంగమం ' అను సంస్కృత కావ్యాన్ని కూడా వ్రాశాడు. అక్బర్ చక్రవర్తి కోశాధికారి ఖాన్ ఖానా అబ్దుల్ రహీం జ్యోతిశాస్త్రమును సంస్కృతంలో వ్రాశాడు. దీనినిబట్టి సంస్కృత భాషను మొగలాయి చక్రవర్తులు కూడా ప్రోత్సహించినారనే విషయం విదితమవుతున్నది.

*

# భారతీయ సంస్కృతి

భారతదేశములోని నదుల నామములే ఈజిప్టులో కూడ కలవు. అక్కడ నేడు పిలువబడుతున్న నైలునదిని పూర్వము నీలానది యని పిలచేవారు, ప్రాచీన ఈజిప్టురాజుల సింహాసనమునకు ఒకవైపున హిమ మంతుని విగ్రహము, మరొకప్రక్కన గరుత్మంతుని విగ్రహము వుండేవి. " ఇసిస్ " అనునది వారి దేవునిపేరు. ఇది " ఈశ " శబ్దము నుండి వచ్చినట్లు చరిత్రకారులు చెబుతున్నారు.

# బాల
# విజ్ఞానకోశము
## చతుర్థ భాగము
## ఆవిష్కృతములు

# ఆణిముత్యాలు

'పితృవాక్య పరిపాలన అన్నది చాలా గొప్ప ధర్మము. ఆ ధర్మాన్ని వదలివేసి ఎంత గొప్ప ఐశ్వర్యము సంపాదించినా ఫలితం వుండదు.'

— శ్రీరామచంద్రుడు

'విద్య అంటే విషయ బాహుళ్యాన్ని మెదడుకు పట్టించడం కాదు. జీర్ణంకాక కల్లోలం సృష్టించే సామగ్రికాదు. ఉజ్జీవన కరం, మానవ నిర్మాణకారకం, శీల నిర్మాణ సమర్థములైన భావములను జీర్ణించుకోగలిగినదే విద్య.'

— శ్రీ స్వామి వివేకానంద

'విద్య కామధేనువు వలె కాలము కాని కాలమందును ఫల మొసగును. పరిచయములేని పరదేశమునందు తల్లివలె పోషించును. నిల్వచేసిన ధనమువలె సమయమందు లేక కష్ట కాలమందు సహాయ మొనర్చును.'

— చాణక్యుడు

'పుస్తకమును మస్తకములో చేర్చాలి గాని, మస్తకమునే పుస్తకముగా మార్చరాదు.'

— శ్రీ సత్యసాయిబాబా

'క్రోధం, పగ – ఇవి నీచ మానవ ప్రకృతికి చెందినవి. వీటిని విసర్జించుము.'

— శ్రీ అరవిందుడు

'విద్యను దాచుకోవద్దు. పదిమందికీ పంచు. అది మరింత రాణిస్తుంది.'

— శ్రీ మహాత్మాగాంధీ

'నీ గురువును గూర్చి ఇతరులాడు నిందావాక్యములను విని సహింపకుము. అతడు నీ తల్లిదండ్రులకన్నా ఉత్తముడు. నీ తల్లిదండ్రుల నెవ్వడేని నీ ఎదుట దూషించుచో విని ఊరకుందువా? అవసరమగుచో పోరాడియైనను నీ గురువు ప్రతిష్ఠను కాపాడుము.'

— శ్రీ రామకృష్ణ పరమహంస

'విద్య వేరు, వివేకము వేరు. మంచికీ, చెడుకూ వ్యత్యాసం తెలిసిన పిమ్మట ఎవడూ తప్పుడు పనులకు దిగడు. మనస్సులో నిలకడగా నెలకొనిన జ్ఞానం వృథా. అది వట్టి పాండిత్యంగా మాత్రమే నిలుస్తుంది. దానివల్ల ప్రయోజనం వుండదు.'

— శ్రీ రాజగోపాలాచారి

'శీలరహితమైన విద్య ప్రమాదకరము. చాలామంది తెలివిగల దొంగల విషయంలోను, పెద్దమనుష్యులుగా చెలామణి అయ్యే మూర్ఖుల విషయంలోను ఇది వెల్లడవుతుంది.'

— శ్రీ మహాత్మాగాంధీ

'భౌతికశక్తి అవసరమే. కాని శీలము మరింత ముఖ్యం. శీలం లేని శక్తి మనిషిని కేవలం పశువుగా మారుస్తుంది. వ్యక్తిగతంగా చూచినా, జాతిపరంగా చూచినా పవిత్రత, శీలము జాతీయ వైభవానికి, మానవత్వానికి, ప్రాణాధారం.'

— శ్రీ గురూజీ గోల్వాళ్కర్

'ప్రేమ లేని శరీరం స్మశానంలోని శవంతో సమానం. కంచరివాని తోలు తిత్తి ప్రాణం లేకపోయినా శ్వాస తీసుకుంటునే వుంటుంది.'

— శ్రీ కబీర్

'ఒకపనిని చేయవలెనని సంకల్పించుకొన్నతరువాత, వాని నారంభించి ముగించువరకు నాకు నిద్రపట్టదు. కాల మమూల్యమైనది. నేడు వ్యర్థముగా బోగొట్టబడిన కాలము రేపు కలసి రాదు.'

— శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు

'త్యాగం చేయడంచేతనే తేజం ఆవిర్భవిస్తుంది. స్వార్థం ప్రవేశించిన మరుక్షణంలోనే తేజం ఆరిపోతుంది. మహావృక్షంగా మారడానికి విత్తనం మొదట భూమిలో తన శరీరమును నశింప జేస్తుంది. అట్లే స్వార్థపరిత్యాగంచేతనే మనకు కార్యం విజయం చేకూరుతుంది.'

— స్వామి రామతీర్థ

'పరాధీన మయినదంతయు దుఃఖము. స్వాధీన మయిన దంతయు సుఖము. ఇదియే సుఖ దుఃఖ లక్షణము.'

— శ్రీ దయానంద సరస్వతి

'ఆదర్శములు మలినముగాక స్పష్టముగా నుండి, ఉత్సాహము మొక్కవోకున్నచో అపజయము కలుగ జాలదు.'

— శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

'ప్రజాసేవ పవిత్రవిధిగా, జీవితపరమావధిగా భావించి, తమ సర్వస్వాన్ని సమర్పించి, తరించిన మహామహుల మహత్తర జీవితాలను మననంచేసుకొని ఉత్తేజితమైన జాతి కర్తవ్య నిర్వహణకు కంకణం కట్టుకోవాలి.'

— శ్రీ చిత్తరంజన్‌దాస్

'సోదరులారా! ఎంతకాలం ఆలోచిస్తూ కార్యశూన్యులై యుంటారు? దేశభక్తులారా! ఇక చాలు, మీ ఆలోచనలు కట్టిపెట్టండి. కార్యనిరతులు కండి. వట్టి ప్రగల్భాలవల్ల ప్రజలకు విముక్తి కలుగదు. కార్యశూరు లవ్వాలి, లెండు.'

— శ్రీ లాలాలజపతిరాయ్

'అభిమన్యునిలా పోరాడటం మానుకోవాలి. కుర్రతనంగా ప్రవర్తించరాదు. దూరదృష్టితో, మెళుకువగా నడచుకోవడం నేర్చుకోవాలి. అభిమన్యుని లోని ధైర్యసాహసాలను అలవరచుకోవాలి.'

— శ్రీ హరి సర్వోత్తమరావు

"తక్కువ మాట్లాడండి, ఎక్కువ సాధించండి. మర్యాదగా మాట్లాడటానికి, పొగడ్తకున్న తేడా గ్రహించండి. 'విప్లవం, విప్లవం' అని కేకలు వేయకండి. ఆ కేకలు వేసే నాయకులు కార్యాచరణకు వెనుకంజ వేస్తారు. దేశంలో నాయకులకు కొదవలేదు. క్రమశిక్షణాశీలురైన అనుచరులు లేనిదే పోరాటం విజయం పొందదు. కాన అట్టి సైనికులుగా తయారు కండి."

— శ్రీ వల్లభయి పటేల్

"విద్యార్థి జీవితము విలాసయుతముగ నుండుటకంటే సామాన్యముగా నుండుటే మంచిది."

— శ్రీ బాబూ రాజేంద్రప్రసాద్

"విద్యాధనాలు విరివిగా ఉన్నా గర్వంలేకుండా చరించే వాడు పండితుడు."

— శ్రీ విదురుడు

"వినమ్రతయే స్త్రీలకు భూషణం. స్త్రీలకు ముంగోపము తగదు. వారు ఓరిమి నలవరచుకొనవలెను. స్త్రీలు ఓరిమి నభ్యసించి తల్లితండ్రుల యొక్కయు, భర్త యొక్కయు మాటల యెడ తాలిమి కలిగి ప్రవర్తించవలెను.

— శ్రీ శారదామాత

"విద్యావిధానంలో కూడా మౌలికమైన విప్లవం రావాలి. విద్యార్థులకు తమకాళ్లపై తాము నిలబడ గలిగి, ఆత్మవిశ్వాసాన్ని పెంచే విద్య నేర్పాలి. కాని యిప్పుడు 'ఉద్యోగం, ఉద్యోగం' అన్నదే విద్యగా వున్నది. మనం వ్యాపారులకుగాని, ప్రభుత్వానికి గాని దాసుల మవ్వాల్సిన అవసరంలేదు. ఉత్పత్తిని పెంచి, దేశంలో సంఘీభావం పెంచడమే కావలసింది. కనుక ఉపాధ్యాయులు, విద్యార్థులు కలిసి విద్యావిధానంలో విప్లవాత్మకమైన మార్పును తీసుకొని రావడానికి సమిష్టి కృషిచేయాలి."

— శ్రీ జయప్రకాశ్ నారాయణ

"త్యాగం ఆరంభమునందు విషమువలె గనుపడినను పరిణామమునందు అమృతరూపమును దాల్చుచు సుఖ సాధనం బగుచున్నది. భోగం ఆరంభమునందు అమృతమువలె గోచరం బైనను పరిణామమునందు విషఫలమును సమకూర్చుచు దుఃఖ మును గలుగ జేయుచున్నది."

— శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు

"వాయు వెల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో, జ్ఞానము కూడా అట్లు స్వాధీనము కావలెను. ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమై యున్నదో జ్ఞానము కూడా అట్లు సేవ్యము కావలెను. సూర్యచంద్ర మండల తేజస్సు ఎల్లవారికి ఎట్లు సౌఖ్యప్రదముగ నున్నదో జ్ఞానము కూడా అట్లు సౌఖ్యప్రదము కావలెను."

— శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం

"క్రమశిక్షణ, గురుభక్తి అంతరంగంనుండి రావాలి. బాహ్యంగా భయపెట్టి వాటిని రప్పించ ప్రయత్నించరాదు."

— శ్రీ రాజా రామమోహనరాయ్

"కాలం గడిచినకొద్దీ తల్లిలోని అందం క్షీణించవచ్చుగాని, ఆమెకు తన పిల్లల పట్లగల ప్రేమమాత్రం తగ్గదు."

— శ్రీ వర్డ్సవర్త్

"విద్య అనే మహావృక్షం వేళ్లు చేదుగా వున్నా అది అందించే ఫలాలు మాత్రం తియ్యగా వుంటాయి." — శ్రీ అరిస్టాటిల్

"స్నేహితుణ్ణి కలిగియుండే ఏకైకమార్గం స్నేహితుడుగా వుండటమే."

— శ్రీ ఎమర్సన్

'ఏదైనా ఒక పనిని గురించి ఆ పనిని చేయనివాళ్ళు ఆదర్శ ప్రాయంగా మాట్లాడుతారు. ఆ పనిని చేస్తున్నవాళ్ళు ప్రత్యక్ష ప్రాయంగా మాట్లాడుతారు.'

— శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు

"శరీరపు సోమరితనమే మనసు నందలి అలసత్వమునకు కారణము. ఈ అలసత్వం మూర్ఖుల విహార కేంద్రం; బలహీనుల రక్షణ స్థానము; నిరాశా, నిస్పృహలకు మాతృమూర్తి. ఈ సోమరితనము మూర్ఖతకు దాది; ఇనుపగజ్జెల తల్లికి పట్టుపరుపు; నేరములకు పుట్టినిల్లు; వ్యాధులకు మూలస్థానము. సోమరి మనస్సు దయ్యాల భవనము. సోమరితనము సాలెగూళ్ళతో ప్రారంభించి సంకెళ్ళతో అంతమగును. త్రుప్పు ఇనుము యొక్క ఆయువును తగ్గించునట్లు, అలసత్వము మానవుని ఆయువును క్షీణింగదీయును.'

— శ్రీ స్వామి రామేశ్వరానంద

'నహి నహి రక్షతి డు కృఇఞ్ కరణే.' లౌకిక విద్యలు జనన మరణముల నుండి రక్షింప జాలవు. కనుక దైవ విద్య నభ్యసింపుము. ఆధ్యాత్మిక విద్యను జేపట్టుము."

— శ్రీ శంకర భగవత్పాదులు

'ఏ విద్యవలన శాంతి సుఖములు లభించునో, ఏది అత్యంత దుఃఖరాహిత్యమును కలుగజేయగలదో, సంసారతాపములన్నియూ దేనివలన అణగిపోగలవో అదియే ఉత్తమమైన విద్య. ఏది జనన మరణ ప్రవాహము నుండి జీవుని తప్పించగలదో అదియే విద్యలలో శిరోమణి యనదగును.'

— శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి

'Man does not live by bread alone.' కేవలము తిండియే మానవ జీవిత పరమావధి కాదు.'

— శ్రీ ఏసుక్రీస్తు

'క్షమత, సమత, మమతలతో కూడిన మానవతావాదమే నేటి యుగధర్మం.'

— శ్రీ అటల్ బిహారీ వాజపాయి

'భవిష్యత్తుకు చెందు సుకుమార కార్యములను గురించి కలలను గనుచు, నేటి కఠిన కార్యములను త్రోసిపుచ్చువాడు వంచకు డగును.

— శ్రీ లెనిన్

'అధికారమత్తత సున్నితమగు తాళముచెవిని చెడగొట్టి గొడ్డలి నుపయోగించును.'

— శ్రీ రవీంద్రనాథ్ టాగూర్

'కత్తి శాశ్వతము. యొర క్షీణించును. శరీరము నశించును. ఆత్మ నశించదు'.

— శ్రీ బైరన్

'మనం రక్షించవలసింది సత్యాన్నేగాని రాజ్యాన్ని గాదు.'

— శ్రీ ధర్మరాజు

'ఉద్రేకములో ఉన్నపుడు ఏ సమస్యకూ పరిష్కార మార్గమంటూ ఏదీ కన్పించదు. ప్రశాంతంగా వున్నప్పుడే అది సాధ్య పడుతుంది.'

— శ్రీ మెకాలే

'రోజు కొక క్రొత్త వ్యక్తితో స్నేహం చేయడానికి ప్రయత్నించడంకంటే అసలు స్నేహితులు లేకపోవడమే ఉత్తమమైన మార్గం.'

— శ్రీ సోక్రటీస్

'విశాలమైన హృదయం, వ్యక్తిత్వం కలిగిన మనుష్యుల మధ్యనే స్నేహం పొసగడానికి అవకాశం వుంటుంది. సంకుచిత మనస్తత్వం, పెంకితనం కలిగిన మనుష్యులు స్నేహితులు కాలేరు.'

— శ్రీ చార్లెస్ కింగ్స్లే

'కర్తవ్య కర్మను నిరంతరమును పాలించుచు మరణించిన వాని జన్మము ధన్యము. ఏదో ఒక సద్గ్రంథమును పఠించుచునో, వ్రాయుచునో, ఒక సత్కార్యము చేయుచునో నేను మరణించితినా ధన్యుడనే.'

— శ్రీ మహదేవ రానడే

'ఏ కార్యం చేసినా సరే, ధర్మము తప్పకుండా చేసినట్లయితే, అదే దైవాన్ని ఉపాసన చేసినట్లు. కసాయి దుకాణము పెట్టుకున్నప్పటికీ తాను చేస్తున్న కార్యం–ధర్మం తప్పకుండా చేస్తే ముక్తి పొందవచ్చు.'

— శ్రీ ధర్మవ్యాధుడు

'అపకీర్తిని నెత్తిమీదవేసుకొని జీవించడం కంటే, విఖ్యాతుడై మరణించడం మంచిది. అందువల్ల సర్వలోక సంపూజ్యత లభిస్తుంది.'

— శ్రీ మహాదాత కర్ణ

'The great end of life is not Knowledge, but action.'
'జీవితంయొక్క గమ్యం విజ్ఞానాన్ని సేకరించడంకాదు. కార్యశీలతయే దాని లక్ష్యం.'

— శ్రీ హక్స్లే

'జ్ఞానాభివృద్ధి నీ నైతిక దృష్టిని సుదృఢం చేస్తుంది. ఋజువర్తనం. నీకు సౌఖ్యం చేకూరేలా చూస్తుంది.'

— శ్రీ హెన్రీ డెరోజియో

'ఆడపిల్లలు తప్పకుండా చదువుకోవాలి. వారు భావి గృహిణులు. వారే తమ పిల్లలకు మొదటి గురువులు. పేరంటానికి తప్పకుండా వెళ్లాలి. పేరంటమంటే కొంత ఖర్చు ఉన్నప్పటికీ, అది ఆడవారి జీవితంలో కొంత మార్పును, ఆనందాన్ని కలుగచేస్తుంది. వ్రతాలు, పూజలు, నోములు, పండుగలు మన సంస్కృతిని తెలియజేస్తాయి. అందువల్ల ఇల్లాలికి యివి అవసరము. మనధర్మము, సంస్కృతి, పూర్వవైభవములను గూర్చి తెలుసుకున్నప్పుడే మనము సరియైన బాటలు వేసుకునేందుకు వీలు కలుగుతుంది. లేని యెడల పునాదులులేని ఇల్లుగా మన సమాజం కూలిపోతుంది.'

— శ్రీమతి జూపూడి హైమవతి

'సత్యమైనను అప్రియమైనచో పలుకరాదు. ప్రియమును, హితమును గూర్చు మాటలను చెప్పవలెను. సత్యమును సౌమ్యముగా చెప్పి నచ్చజెప్ప వలెను. కమ్మని మాటలు కల్యాణమును గూర్చును. ప్రియమగు మాటలు ప్రీతిని గూర్చును. హితమగు మాటలు సన్నిహితమును చేకూర్చును. ప్రియసంభాషణము పరమ భూషణము.'

— తిరువళ్ళువర్

'చేయవలసిన కార్యం వెంటనే చేయకుండా ఆలస్యం చేయడం గొప్ప తప్పు. మోసం చేసినవాడిని మోసంతో పడ గొట్టడం పాపంకాదు.' — శ్రీ భీముడు

'ప్రేమ యిస్తుందే గాని ఇమ్మని కోరదు. ప్రేమ బాధలను సహిస్తుందే గాని ప్రతీకారం తలబెట్టదు.'
— శ్రీ మహాత్మాగాంధీ

'అనుకరణ నాగరికత కాదు. అనుకరణ అభ్యున్నతికి లక్షణం కాదు. మానువుని యొక్క ఘోరమైన పతనానికి ఆది చిహ్నం.' — శ్రీ స్వామి వివేకానంద

'బుద్ధి వికాసం చెందడానికి విద్య అవసరం. గురువులు ఆ విద్యను అందజేస్తారు. విద్య వలన నీ తెలివితేటలను సక్రమ మార్గంలో పెట్టడం చేతనవుతుంది. అందువలన గురువులకు ఎల్లప్పుడూ కృతజ్ఞులుగా వుండవలెను.' — శ్రీ సత్యసాయిబాబా

'ఆలస్యం చేయకు. చేయవలసిన పని వెంటనే చేయాలి. తీరా గట్టు తెగినతరువాత కట్ట కట్టడానికి వీలుపడదు. పట్టు వదలకు. అకుంఠిత దీక్షతో ముందుకు సాగిపోవడం నేర్చుకో. నీ కార్యం నిశ్చయంగా జయమవుతుంది.'
— శ్రీ మహాధాత కర్ణ

'కొద్ది భావాలు కలిగిన గొప్పవాండ్లవల్ల దేశం శక్తివంతం కాదు. గొప్పభావాలు కలిగిన కొద్దివాండ్లవల్ల దేశం వర్ధిల్లుతుంది.'
— శ్రీ స్వామి రామతీర్థ

'ప్రపంచాన్ని మినహాయించి భగవానుని ప్రేమించడంలో ఎంత గాఢత్వ మున్నప్పటికీ అది అపరిపూర్ణమైన ప్రేమయే. ప్రపంచంలోని తుచ్ఛపురుగును, పరమపాపిని సైతం నీవు ప్రేమించలేకపోతే భగవానుని ఏమి ప్రేమించినట్లు ?
— శ్రీ అరవిందులు

'ప్రతిఫలాపేక్ష లేక సమాజ కల్యాణార్థమై బాధలను భరించి, త్యాగంచేసి ధన్యోస్మి అనుకొన్నవాడే నిజమైన సమాజ సేవకుడు.' —శ్రీ గురూజీ గోల్వాళ్కర్

'నిరర్థక జీవుడయి వేయేండ్లు బ్రతికిన వానికంటే, పుణ్యశీలుడై యొక్కదినము జీవించినవాడే చిరకాలజీవి అని చెప్పవచ్చును.' — శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు

'ఇతరుల తప్పు లెంచకుము. చివరకు క్రిమికీటకములను కూడ వేలెత్తి చూపకుము. భక్తి కొరకు భగవంతుని ప్రార్థించునట్లే, ఇతరుల తప్పు లెన్నకుండెడు బుద్ధిని ప్రసాదింపుమనియు అతనిని వేడుకొనుము.'

— శ్రీ రామకృష్ణ పరమహంస

'గర్వము శరీరము మీద క్రొవ్వువలె కాన్పించకుండా పొరమీద పొర పెరుగుచుండును. కాని యీ నిత్యాభివృద్ధిని దీనిని పొందు వ్యక్తి గుర్తించలేడు.'

— శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

'నీ హృదయము విశ్వసించుట కిష్టపడనిచో, నీ బుద్ధి నిశ్చయముగ నిన్నెప్పుడు విశ్వసింప నీయదు.'

— శ్రీ విలియం జేమ్స్

'కృషి చేయకుండా మెక్కెడివారు దొంగలు.'

— శ్రీ మహాత్మాగాంధీ

'ప్రపంచంలో ద్వేషాలూ, కావేషాలూ, కార్పణ్యాలూ ఆశలూ సత్ఫలితాన్ని, సంతోషాన్ని లేకుండా చేస్తాయి. ద్వేషం ఎంత నీచమైన గుణమో ప్రత్యక్షంగా చూచి అనుభవించిన తరువాతనే బోధపడుతుంది. అంతా అయిపోయిన తరువాతనే మనకు వివేకం కలుగుతుంది. అంతవరకు మోహంలో మునిగి యథార్థాన్ని గుర్తించలేము.' — శ్రీ రాజాజీ రామాయణ

'Education is the ability to meet life's situations."
'విద్య అనేది జీవితం యొక్క పరిస్థితులను ఎదుర్కొనే సామర్థ్యం కలది."

— డా. జాన్ జి. హిచ్చెన్

'నిరుపేదల కష్టాలను చూచి వలవల ఏడ్చేవాడే మహాత్ముడు. జాతి గుడిసెలలో నివసిస్తున్నదని గుర్తుంచుకోనండి. ఈ భారత దేశంలో ఒక కుక్కయైన క్షుద్బాధతో బాధపడకుండ నుండు నంతవరకు మరల మరల వేయిసార్లయినా ఈ గడ్డమీద జన్మించి సమాజోద్ధరణకై శ్రమిస్తానే గాని స్వీయ విముక్తిని కోరను.'

— శ్రీ స్వామి వివేకానంద

'మంచివారిని చూచి ఈర్ష్య పడరాదు. ఈర్ష్యయే అన్ని అనర్థాలకు మూలము. మంచి స్థితిలో వున్నవారిని చూచి సంతోషించండి. హీన స్థితిలో వున్నవారిని చూచి జాలి పొందండి. సహాయం చేయగల్గిన చేయండి. హాని మటుకు చేయవద్దు.'

— శ్రీ సత్యసాయిబాబా

'నిన్ను నీవు నిర్దయగా విమర్శించుకోవడం నేర్చుకో. అప్పుడు నీవు ఇతరులయెడ దయతో మెలగడం నేర్చుకో గలుగుతావు.'

— శ్రీ అరవిందులు

'కార్యకర్త ఆత్మవిశ్వాసం పేరిట అహంకారానికి లోనుకా కూడదు; వినయం పేరిట ఆత్మవిశ్వాస హీనుడు కాకూడదు.'

— శ్రీ గురూజి గోల్వాళ్కర్

'స్త్రీల నందరను తల్లుల వలె భావింపుము. వారిని చూడ వలసి వచ్చుచో పాదములవైపు చూడుము కాని ముఖమువైపు చూపు పోనీయకుము. అప్పుడు మోహ వాంఛలు నీ మనసున పొడ సూపవు.'

— శ్రీ రామకృష్ణ పరమహంస

'క్రోధము, లజ్జ, గర్వము, హర్షము, ఆత్మస్తుతి ఎవనిని వంచించవో వాడే విద్వాంసుడు.'

—విదురనీతి

'విద్యార్థులు—పక్షముల రాజకీయాలలో పాల్గొనరాదు. రాజకీయపు సమ్మేలలో పాల్గొనరాదు. నాయకుల యెడ తమకున్న శ్రద్ధాభక్తులను, వారి సద్గుణములనుఅలవరచుకొనడంలో చూపాలి గాని వారి రాజకీయాలలో పాల్గొనడం ద్వారా కాదు. రాజకీయ అధ్యయనం మాత్రం చేయ నగును.'

—శ్రీ మహాత్మాగాంధీ

'బంగారం వంటి అమూల్యమైన ఉపదేశాలు భవిష్యత్కాలానికి, భావితరాలవారికి బహు అక్కరకు వచ్చేభాండారం.'

—శ్రీ రాజగోపాలచారి

'తేలికగల పదార్థములలో గడ్డిపోచ తేలిక. దానికన్ననూ దూది తేలిక. మరి దాని కన్న యాచకుడు తేలిక.'

—చాణక్యనీతి

'ప్రేమికుడవు నీవు కావద్దు. ప్రేమ లే నీవు కమ్మని వేదాంత నిర్వచనము. ప్రేమ లే నీవు అయినప్పుడు నీవు సర్వమును ఆకర్షి స్తావు. పరిపూర్ణుడవై ప్రకాశిస్తావు. నీ గృహము ప్రేమకు కేంద్ర స్థానము కావాలి. కాని ప్రేమను బంధించే సరిహద్దు ఆవరణము మాత్రము కాకూడదు.

—శ్రీ రామతీర్థ

'ప్రపంచంలో పాప మనేది ఏదైనా వుంటే అది ఒక్క భయమే. నిద్రాణశక్తులను మేల్కొల్పే పను లొనరించడమే పుణ్యం. మన శరీరాలను బలహీనం చేసే పనులే పాప. కనుక దౌర్బల్యాన్ని, భీతిని గెంటివేయి.'

—శ్రీ స్వామి వివేకానం

'ఈనాటి బాలురు రేపటి తండ్రులు. బాలికలు రేపటి తల్లులు. చిన్నప్పుడు మీ తల్లిదండ్రులను గౌరవించడం నేర్చుకుంటే, రేపు మీ బిడ్డలనుండి మీరు గౌరవాన్ని పొందడానికి అర్హత సంపాదించుకుంటారు. మొక్క చిన్నదిగా వున్నప్పుడు వంపులతో పెరిగితే పెద్దదయాక ఆ వంపులు పోతాయా ? అందుకే చిన్నతనంలో ప్రవర్తన మంచిగా వుండవలెను.'

— శ్రీ సత్యసాయిబాబా

'కేవలం ఆవేశం వల్ల ఏమీ చేయజాలం. కార్యరంగంలో ప్రవేశించాలి. సంస్కరణోద్యమాన్ని ఎలా ప్రారంభించాలో ఆలోచించాలి. అనేక ఉద్యమాల్లో సరియైన కార్యకర్తలు లేనందున ఉద్యమాలు నశించిపోతాయి గాని ద్రవ్యంలేక అవి నశించవు.'

— శ్రీ హరి సర్వోత్తమరావు

'సత్యాన్ని ప్రేమించేవాడే అసత్యాన్ని ఖండించగలడు. సత్యజీవనం వల్ల అంధ విశ్వాసాలు పటాపంచలై పోతాయి. సత్య వాక్కు వ్యర్థం కాని సుస్థిర వాక్కు. సత్యం గొప్పతనం నిగ్రహులకు మాత్రమే తెలుస్తుంది. సమత మమతల సంరక్షణె సత్యం. అసహనాన్ని, దౌర్జన్యాన్ని అరికట్టే మహత్తరశక్తి సత్యం. నీతికి, నిర్భీతికి ఆధారం సత్యం. మానవ హృదయ ప్రశాంతికి, జీవన సుఖశాంతికి సత్యం సరయిన దారి.'

— శ్రీ మహాత్మాగాంధీ

'ఉదాత్తత, ఉదారత - ఇవి ప్రతివానికి ఉండితీరవలసిన సద్గుణాలు. ఇది లేనివాడు చీకటి కూపంలోని కీటకంతో సమానుడు.'

— శ్రీ అరవిందులు

'నాయకుడు ప్రజలకు తండ్రిలాగా నిగ్రహంతో, వివేకంతో వ్యవహరించాలి. తల్లిలాగా అవధులులేని మమకారంతో ప్రవర్తించరాదు.'

— శ్రీ సర్దార్ పటేల్

'ఆదరిస్తే ఆనందమూ, అనాదరిస్తే ఆగ్రహం పొంద కూడదు.'

—శ్రీ విదురనీతి

'ధర్మలక్ష్యము లేని ప్రయత్నములు ఆరంభమునందు లాభదాయకములుగా గనుపడినను, విశ్వకల్యాణమునకును, నిత్య లాభమునకును నిరర్థకములగుచున్నవి.'

—శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు

'సాక్షాత్కారము లభింపలేదను కారణమున సాధనలు సడలింపకుము. చేత గాలము పట్టుకొని కూర్చుండుటతోడనే ప్రతిదినము ఒక పెద్దచేప దొరుకునా? ఎంతో కాలము వేచి వుండవలయును.'

—శ్రీ శారదామాత

'పిరికితనము, ద్వేషము, భయము పాతుకొని యుండు హృదయములో భగవంతుడు పొడ సూపడు.'

—శ్రీ రామకృష్ణ పరమహంస

'వినయ వివేకాదులను వృద్ధిపొందించుట కనుకూలపడని విద్య లేకపోయినను దానివలన వచ్చెడి నష్టమేమియూ లేదు. సుగుణసంపదను గడించుటకయి విద్య నేర్వవలసినదేగాని, విద్య నిమిత్తమై సద్గుణములను విడువరాదు. పలువురు మూఢులైన నిరక్షర కుక్షులుచేరి చేయు హాని కంటెను, ఒక చదువు కున్న దుష్టుడు చేయు హానియే అధికము.'

— శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు

'మనకు మహోత్తమాదర్శం ఉండాలి. కాని ప్రజలలో అసంఖ్యాకులు ఆదర్శహీనులై, అంధకార నిమగ్నులై ఉన్నారు. ఆదర్శంగలవాడు వేయి తప్పులుచేస్తే, ఆదర్శంలేనివాడు యాభై వేలు చేస్తాడు. కనుక ఆదర్శం ఉండటం చాలా అవసరం.'

— శ్రీ స్వామి వివేకానంద

'పరులు నీకు చేసిన ఉపకారము, నీవు పరులకు చేసిన అపకారము ఎల్లప్పుడూ గుర్తులో వుంచుకోవాలి. నీవు పరులకు చేసిన ఉపకారము, పరులు నీకు చేసిన అపకారము మాత్రం మరచి పోవాలి.'

— శ్రీ సత్యసాయిబాబా

'శారీరక మానసిక వృద్ధులను కలిగించే విద్య నేర్పిననాడే మానవు డభివృద్ధి చెందుతాడు.'

— శ్రీ మహాత్మాగాంధీ

'ఎక్కడ భోగమో అక్కడ రోగమును, ఎక్కడ రోగమో అక్కడ వార్థక్యమూ సంభవించును.'

— శ్రీ దయానందసరస్వతి

'దూరపు కొండలు నునుపుగను, యెక్కుటకు సుకరముగను కాన్పించును. కాని యెక్కిన కొలది కష్టములు కాన్పించును.'

— శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

'గొడ్డలి దెబ్బలు తిన్న అరణ్యాం చిగిరించవచ్చు కాని కటు వచనాలతో దెబ్బతిన్న హృదయము కోలుకోదు. శరీరంలో నాటిన తీవ్ర శరాలను పెరికి పారవేయవచ్చును కాని పరుష భాషణలు మాత్రం గుండెలో నుండి పైకి తియ్యలేము.'

— విదురనీతి

'ఆత్మ వంచనకు ఎప్పుడు అవకాశం యిస్తామో అప్పుడే-దాని వెనువెంటనే, తక్కిన అన్ని వంచనలూ ఒకదాని వెంట ఒకటి సహజంగా బయలుదేరుతుంటాయి.'

— శ్రీ స్వామి రామతీర్థ

'ఇంద్రుడైనను తననుతాను స్తోత్రము చేసికొనినచో గడ్డి పరకకన్నను తేలిక యగును."

— చాణక్యనీతి

'పేదలు నీచెంత నున్నప్పుడు వారికి తప్పక సహాయం చెయ్యి. కాని అంతలో తృప్తి చెందకు. నీవు సహాయపడేందుకు అసలు పేదలనే వారే లేకుండా చేయడ మెలాగో పరిశోధించేందుకుకూడా కృషి చెయ్యి."

— శ్రీ అరవిందులు

'చేసిన వాగ్దానాన్ని మరవడం, ఉపసంహరించుకోవడం కన్నా మరణమే మనిషికి మంచిది.'

— శ్రీ మహాత్మాగాంధీ

'జీతమునకు మాత్రమేకాదు జీవితమునకే విద్య అవసరం. అట్టి విద్య వలన సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, దయాది సద్గుణములు బాలల హృదయముల యందు ప్రతిష్ఠించుటచేత రాబోవు అన్యాయ, అక్రమ, అసత్య రూపములు నశించి పోగలవు. ఇట్టి విద్య వలన పవిత్ర హృదయములైన బాలల జీవితములు ఉత్తమోత్తము లగును.'

— శ్రీ సత్యసాయిబాబా

'శారీరక, మానసిక, ఆధ్యాత్మిక వికాసమునకు వలయునట్టి సమగ్ర విద్యాభ్యాసమే విద్యార్థులకు ఆవశ్యకము.'

— శ్రీ రామకృష్ణపరమహంస

'శత్రువును సాధించ దలచినప్పుడు క్రోధం పనికి రాదు. చిరునవ్వుతో చరిస్తూ, వాడికి విశ్వాసం కలిగించి పాములా కాటు వేయాలి. ఎటువంటి ఘాతకం తలపెట్టినా ఆ విషయం తెలియకుండా చిరునవ్వుతో, మృదుభాషణతో ఓరిమి వహించి, అదను నెరిగి పని నెరవేర్చుకోవాలి.'

— భారతమునుండి

'దేశనిర్మాణం త్యాగాలతో, రక్త తర్పణాలతో జరుగుతుంది కాని తీయని మాటలతో కాదు.'

— శ్రీ గురూజీ

'దోషదృష్టియే దుఃఖానికి కారణం. మంచి మనస్సుతో మనం చూడగలిగితే సర్వత్రా మనకు సుఖశాంతులే లభిస్తాయి.'

— మహాదాతకర్ణ

'వంచనము బయలబడక చిరకాల మెప్పుడును దాగి యుండ లేదు.'

— శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు

'మనుష్యుడు నాలుగు బలాలతో ఉంటాడు. మొదటిది బాహుబలం. అది నికృష్టమైనది, రెండవది మంచి మంత్రి. ధన సంపదలు మూడో బలం. పితృపైతామహ సంప్రాప్తమైన దున్నదే అది సహజాత బలము. ఈ బలా లన్నిటికి మించినది బుద్ధి బలము.'

— విదురనీతి

'నిన్ను పీడించేవానిని కూడా నీవు ద్వేషించవద్దు. ఏల నంటే, అతడు బలవంతుడైతే నీ ద్వేషం అతని పీడనను పెంచు తుంది. బలహీనుడైతే, నీవు ద్వేషించటమే అనవసరం. ద్వేషం రెండువైపులా పదునుగల కత్తి. బలి దొరకనప్పుడు ఎదురు తిరిగి ప్రయోక్తనే మింగివేసే ప్రాచీన మాంత్రిక ప్రయోగ క్రియను బోలిన దది."

— శ్రీ అరవిందులు

'గమ్యము, గమనము రెండూ ఉత్తమంగా వుండాలి. క్రమశిక్షణ లోపిస్తే క్షీణదశ తప్పదు.'

— శ్రీ మహాత్మాగాంధీ

'Be good, do good, see good—this is the way to god'
'మంచిగా వుండుము, మంచినే చేయుము, మంచినే చూడుము- ఇదియే భగవంతుని చేరు మార్గము.'

— శ్రీ సత్యసాయిబాబా

'పురుష ప్రయత్న విహీనునకు పరమేశ్వ రానుగ్రహం లభించుట కల్ల.'

— శ్రీ రామకృష్ణపరమహంస

'ఆశావాదం చీకటిలో దివిటీ లాంటిది. పరిణామం లేక మార్పు అనేది ప్రపంచం బ్రతికి ఉన్నట్టు నిదర్శనం. మార్పు లేనిది ఏదైనా చచ్చినదాని క్రిందనే జమ. పరిణామం అనేది ప్రపంచంలో ఎల్లకాలం ఉంటూనే ఉన్నా, కొన్ని కొన్ని సమయాల్లో అతి తీవ్రంగానూ, ఉజ్జ్వలంగానూ కనుపించుతుంది. అలాంటి సమయాల్లో అంత తేజోవంతమైన కాంతికి తట్టుకోలేక కొన్ని కళ్లు తికమికపడ్డా సూర్యోదయం అయ్యే తీరుతుంది.'

— శ్రీ రాయప్రోలు సీతారామాంజనేయశాస్త్రి

'పరికరములు సరియైన వైనచో ఫలితము యుక్తముకాక తప్పదు.'

— శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

'నీతిమార్గమున స్థిరముగా ప్రవర్తించ వలయునని. యితరులయెడ కఠినముగా నడువ గూడదు. శాంతముతోను, క్షమతోను గూడియున్నప్పుడే నీతి మిక్కిలి ప్రకాశించును. నీతి లేని క్షమాదులు మాత్ర మెందునకుం గొఱగావు."

— శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు

'కోవా దరిద్రో హి విశాల తృష్ణః
శ్రీ మాంశ్చ కో యస్య సమస్తదోషః'

'ఈ ప్రపంచమున దరిద్రు డెవడు? మిక్కుటమగు ఆశ కలవాడే. ఈ ప్రపంచమున శ్రీమంతు డెవడు? పరమ సంతుష్టి కలవాడే. అనగా సంతుష్టి కలవాడే ధనవంతుడు, అసంతుష్టి కలవాడే దరిద్రుడు.'

— శ్రీ శంకరాచార్య

'ఆశ ధైర్యాన్నీ, మృత్యువు ప్రాణాన్నీ, కోపం లక్ష్మినీ, అసూయ ధర్మాన్నీ, కామం లజ్జనూ, ముసలితనం సౌందర్యాన్నీ, నీచజనసేవ సత్స్వభావాన్నీ, అభిమానం సర్వస్వాన్నీ నశింప చేస్తాయి.'

— విదురనీతి

'శిష్యుడు ఏముఖ్య విషయాన్నీ గురువువద్ద దాచరాదు. చేసిన తప్పులు గురువుతో చెప్పుకోవడంవల్లచేతన యందలి ప్రతి బంధకాలు తొలగి ఆంతరంగిక విశుద్ధి ఏర్పడుతుంది.'

— శ్రీ అరవిందులు

'ఆత్మవిశ్వాసం మానవుడిచేత పర్వతాలనుసైతం కదలింప జేస్తుంది.'

— శ్రీ మహాత్మాగాంధీ

'మనసులోని ఆలోచన లేక యోచన. మాటలోని సూచన. క్రియలోని ఆచరణ—మూడూ ఒకటిగా వుండాలి.'

— శ్రీ సత్యసాయిబాబా

'ఎంత పెద్ద పాపంచేసినా పశ్చాత్తాపం చెంది, శిక్షను ఓర్చుకొని తపస్సు చేస్తే ముక్తిని సాధించవచ్చు. పాపం చేసిన వారు ఇతరులను నిందించక తమ మనస్సులోని దోషాన్ని తొలగించుకోడానికి ప్రయత్నించాలి. ఎంత పరిశుద్ధస్థితిలో ఉన్నా సదా జాగ్రత్తతో ఉండటం చాలా అవసరం. అహల్యా ఉదంతం నుంచి మనం నేర్చుకోవలసిన గుణపాఠం ఇదే.'

— శ్రీ రాజాజీ రామాయణమునుండి

'బలమే జీవనం. బలహీనతే మరణం. బలమే సుఖం, శాశ్వత జీవనం, అమరత్వం. బలహీనత భరింపరానిది, క్లేశకర మైనది. ఈ క్లేశానికీ, మృత్యువుకూ. దుస్థితికీ భయమే కారణం.'

— శ్రీ వివేకానంద

'విద్యాబలము గల దుర్జనుడు మనుష్యరూపమున నున్న రాక్షసునితో సమానం. విద్య లేకపోయినప్పటికి మానవత్వమున్న సజ్జనుడైతే మానవరూపంలోనున్న మాధవుడే.'

— శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు

'సత్సాంగత్యమే ఆత్మవికాసమునకు ముఖ్యాంశము.'

— శ్రీ రామకృష్ణ పరమహంస

'ఏ జాతి తన పూర్వులను స్మరించదో, ఆ జాతికి భవిష్యత్తు శూన్యం. ఏ జాతి తన ఉజ్జ్వల గతచరిత్రను విస్మరిస్తుందో, అ జాతికి భవిష్యత్తు వుండదు. ఏజాతి తన ధర్మసంస్కృతీ పరంపరలను విడనాడుతుందో, ఆ జాతికి మనుగడే లేదు. కనుక ఈ పవిత్ర భారతావనిలో జన్మించిన మహనీయుల సుగుణములను స్మరించుకుంటూ, గతవైభవాన్ని నెమరువేసుకొని స్ఫూర్తిని పొంది, ఉత్తేజితులై, నవభారత నిర్మాణానికి కంకణధారులవ్వాలి.'

— శ్రీ చిత్తరంజన్ దాస్

'ఎదుటివానిని నిందించడమే స్వభావము కలవాడు మహాపాపి. నిందలను సహిస్తూ వారిని క్షమించే వాడే పుణ్యాత్ముడు. హింస దుష్టుల బలం. దండనీతి రాజులకు బలం. సేవ స్త్రీలకు బలం. క్షమ గుణశీలికి బలం.'

— విదురనీతి

'నీవు మహాత్కార్యాలు చేస్తూ బృహత్ఫలితాలను సాధిస్తున్నప్పుడు ఏమీ చేయడంలేదన్న అనుభవాన్ని పొందగలిగితే భగవదనుగ్రహం నీకు కనువిప్పు కలిగించిందని తెలుసుకో.'

— శ్రీ అరవిందులు

'నీతిలేని వాణిజ్యము, కృషి లేని సంపద, శీలము లేని విద్య, త్యాగము లేని ఆరాధన, మానవత లేని శాస్త్ర విజ్ఞానం, నియమనిష్ఠలు లేని రాజకీయం—ఇవే సామాజిక పాపాలు.'

— శ్రీ మహాత్మాగాంధీ

'నీతియే నీ జాతి; అది వదలినచో నీవు కోతికంటే హీనుడవవుతావు. దృష్టి యెట్టిదో సృష్టి అట్టిది. పొంగి క్రుంగని తత్త్వాన్ని అభివృద్ధి పరచుకుంటే, లొంగి వంగని జీవితం గడుపవచ్చు.'
— శ్రీ సత్యసాయిబాబా

'One should possess the head of Shankara, the heart of Buddha and the hand of Janaka.' 'శంకరాచార్యుల వంటి మేధాశక్తి, బుద్ధుని వంటి హృదయము, జనకుని వంటి నిష్కామ కర్మతత్పరత ప్రతి ఒక్కరు కలిగి యుండవలెను. అతడే పరిపూర్ణ మానవుడు.'
— శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వామి

'విద్య యనగా అక్షరాస్యత కాదు. వివేకము, విజ్ఞానము కలిగి వర్తించుట. ఆధుని కాంగ్లవిద్య కేవలము పరాధీనమైన బ్రతుకునకే మూలము. సాంకేతిక పరిశోధన విద్యలు అవసరం.'
— శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

'అర్హులని తోచిన వారికి మాత్రమే ఉపదేశము చేయవలెను. పాత్రత నెఱిగి దానము చేయవలెను.'
— శ్రీ రామకృష్ణపరమహంస

'కళ్ళెం పట్టినంతమాత్రం చేత సారథికాడు. గుఱ్ఱాన్ని హద్దుపద్దులలో పెట్టి లొంగతీసినట్లు, కోపాన్ని అణచి స్వాధీనం చేసుకొనే వాడే నిజమైన సారథి. పాము కుబుసం వదలివేసేటట్లు–వచ్చిన కోపాన్ని వచ్చినట్లు ఎవడైతే వదలి వేస్తాడో–వాడే నిజమైన వీరుడు. ఒక్క మాసం కూడా తప్పకుండా యోగం చేస్తూ నిండా నూరేండ్లు జీవించేవాడి కంటే–కోపం లేనివాడే ఉత్తమ దీక్షితుడు. కోపించే స్వభావంగల మనిషిని–పరిచారకులూ, చుట్టాలూ, సహోదరులూ, కట్టుకున్న భార్యా, కనిపెంచిన బిడ్డలూ–వీరంతా విడచిపెట్టి పోతారు. ధర్మం, సత్యం–అన్నీ కూడా అటువంటి వాణ్ణి వదలిపెట్టి పోతాయి.'
— శ్రీ రాజాజీ భారతంనుండి

'ఏ కృషీ చేయకుండా సంపదలు వాంఛించేవాడూ, స్వీయ కార్యాలు విడిచి పరాచారాలను పాటించేవాడూ, మిత్రులతో అసంబద్ధంగా చరించేవాడూ, అయోగ్యులను వాంఛించేవాడూ, సఖులను తిరస్కరించేవాడూ, బలవంతులతో వైరము పెంచుకునే వాడూ, శత్రువులతో మైత్రి సాగించి మిత్రకోటితో శత్రుత్వం నెరపేవాడూ, పితృదేవతా కర్మలు నిర్వర్తించనివాడూ, కృతఘ్నులను విశ్వసించేవాడూ, దోషాచార పరాయణుడూ, పరదోష గ్రహణ చిత్తుడూ, వ్యర్థ క్రోధీ—వీరందరూ మూర్ఖులే.'

— విదురనీతి

'నీచత్వం, స్వార్థపరత్వం-ఈ రెండూ క్షమించరాని పాపాలు. మొట్టమొదట మనయందు వీటిని నిర్మూలించుకోడానికి శ్రద్ధ వహించాలి.'

— శ్రీ అరవిందులు

'సత్కార్యాలను చేసి చూపెట్టు. చేస్తానంటూ ప్రచారం చేసుకుంటూ మురిసిపోకు.'

— శ్రీ మహాత్మాగాంధీ

'నాలుక వశము చేసుకొనినవానికి లోకమే వశమగును.'

— శ్రీ సత్యసాయిబాబా

'చేతలను బట్టి ఒకవ్యక్తి శీలమును నిర్ణయించాలి గాని, అతని వేషధారణను బట్టికాదు.'

— శ్రీ స్వామి వివేకానంద

'విద్యయొక్క పరమార్థము స్వతంత్రంగా ఆలోచించుట, స్వతంత్రంగా జీవించుట.'

— శ్రీ లాలాలజపతిరాయి

'కొందరు గొప్పగానే జన్మిస్తారు. కొందరు గొప్పతనం సాధిస్తారు, కొందరి తలలమీద గొప్పతనం మోపబడుతుంది.'

— శ్రీ షేక్స్పియర్

'క్షమించరాని ద్రోహం నిస్పృహయే. క్షంతవ్యంకాని మహాపాతకము భయమే.' — శ్రీమతి సరోజనీనాయుడు

'కలసి ఉంటే నిలబడుతాము, చీలిపోతే కూలిపోతాము.' — శ్రీ సురేంద్రనాథబెనర్జీ

'మనకెంత యిక్కట్టు తటస్థించినా, చివరకు మరణమే సంప్రాప్తించినా పోరులో చివరి వరకూ నిలబడటమూ, వినయం విడవకుండా అణగి ఉండటమూ, సర్వాధికారాలు వుండి మహా ప్రాభవం కలవారైనా దుష్టులై ఉండేవారిని నిర్మూలించడమూ, అన్యాయప్రాబల్యాన్ని అడుగంట త్రొక్కటానికి కృషిచేయటమూ, న్యాయం యొక్క శక్తిని వర్థిల్లజేయటమూ మన విధి. దానిని తప్పించుకొనడానికి ప్రయత్నించకూడదు.' — శ్రీ దయానంద సరస్వతి

'మౌనం, భాషణకంటే ఉత్తమమైనది. సత్యవాక్పాలనం, మౌనంకంటే లాభప్రదమైనది. ప్రియభాషణం ద్వితీయస్థానమే ఆక్రమిస్తుంది. సత్యంతో పాటు అది ప్రియంగా ఉంటే, ధర్మ సమ్మతంకూడా అయితే—ఆ వాక్కు సర్వవిధాలా ఉత్తమమైనది.' — విదురనీతి

'భావనాశక్తిని ఎల్లప్పుడూ నిర్మాణాత్మక ప్రయోజనాలకే వినియోగించాలి. ద్వేషం, అసూయ, క్రోధం - వీటికి వశులమై పోక ప్రేమతో, విశ్వాసంతో అభ్యుదయకార్యాల కొరకే వుపయోగించాలి.' — శ్రీ అరవిందులు

'అహింస నాగరికలోకానికి నవవేదం. అహింసావాదికి అపజయం లేదు. మానవుడు కట్టకడకైనా ఆశ్రయించేది అహింసనే. హింసావాది నరుడు కాడు. అతడు నరరూప రాక్షసుడు. అహింస అజేయమైన శక్తి. అహింసకు మాత్రమే హింసను క్షమించే గొప్పతనం తెలుసు.' — శ్రీ మహాత్మాగాంధీ

'సర్వజీవన ప్రేమయే సర్వేశ్వర పూజ
సర్వరసముల సారమే కరుణ రసము
సర్వమతముల ధర్మమే చిత్త నైర్మల్యము
సర్వసాధనముల గమ్యమే శాంతి సౌధము.'

— శ్రీ సత్యసాయిబాబా

'Silence is the only tribute that I can offer.' 'మాటలలో చెప్పజాలనది మౌనమే వచింపగలదు.'

— శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

'విద్యకు, విజ్ఞానానికి వ్యత్యాసం ఉంది. విద్యద్వారా విజ్ఞానం సంపాదించినప్పుడే ఆ విద్యకు విలువ ఉంది. జీవిత దృక్పథాన్ని, ఇతర ప్రజలతో లేక ఇతర సంఘాలతో ఉండవలసిన సంబంధాలను నిర్ణయించేదే విజ్ఞానం.'

— శ్రీమతి సరోజినీనాయుడు

'మిత్రులు ఒకరి నొకరు గౌరవించుకుంటూ, అన్యోన్య సహాయకులుగా ఉండాలేకాని, అత్యల్ప విషయాలలో భిన్నాభిప్రాయాలు కలిగినప్పుడు విడిపోగూడదు.'

— శ్రీ లాలాలజపతిరాయి

'అహంకారము హృదయము నావరించునపుడు భగవానుడు అందు ప్రకాశింపజాలడు.

— శ్రీ రామకృష్ణపరమహంస

'బాధలవంటి కఠినపాఠము వేరొకటి యుండజాలదు.'

— శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూ

'అప్రస్తుత ప్రసంగాలు చేయకుండా, దుర్లభమైన వస్తువులను కోరకుండా, పోయినవాటికోసం శోకించకుండా, విపత్తులలో ధైర్యం కోల్పోకుండా, ఆరంభించిన కార్యాలను మధ్యలో ఆపకుండా, సోమరియై కూర్చోకుండా మనస్సును వశపరచుకొని చరించువారు పండితులు.' — విదురనీతి

'భగవానుడు నా కన్నులు తెరిచాడు. ఏలనంటే నీచ వస్తువులలోని ఉదాత్తతను, అసహ్యావస్తువులలోని మనోజ్ఞతను, వికలాంగులలోని సౌష్ఠవాన్ని, వికారరూపులలోని సౌందర్యాన్ని నేను చూడగలిగాను.' — శ్రీ అరవిందులు

'స్వదేశమే నా స్వగృహం. ప్రజలే నా బంధుకోటి. స్వాతంత్ర్య సాధనమే నా జీవిత లక్ష్యము.'

— సర్దార్ వల్లభభాయిపటేల్

'మీ విజ్ఞానాన్ని, విద్వత్తును, విజ్ఞతను ఒకప్రక్కన; సత్యాన్ని, నిర్మలత్వాన్ని మరోప్రక్కన ఉంచి తూచితే ముల్లు సత్య నిర్మలత్వములవైపే మొగ్గుతుంది. శీలరహితమైన విజ్ఞానం ఒక దుష్టశక్తి.'

— శ్రీ మహాత్మాగాంధీ

"Life is a challenge; Meet it.
Life is love; Enjoy it.
Life is a dream; Realise it.
Life is a game; Play it."

అనగా "జీవిత మొక సవాలు; నిలుచుకొని ఎదిరించు.
జీవితమే ప్రేమ; తనివిదీర భోగించు.
జీవిత మొక స్వప్నం; అను భావ్య మొనరించు.
(అనుభవించ తగినదానిగా చేసుకొనుము)
జీవిత మొక కళ; తెలిసుకొని క్రీడించు."

— శ్రీ సత్యసాయిబాబా

'మనము ఉన్నత లక్ష్యములతో ఉత్తేజితులము కావలెను. స్వార్థపరుడో, భీరువో సాధించు ప్రాపంచిక విజయముచే క్రుంగి పోవు నంతటి అల్పులము కారాదు.'

— శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

'భారతీయులుగా జీవించడం అలవరచుకోండి. విదేశ విజ్ఞాన సంపర్కంవల్ల భారతీయ చైతన్యం మనలో నశించింది. భారతీయ చైతన్యం, భారతీయ విజ్ఞానం అంటే దేవుడిగుడికి వెళ్లుట, కట్నాలు, నగలు, చీరెలు, అందచందాలు, కుంకుమ కాదుసుమా! భారతీయ విజ్ఞానమంటే తరతరాలనుంచీ కాపాడ బడిన భారతీయ సత్సాంప్రదాయాలే. అట్టి సత్సాంప్రదాయాలు మనకు బలం చేకూరుస్తాయి.'

— శ్రీమతి సరోజినీనాయుడు

'స్వదేశీ ఉద్యమం మనలో ఆత్మగౌరవం (Self-respect), ఆత్మవిశ్వాసం (Self-confidence), స్వయంపోషకత్వం (Self-supporting), స్వార్థత్యాగం (Self-sacrifice) పెంపొందిస్తుంది. మత భేదాలను పోగొట్టి మనల్ని అందరినీ సమైక్య పరుస్తుంది. మన మాతృభూమికోసం దృఢవిశ్వాసంతో, హృదయపూర్వ కంగా చేతులు కలిపి పనిచేయడానికి ఇది తోడ్పడుతుంది. సమైక్య భారతానికి ఈ స్వదేశీ ధర్మమే మతధర్మంగా వుండాలి.'

— శ్రీ లాలాలజపతిరాయ్

'సత్యం అన్నిటికంటే ఉత్తమమైన నీతి. మరే ఇతర మార్గాలద్వారా దేశానికి మేలు చేకూర్చలేము. సత్యాన్ని పాలించడం అగ్నిపరీక్ష వంటిది. బంగారం తేటు తేరాలంటే అగ్నిలో మండిస్తాము. సత్యపరీక్ష కూడా ఇట్టిదే.'

— శ్రీ బాలగంగాధరతిలక్

'అధిక ప్రసంగాలూ, క్రోధమూ, అపారమైన అభిమానమూ, త్యాగశూన్యత్వమూ, ఉదరపోషణ చింతా, మిత్రద్రోహమూ అనే ఆరు కరవాలాలు మానవుని ఆయుఃప్రమాణాన్ని తెగనరుకు తుంటాయి.'

— శ్రీ విదురనీతి

'భగవానుడు మనకు పరమ మిత్రుడు. ఏలనంటే మనలను ఎప్పుడు లాలించాలో తెలియడమేగాక, ఎప్పుడు దండించాలో కూడ ఆయనకు తెలుసు. ఎప్పుడు కాపాడాలో తెలియడమే కాక, ఎప్పుడు హతమార్చాలో కూడా ఆయనకు తెలుసు.'

—శ్రీ అరవిందులు

'మనకు స్వభాషలలో విద్య వుంటే స్వారాజ్యం ఎప్పుడో వచ్చి వుండేది. సంస్కృత విద్యాబోధన పూర్తిగా నిర్లక్ష్యం చేయబడుతున్నది. సంస్కృతం ప్రతి ప్రాంతీయభాషను పరిపుష్టం చేస్తువ్నది. అందువల్ల ప్రతి రాష్ట్రీయుడూ దీనిని తప్పక చదవాలి. మన ధర్మ సంస్కృతులలో గల మహోన్నత భావాలను గ్రహించడానికి సంస్కృతభాష చక్కగా ఉపకరిస్తుంది.'

—శ్రీ మహాత్మాగాంధీ

'ఆత్మజ్ఞానం లేని విద్యవలన ప్రయోజనం లేదు. తా మెవరో తెలుసుకోనక పరులను తెలుసుకొనుటకు ప్రయత్నించుట వ్యర్థము.'

—శ్రీ సత్యసాయిబాబా

'మాతృభాషలో విద్యను బోధించడంవల్ల మనస్సులు చురుకుగా పనిచేస్తాయి. చదవడం చాలావరకు తినడంలాంటిదే. మొదటి కబళంలోనే రుచి పుట్టితే, పొట్ట నిండక ముందే జీర్ణ రసాలు బాగా ఊరుతాయి. ఇంగ్లీషు భాషను బెంగాలు బాలుడికి నేర్పితే ఇట్లా జరుగదు. ఇటు ఆంగ్ల వర్ణక్రమాలతోను, వ్యాకరణంతోను ఊపిరాడక తికమక లాతుంటే, అటు కడు పెండి పోతుంది. ఆరంభంనుండీ మనస్సంతా పనిచేయకపోతే, దాని పూర్ణవికాసం చివరికి కూడా కాకుండా పోతుంది.'

—శ్రీ రవీంద్రనాథ్ టాగూర్

'యువజనులు – ధైర్యోత్సాహాలూ, గౌరవమూ, ఆత్మ విశ్వాసమూ కలిగి ధనధాన్యాలయందు కంటే పీడితులూ, తాడితులూ అయినవారికి సేవచేయటమూ, జ్ఞానోపార్జనా, పరాభిప్రాయాన్ని పాటించడం – అనే వాటియందు మిక్కిలి శ్రద్ధ చూపాలి.'

—శ్రీ లాలాలజపతిరాయి

'ప్రతి మనిషి జీవితంలో ఏదో ఒకటి సాధించాలి. ఈ జీవితం వృథా కాలేదు, ఈ జీవితాన్ని సద్వినియోగం చేశాను. మానవజాతి శ్రేయస్సుకు వినియోగించాను అన్న సంతృప్తి ప్రతి ఒక్కరికీ వుండాలి. అదే నిజమైన జీవితం. వాడే నిజమైన మనిషి. అదే జీవితాశయం అంటే.

—శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు

'మన మాటలో బలం ఉంటేనే ప్రపంచం వింటుంది. బలం లేనప్పుడు మంచిమాటను కూడా ఎవరూ వినరు.'

—శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూ

'అన్నిటికంటే సత్యం గొప్పది, అంతకంటే గొప్పది సత్య మార్గంలో నడవడం.'

—శ్రీ గురునానక్

'సకల ప్రాణుల యెడల నీవు దయకలిగి ఉండడమనేది మంచిదే. కాని, నీ దయకు నీవు దాసుడవు కావడం మాత్రం మంచిదికాదు. సర్వేశ్వరునికి తప్ప మరెవ్వరికీ నీవు దాసుడవు కావద్దు.'

—శ్రీ అరవిందుల

'అగ్నివల్ల సువర్ణమూ, ఆచారంవల్ల పురుషుడూ, వ్యవహారం వల్ల శ్రేష్ఠుడూ, భయంవల్ల శూరుడూ, విపత్తియందు ధీరుడూ ఆపదలలో మిత్రులూ బయట పడుతారు.'

— విదురనీ

'సమస్త విశ్వంలోను నాకు ప్రియమైనది భారతదేశం. భారతభూమి నా మాతృదేవత. అది నా దేశం అయినందువల్ల కాదు. ఇందు నేను అపారమైన మంచితనాన్ని గుర్తించాను. భారత్‌కి చెందిన సమస్తమూ నన్నాకర్షిస్తున్నది. మానవుని మహత్తరా కాంక్షలన్నీ అందున్నాయి. భారత్ ప్రధానంగా కర్మభూమి. భోగభూమి కాదు. నాకు అవసరమైన ఆధ్యాత్మికత నంతటిని ప్రసాదిస్తున్నది నా ఈ భారతి. నా మహోన్నతా కాంక్షలకు అనుగుణమైన వాతావరణమంతా యిక్కడ వుంది. నా సర్వస్వము ఆమె పెట్టిన భిక్షయే. అందువల్లనే నేను తల్లి బిడ్డను అంటిపెట్టుకొని ఉన్నట్లుగా భారతమాతను అంటిపెట్టుకొని ఉంటాను.'

— శ్రీ మహాత్మాగాంధీ

'నిందాస్తుతులను సమదృష్టితో స్వీకరించవలెను. మనలను ఎవరైనా నిందించినపుడు క్రుంగక, పొగడినప్పుడు పొంగక ఏక భావముతో మెలగవలెను.'

— శ్రీ సత్యసాయిబాబా

'తానొక మాంసపుముద్దకాక చైతన్యమూర్తి కావడానికి, నష్టాన్ని లాభంగాను, మరణాన్ని అమరత్వంగాను మార్చగల్గడానికి విద్య అవసరం. ఎప్పుడూ పూర్వచరిత్రే వింటూ జీవితం నడుపుకోడాని కెల్లప్పుడు ఆ శాస్త్రాలవైపు, ఈ శాసనాలవైపే చూస్తూ కూర్చోక, జీవితంలో స్వేచ్ఛా సత్యాల్ని పరికించి, ఉన్నతాశయాలు కలిగియుండటం యువకుల దృక్పథమై యుండాలి. స్వల్పంలో కాదు గొప్పలో వుంది సుఖం.'

— శ్రీ రవీంద్రనాథ్‌టాగూర్

'గత చరిత్ర చూచుకొని గర్వపడుట తెలివి తక్కువ. మన పూర్వులు వేసిన పునాదులపై నిలుచుట కాదు మనకు గర్వము ; ఆ పునాదులకు సర్వవిధముల తగిన, సుందరమైన సౌధ నిర్మాణం చేయగలిగినపుడే-వారికి తగిన వారసులమని గర్వించవలెను.'

— శ్రీ లాలాలజపతిరాయి

'జీవితంలో ప్రతిసెకను అమూల్యమైనది. వ్యర్థంగా కూర్చోవడం వలన జీవితంలోని విలువైన క్షణా లెన్నో నిరుపయోగంగా గడచిపోతాయి. తరువాత మనం ఎంత విచారించినా ప్రయోజనం లేదు. ఎంత విలువ చెల్లించినా ఆ క్షణాలను తిరిగి పొందలేము.'

— శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

'కుండ నీటికి ఆధారం. కాని నీళ్ళు లేకుండా కుండలో రూపాన్ని గుర్తించగలమా? మనస్సుకి జ్ఞానం ఆధారం. కాని, గురువు ప్రజ్ఞ లేకుండా మనస్సు జ్ఞానాన్ని ఎలా పొందుతుంది?'

— శ్రీ గురునానక్

'ఆధ్యాత్మిక లక్షణం బొత్తిగా లేనివాడు గురువే కాజాలడు. అట్టివానిని మిథ్యాచారి అనవలసి వుంటుంది. తనద్వారా శిష్యుడు ఈశ్వర సంస్పర్శ పొందడానికి వీలు కల్పించే ఒకానొక ఆధ్యాత్మిక లక్షణమేదో గురువులో వుండటం అవసరం.'

— శ్రీ అరవిందులు

'ఉత్తమ శీలస్వభావాలు కలవాడు సర్వులనూ జయిస్తాడు. వ్యక్తికి ప్రధానమైన శీలం నశిస్తే వాని జీవితం వ్యర్థమే.'

— విదురనీతి

'స్వరాజ్యం సాధించబడగానే శీల నిర్మాణం, అనుశాసనం, ధైర్యం. శక్తి మున్నగువానిని జాతిలో నిర్మించేందుకు విశేష కృషిజరగాలి. సాధారణ విద్యార్జనకన్నాకూడా ఇది ముఖ్యం. ప్రస్తుత పఠనద్వారా జరిగే విద్య కూడా ఈ గమ్యానికి సాధన మాత్రమే కావాలి.'

— శ్రీ మహాత్మాగాంధీ

'ద్వేషశక్తి కంటే ప్రేమశక్తి కోటిరెట్లు ఘనతరము.'

— శ్రీ రామకృష్ణ పరమహంస

'మానవ ప్రయత్నము, దైవసంకల్పము - ఈ రెండునూ చేరినప్పుడే కార్యము నెరవేరును. మన మెట్టి ప్రయత్నము చేయక భారమంతయూ భగవంతుని మీదవేసిన ఫలిత ముండదు. ఏ కార్యమైనను సఫలీకృతంగావలయు ననిన పురుష ప్రయత్నం అత్యవసరం. పురుష ప్రయత్నానికి దైవసహాయం తప్పనిసరిగా చేకూరుతుంది.'

— శ్రీ సత్యసాయిబాబా

'తోటిమానవుల జీవితంలో కలిసి మెలిసి ఉండటమే భగవంతునితోవుండి అతని సేవచేయడం. భగవత్సేవకోసం ప్రపంచ కార్యాలేపాటినీ వదలనక్కర లేదు. భగవంతునికి చోటుచేయడానికని తోటిమానవుని త్రోసివేయ నక్కర లేదు. భగవంతునికోసం హృదయం చోటుచేస్తే సర్వప్రపంచానికి చోటు చేసినట్లే.'

— శ్రీ రవీంద్రనాథటాగూర్

'విద్యావేత్తలు బోధనా పటిమా నైపుణ్యాలకంటే మానవత్వమే అధికంగా ప్రకటించాలి.'

— శ్రీ లాలాలజపతిరాయి

'ఇతరుల ఉన్నతిని చూచి ఈర్ష్యపడటం కంటే, మనం కూడా వారివలె ఉండటానికి ప్రయత్నించాలి.'

— శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

'నీ మనస్సు నిర్మలంగా లేకపోతే నీదేహం కూడా, నీవాక్కు కూడా మలినంగానే వుంటాయి.'

— శ్రీ గురునానక్

'క్రూరత్వంకంటే నీచత్వమే హీనమైనది.'

— డా. అంబేద్కర్

'తన చేతులతో తన రక్తాన్ని, ఆస్తుల్ని సమర్పించడమే మన సంస్కృతియొక్క ఆదర్శం. జీవిత సర్వస్వాన్ని సంఘం కోసమే అర్పించాలి. అన్నపానాదులు మొదలు అన్ని పనులూ సంఘం కోసమే చేయాలి. అసలు బ్రతకటమే సంఘం కోసం. సంఘం కోసం చావవలసివస్తే అందుకూ సిద్ధమే. కార్యం చెయ్యటంలో కృశించి, కృశించి ప్రాణాలు పోయినా సరే, శరీరాన్ని శుష్కింప చెయ్యటంవల్ల కార్యవృద్ధి జరిగేటట్లైతే దానికోసం కటిబద్ధులు కావటమే మన ఆదర్శం.'

— డా. హెడ్‌గేవార్

'శీలం, ప్రవర్తన పెంపొందించటం ప్రథమ కర్తవ్యం. పిల్లలకి ధైర్యం, బలం, నీతి, ఉన్నతాశయాలు అలవర్చడం అవసరం. ఇవి అక్షరాస్యతకన్న ముఖ్యం. చదువుయొక్క ప్రధానలక్ష్యం అదే.'

— శ్రీ మహాత్మాగాంధీ

'ఆధ్యాత్మిక రంగంలో విద్య ఒకటే చాలదు. తపస్సు కూడా కావాలి. ఈనాడు ప్రాపంచిక విషయాలైన తిండి, గుడ్డ, పదవి, ధనం కోసం ఉపయోగపడుతున్న విద్య నిజంగా అజ్ఞానమే అవుతుంది. ఆధ్యాత్మికవిద్య అట్లుకాదు. ఇహంలో, పరంలో కూడా ఆనందాన్నిస్తుంది.'

— శ్రీ సత్యసాయిబాబా

'వ్యర్థక్రోధంతో పరుషంగా భాషించ కూడదు. కటువచనాలు మర్మస్థానాలను వేధిస్తాయి. అందుచేత ఎప్పుడూ పరుషంగా మాట్లాడ కూడదు. పరుషంగా భాషిస్తూ పరులను పీడించేవాని కంటే దరిద్రుడు లేడు. మనను గురించి ఎవరైనా పరుషంగా భాషిస్తూంటే, అకారణంగా మనను నిందిస్తూంటే వాడు మన పుణ్యఫలాన్ని పెంపొందిస్తున్నాడని సంతోషించాలి.'

— విదురనీతి

'ఆదర్శాలను గురించి మాట్లాడునప్పుడు చాలామంది పెద్ద మనుష్యులవుతారు. ఆచరించవలసివచ్చేసరికి తప్పించుకుంటారు.'

— శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

'తల్లిదండ్రులు పిల్లలకు ప్రేమతోనే వివేకోదయం కలిగించాలి కాని, భయంతో కాదు.'

— శ్రీ లాలాలజపతిరాయి

'పాఠశాలలలోను, కళాశాలలలోను కూడా బోధన మాతృభాషద్వారానే జరగాలి. మాతృభాషద్వారానే మానవుడు జీవితంలోని గంభీర అంశాలను నేర్చుకోగలడు. దేశంలోని పిల్లలందరూ ఆంగ్లం నేర్వలేరు. నేర్చుకున్నవారైనా తమ శక్తి సామర్థ్యాలు చాలావరకు ఈ విదేశీభాష కోసమే వినియోగించడంవల్ల స్వతంత్రభావాల్ని అభివృద్ధి చేసుకోవడానికీ, స్వతంత్ర పరిశోధనల్ని నడపడానికీ జవసత్తువ లుండవు.'

— శ్రీ రవీంద్రనాథటాగూర్

'గురుభక్తి దైవభక్తికన్న గొప్పది. గురుభక్తి వున్నవానికి శాంతి సులభంగా లభ్యమవుతుంది. మంచి విద్వాంసుని ఆచార్యునిగా వరించి సేవించి తరించండి.'

— శ్రీ కంచి కామకోటిజగద్గురు

'ధైర్యమూ, ప్రేమ—ఇవి రెండూ తప్పనిసరిగా వుండవలసిన ముఖ్య సుగుణాలు.'

— శ్రీ అరవిందులు

'నీవు సత్యమును అనుసరించునపుడు ఆ కారణమున ఎవరి గుండెయైన పగులుతుందా-సత్యమును హత్యచేయడం కంటె ఆ ఒక్క శరీరము నాశనము కావడం శ్రేష్ఠమే. శరీరము భగ్నమైనా, సత్యం భగ్నం కాకూడదు.'

— స్వామి రామతీర్థ

'తప్పు చేయడం తప్పుకాదు. అది తప్పని తెలుసుకొని దానిని సరిదిద్దుకోక పోవడమే తప్పు.' — శ్రీ మహాత్మాగాంధీ

'దేహో దేవాలయః.' 'దేహమే దైవమందిరం. దానిని ఎల్లప్పుడూ పరిశుభ్రముగా వుంచుకోవలెను. ఆరోగ్యమును కాపాడు కోవలయును. శరీరము దృఢముగా వుండిననే దైవ ధ్యానము చేయగలరు. తోటిమానవులకు సహాయ పడగలరు. కావున ఆహార నియమములను సక్రమముగా పాటించవలెను.'

— శ్రీ సత్యసాయిబాబా

'విద్వేషం కలవారు హంసతూలికాతల్పంమీద శయనించినా సుఖంగా నిద్రపోలేరు. పరిసరాలలో వందిమాగధ నారీజనులు సంకీర్తనాలు చేస్తున్నా సంతోషించలేరు. ధర్మ మార్గాన చరించలేరు. గౌరవ సుఖాలను అనుభవించలేరు. శాంతి మార్గమూ, హితవాక్యమూ వారికి నచ్చవు. వారికి క్షేమం కలుగదు.' — విదురనీతి

'నిరాశ, నిస్పృహలు శాంతియుతమైన జీవితమునకు వేరు పురుగులు.' — శ్రీ లాలాలజపతిరాయి

'ఎచట స్త్రీలు పూజింపబడుదురో అచట దేవతలు క్రీడింతురు. ఎచట పూజింపబడరో అచట అన్ని క్రియలూ ఫలశూన్యము లగుచున్నవి.' — శ్రీ మనువు

'గురువునందు అనన్యభక్తితో ఏ దాపరికము లేక శరణు జొచ్చిన అతడు మనలను దుఃఖముల నుండి రక్షించి మోక్షమునకు గొనిపోవును. ఈశ్వరభక్తికి గురుభక్తి అవసరము. ప్రజలకు గురుభక్తి లేమిచేతనే దైవభక్తి కుదురుటలేదు. గురువు త్రిమూర్తి స్వరూపము. అతడే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు. అందువలన గురువునే దైవముగా భావించి పూజింపవలెను.

— శ్రీ కంచికామకోటిజగద్గురు

'మంచి పుస్తకములు దగ్గరనున్న యెడల మనకు మంచి మిత్రులు వెంటలేని లోపము కనుపించదు. గ్రంథపఠనాభిలాష గల వాడెచ్చటున్నను సుఖముగా నివసించగలడు.'

— శ్రీ మహాత్మాగాంధీ

'ఈనాడు స్ఫురించిన భావం మరొక నాటికి జ్ఞాపకం వుండకపోవచ్చు. జ్ఞాపకం వున్నా తొలి స్ఫురణలోని వాడి తగ్గవచ్చు, విన్నాణం తరగవచ్చు, వైచిత్రి మరుగు పడవచ్చు. విస్ఫూర్తి మందగించవచ్చు. అందువల్ల ఎప్పుడు స్ఫురించిన భావాన్ని అప్పుడే ఒక చోట వ్రాసుకోవడం మేలు.'

— శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

'పరిపాలనలో బాల్గొనుటకు బుద్ధిమంతులు నిరాకరించిన దుష్పరిపాలన క్రింద జీవితము గడుపు శిక్ష వారనుభవించవలసి యుండును.'

— శ్రీ ప్లేటో

'Politics means organised life of a nation.' 'రాజకీయము లనిన జాతియొక్క నియబద్ధమైన జీవితము. అట్టి జీవితము అలవడి నపుడే మన మభివృద్ధి బొందగలము.'

— శ్రీ సర్దార్ వల్లభాయిపటేల్

'ఉపాధ్యాయులు, విద్యార్థులను స్వతంత్రంగా ఆలోచించేట్టు తీర్చిదిద్దాలి కాని, తాము చెప్పిందే వేదవాక్యమని భావించేట్టు వారిని నడిపించరాదు.'

— శ్రీ లాలాలజపతిరాయి

'శాంతంతో క్రోధాన్ని, సద్వ్యవహారంతో అసాధువులను, దానంతో లోభాన్ని, సత్యంతో అసత్యాన్ని జయించాలి.'

— విదురనీతి

'సేవ వలన అహంకార రాహిత్యము, ఆనందప్రాప్తి లభించును. సేవాతత్త్వమే మానవుని అహంకారమును దూరము చేయు యంత్రము, తంత్రము, మంత్రము. సేవ యనగా మానవ సేవ, పీడిత ప్రజల సముద్ధరణ. 'మానవసేవయే మాధవ సేవ గదా!'

— శ్రీ సత్యసాయిబాబా

'సాటిలేని మహదానందం భగవానుని ప్రేమించడంలో ఉన్నది. దాని తరువాత మానవులలోని భగవానుని ప్రేమించడంలో కూడా అటువంటి మహదానందమే వున్నది.'

— శ్రీ అరవిందులు

'ఇంతకూ జాతి అంటే ఏమిటి? మాతృదేశమంటే ఏమిటి? అది కేవలం ఒక మట్టిముద్ద, ఏదో కవిత్వ విశేషము, లేదా మనస్సులోని ఒక వెఱ్ఱిఊహ మాత్రం కానేకాదు. అది ఒక విశేష మైన శక్తిస్వరూపిణి. జాతిలో అంగాంగీభూతులు కాగల అశేష ప్రజా సముదాయపు సామూహిక శక్తిస్వరూపిణి. భవానీ మహిషాసురమర్దని, భవానీ భారతి సుమా!'

— శ్రీ అరవిందులు

'కేవలం ఆవేశంవల్ల ఏమీ చేయజాలం. కార్యరంగంలో ప్రవేశించాలి. సంస్కరణోద్యమాన్ని ఎలా ప్రారంభించాలో ఆలోచించాలి. ఆవేశం ఆలోచనలకు అవకాశం యివ్వదు. ఆవేశం తగ్గినప్పుడే సరిఅయిన దృష్టితో ఆలోచించడానికి అవకాశం ఏర్పడుతుంది.'

— శ్రీ దరిశి చెంచయ్య

'విద్యద్వారా సాంకేతిక విజ్ఞానాన్ని సాధించాలి. తద్వారా వస్తూత్పత్తిని పెంచుకోవాలి, తద్వారా దేశంయొక్క సంపద పెరగాలి. దేశంయొక్క సంపద పెరగడంవల్ల దారిద్ర్యనిర్మూలన జరిగి అత్యధిక సంఖ్యాకులకు పని ఏర్పడాలి. విద్య అన్ని సమస్యల పరిష్కారానికి రాజమార్గం.'

— శ్రీ మన్నవ గిరిధరరావు

'Religion is the idea which is raising the brute unto man; man unto God." 'మానవత్వంలేని పరమమూర్ఖుని మానవత్వంగల మనిషిగా, మానవుని మాధవునిగా, నరుని నారాయణునిగా, జీవుని శివునిగా, పురుషుని పురుషోత్తమునిగా, పశువుని పశుపతిగా మార్చగలిగేది మతం ఒక్కటే.'

— శ్రీ స్వామివివేకానంద

'నీ వేంచేసినా ఉద్యోగంచేసినా, వ్యాపారంచేసినా- ఏదైనా సరే, ఎదుటివారికి సేవాభావంతో చేస్తేనే ఈ బ్రతుకుకి ప్రయోజనం ఉంది. లేకపోతే లేదు.'

— కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

'నీ కర్తవ్యమును నీవు నిర్వర్తింపుము. వానికి, నీకు యజమాని భగవానుడని గుర్తుంచుకొమ్ము. ఉన్నవ్యాధి మనస్సుతో గాని, పనులతోకాదు. నిస్పృహ చెందక సాధన చేసిన తప్పక భగవత్కృప కలుగును.'

— శ్రీ రమణమహర్షి

'మనశ్శాంతి నీకు కావాలంటే ఇతరులను నిందించకు. నీ తప్పులేమిటో నువ్వు తెలుసుకో. అఖిల ప్రపంచాన్ని నీదిగా చేసుకో. పరాయివారంటూ ఎవ్వరూ లేరు. ఈ లోకంలో ఈ ప్రపంచమంతా నీదే.' — శ్రీ శారదాదేవి

'మనోనిగ్రహమూ, కళంకంలేని మనస్సూ- అవే గొప్ప సంపద. మనస్సుకనక నిర్మలంగా ఉంటే నీ హృదయంలోనే ఆ ఈశ్వరుని దర్శించవచ్చు. వ్యామోహం చంపుకోవాలి. మనోనిగ్రహమనే కవచాన్ని ధరించాలి.'

— శ్రీ శారదాదేవి

'మూర్ఖునికి హృదయం నోటిలో వుంటుంది. తెలివిగలవానికి నోరు హృదయంలో వుంటుంది.'

— శ్రీ ఫ్రాంక్లిన్

'ఆత్మ నిగ్రహం అనేది విజయానికి తొలిమెట్టు లాంటిది.'

— శ్రీ రాబర్ట్‌బర్న్స్

'కవులూ, రచయితలూ బ్రతికి నంతకాలం చచ్చినట్లు పడుండి, చచ్చిం తర్వాత బ్రతకడ మారంభిస్తారు.'

— శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

'కప్పి చెప్పేది కవిత్వం, విప్పిచెప్పేది విమర్శనం.'

— శ్రీ సి. నారాయణరెడ్డి

'ధనము నీకు ఆహారాన్ని యిస్తుందిగాని ఆకలి నివ్వదు; మందుల నిస్తుందిగాని ఆరోగ్యాన్నివ్వదు; పరిచయాల నిస్తుంది గాని స్నేహితుల నివ్వదు; సేవకుల నిస్తుందిగాని విశ్వాసాన్నివ్వదు; సంతోషపు దినాలనిస్తుందిగాని శాంతి నివ్వదు.'

— శ్రీ హెన్రిక్ ఇబ్సన్

'డబ్బు ఎరువు (Manure) లాంటిది. చుట్టూ వెదజల్లితే ఎంతో మేలు కలిగిస్తుంది. ఒకచోట పేరబెట్టి వుంచితే భరించ రాని కంపు గొడుతుంది.'

— శ్రీ క్లింట్ మర్చిసన్

'ధనమునకు ఎవడు దాసుడు కాడో, ధన మెవ్వనికి దాస్యము చేయునో వాడే నిజమైన మానవుడు.'

— శ్రీ రామకృష్ణపరమహంస

'పుస్తకమనేది నోరు తెరవని ఉపన్యాసకుడు, మానం వహించిన మహాకవి, ఒంటరితనాన్ని పోగొట్టే స్నేహితుడు, మరో ప్రపంచానికి గొనిపోయే ఇంద్రజాలికుడు.'

— శ్రీ మన్నవ గిరిధరరావు

'నాకేమైనా కొద్దిగా డబ్బు లభిస్తే ముందుగా పుస్తకాలు కొంటాను. ఆ తర్వాత రొట్టె, బట్టల విషయం ఆలోచిస్తాను."

— శ్రీ ఎమర్సన్

'The end of education is character.' 'వినయ ప్రవర్తనను అలవరచునదే అసలైన, నిజమైన విద్య. సద్గుణములను పోషించుచూ, మానవత్వము నుండి దైవత్వమునకు కొనిపోవునదే నిజమగు విద్య. పశుత్వమునకు దిగదార్చు విద్య అవిద్యయే యగును.'

— శ్రీ సత్యసాయిబాబా

'Everyone wants to command and no one wants to obey; First, learn to obey. The command will come by itself. Always first learn to be a servant and then you will fit to be a master.' 'ప్రతి ఒక్కరూ అధికారాన్ని చలాయించేవారే. అనుసరించేవారే లేరు. మొదట అనుసరించడం నేర్చుకో. అధికారం దానంతట అదే వస్తుంది. శిష్యుడుగా వుండటం నేర్చుకో. గురుత్వం అదే లభిస్తుంది.'

— శ్రీ స్వామివివేకానంద

'When poverty comes in at the door, love ffies out at the window.' 'దారిద్ర్యం ద్వారంగుండా ప్రవేశించినప్పుడు, ప్రేమ కిటికీ గుండా పారిపోతుంది.'

— శ్రీ అబ్రహాం లింకన్

'Not gold, only men can make a people great and stnong.' 'బంగారంకాదు, మనుష్యులు మాత్రమే జాతిని గొప్పదిగాను, శక్తివంతంగాను చేయగలరు.'

— శ్రీ ఎమర్సన్

'Knowlege without action is abortion, Action without knowledge is foolishnes' 'కార్యాన్ని సాధించలేని జ్ఞానము నిష్ప్రయోజనం. జ్ఞానరహితమైన కార్యము (పని) మూర్ఖమైనది.'

— శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

'Start early, drive slowly, reach safely.' 'ముందుగనే బయలుదేరుము. నెమ్మదిగ నీబండిని నడుపుము. క్షేమముగా గమ్యము చేరుము.'

— శ్రీ సత్యసాయిబాబా

'ఆస్తికునిలో దేవుడు ఎంత ఉన్నాడో, నాస్తికునిలో కూడా అంతా వున్నాడు. నాస్తికుడు అంటే మొగ్గ అని అర్థం. ఆస్తికుడు అంటే పువ్వు అని అర్థం. మొగ్గ రేపటికి పువ్వు అవుతుంది. ఈలోపల పురుగు పడకుండా జాగ్రత్తగా చూచుకోవాలి.'

—కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

'తప్పుచేయడం మానవ స్వభావం. తిరిగి ఆ తప్పును చేయకుండా వుండటం దైవస్వభావం. తప్పును క్షమించడం కూడా మానవ స్వభావమే. దుర్బలులు ఎప్పుడూ క్షమించలేరు. క్షమించడం సబలుల లక్షణం.'

— శ్రీ మహాత్మాగాంధీ

'సంతృప్తిలేని జీవితానికి శాంతిలేదు. అసంతృప్తిలేని జీవితానికి వృద్ధిలేదు.'

— శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

'Your replies should be as quick as eagle and as sharp as needle.' 'మీ సమాధానములు గరుత్మంతునివలె వేగముగాను, సూది మొనంత పదునుగాను వుండాలి.'

— శ్రీ డా. పట్టాభిసీతారామయ్య

'చేతనైన అన్ని మార్గాలలోను, వీలైన ప్రతిచోట, అనువైన అన్ని వేళల అందరికీ చేయగలిగినన్నాళ్లు మంచి చేయడానికి ప్రయత్నించాలి.'

— శ్రీ జాన్ వెస్లీ

'వ్యక్తుల ఆత్మబలానికి పరీక్షా సమయమిది. నేటి గడ్డు పరిస్థితులలో నిలద్రొక్కుకుని దేశభక్తిని ప్రజ్వలింపచేసినవాడే రేపు జాతి చేత ప్రేమించబడేది.'

— శ్రీ థామస్ పైన్

'ప్రజాస్వామ్యంలో ప్రజలు గొర్రెలమంద కాదు. ప్రజాస్వామ్యంలో వాక్స్వాతంత్ర్యాన్ని, ఆలోచనా స్వాతంత్ర్యాన్ని, క్రియా స్వాతంత్ర్యాన్ని అత్యంత భద్రంగా కాపాడుకుంటారు.'

— శ్రీ మహాత్మాగాంధీ

'ప్రజంతా జన్మతః సమానులే. స్వేచ్ఛగా జీవించడానికి, సుఖశాంతులకై ప్రయత్నించుకోవడానికి వారికి హక్కు వుంది.'

— శ్రీ జెఫర్‌సన్

'స్వేచ్ఛ అనే వృక్షం ఎప్పటికప్పుడు దేశభక్తుల రక్త తర్పణతో మాత్రమే వికసింపగల్గుతుంది.'

— శ్రీ థామస్ జఫర్‌సన్

'గొప్ప ప్రభుత్వం అంటే ఏది? ప్రజలు మంచిపనులు చేయడానికి సులభంగాను, చెడుపనులు చేయడానికి క్లిష్టంగాను ఉండాలి.'

— శ్రీ గ్లాడ్‌స్టన్

'విద్య నేర్పుటకు జీవిత మర్పించువాడు చనిపోడు.'

— శ్రీ మహమ్మద్ ప్రవక్త

'సర్వభూతముల యందు దయగలవాడు దేవుని కృపకు పాత్రుడు.'

— శ్రీ యేసుక్రీస్తు

'చట్టం అసత్యంపై నిలిస్తే దానిని ఎదురించుటయే కర్తవ్యం. అణచివేతను అనుమతించటమంటే నేరంలో భాగంపంచుకోవటమే.'

— శ్రీ మహాత్మాగాంధీ

'స్వాతంత్ర్యపు చెట్టుకు స్వాతంత్ర్యయోధుల రక్తధారలే సహజమైన ఎరువు.'

— శ్రీ జఫర్‌సన్

'ప్రజాస్వామ్యంలో ప్రజలు కోరేది స్వాతంత్ర్యంలేని క్రమశిక్షణ కాదు. వారికి స్వాతంత్ర్యం కావాలి, క్రమశిక్షణ కావాలి.'

— శ్రీ ఆచార్య కృపాలని

'Rule of Law is the badge of free people.' 'ధర్మశాసనం స్వేచ్ఛాప్రజల చిహ్నం.'

— శ్రీ టి. విశ్వనాథయ్యర్

'రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యా, నైతిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక రంగాలలో విప్లవాత్మకమైన మార్పును సాధించడమే నా సంపూర్ణ విప్లవ లక్ష్యం.'

— శ్రీ జయప్రకాశ్‌నారాయణ

'లలితకళలయందు ఏవిధమైన ప్రవేశంగాని, కనీసం ఆసక్తి గాని లేనివాళ్లు మనుష్యులైనా తోకలు, కొమ్ములులేని జంతువులే.'

— శ్రీ అరవిందుడు

'జంతువులాగె ప్రవర్తించే మనిషి జంతువుకన్నా హీనమైన వాడు. మృగలక్షణం జంతువుల సహజగుణం, మనిషికి కాదు.'

— శ్రీ మహాత్మాగాంధీ

'Liberty postulates dignity of man.' 'స్వేచ్ఛ అనునది మనుష్యుని గౌరవమునకు మూలము.'

— శ్రీ జాన్సుటువార్టు

'Education is a companion which no misfortune can depress; no crime destroy; no enemy alienate; no despotism enslave.' 'విద్య అనునది ఒక మంచి చెలికాడు. అతనిని ఎట్టి దురదృష్టము అణచ జాలదు. ఎట్టి నేరము నాశనము చేయజాలదు. ఏ శత్రువు దూరము చేయజాలడు. ఏ నిరంకుశత్వము బానిసగా మార్చజాలదు.'

— శ్రీ వర్లే

'Civil liberty is the key-stone of the constitution.' 'పౌరస్వేచ్ఛ రాజ్యాంగానికి మూలస్తంభం లాంటిది.'

— శ్రీ పాల్‌ఖివాలా

'It is better to be unborn than untaught, for ignorance is the root of misfortune.' 'చదువుకోనక పోవడంకంటే అసలు జన్మించక పోవడమే మంచిది. ఎందుకంటే దురదృష్టానికి మూల హేతువు అజ్ఞానం.'

— శ్రీ ప్లేటో

'సత్పురుషులు ప్రేమించేది స్వాతంత్ర్యాన్ని, మిగిలినవారు కోరుకొనేది విశృంఖలత్వాన్ని.'

— శ్రీ జాన్ మిల్టన్

'ఎక్కువమంది చేతులెత్తిన మాత్రాన అది న్యాయం కాజాలదు.'

— శ్రీ మహాత్మాగాంధీ

'మనుష్యుడు తోబుట్టువు లేకుండ జీవింపగలడు కాని తన మంచిని, చెడును విచారించుకొనుటకు ఒక స్నేహితుడైనను లేకుండ జీవింపలేడు.'

— శ్రీ జెర్మేద్ సామేల్

'నిజమైన స్నేహితునితో మనస్సు విప్పి మంచిని, చెడును మాట్లాడుకోవచ్చును.'

— శ్రీ ఎమర్సన్

'ధైర్యము, ప్రేమ - ఇవి రెండు తప్పనిసరిగ మనుజునకు ఉండవలసిన ముఖ్య లక్షణములు.'

— శ్రీ అరవింద యోగి

'ప్రేమ కళ్లతో చూడదు, మనస్సుతో చూస్తుంది. అందుకే ప్రేమదేవత గ్రుడ్డిదని వర్ణించారు.'

— శ్రీ షేక్స్పియర్

'The foundation of every state is the education of its youth.' 'యువకుల విద్యా వివేక సంపత్తియే దేశభవిష్యత్తుకు పునాది.'

— శ్రీ ఎలిజాకూల్

'If we ignore facts, they will take vengence with redoubled vigour.' 'వాస్తవ నిర్లక్ష్య చర్యలు ద్విగుణీకృతశక్తితో ప్రతిఘటించబడును.

— శ్రీ సర్దార్ పటేల్

'Democracy without education means hypocracy without limitation.' 'విజ్ఞతలేని ప్రజాస్వామ్యం అంతులేని వంచన.'

— శ్రీ అబ్రహాం లింకన్

'Purity, patience, perseverance are the essentials to success, and above all—Love.' 'పవిత్రత, ఓర్పు, పట్టుదలలు విజయలక్ష్మిని చేబట్టడానికి తోడ్పడుతాయి. ప్రేమ అన్నిటికన్నా మిన్న అయినది.

— శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వామి

'Fame is the perfume of heroic deeds.' 'వీరోచిత కార్య సౌరభమే కీర్తి.'

— శ్రీ సోక్రటీస్

'Industry keeps the body healthy, the mind clean, the heart whole and the purse full.' 'పరిశ్రమ శారీరక ఆరోగ్యము, చిత్తశుద్ధి, నిండు హృదయము నిచ్చి భుక్తి నొసగును.'

— శ్రీ సైమన్స్

'భగవంతుడు కష్టపడేవాడికే ఆశీస్సులు ఇస్తాడు. మనం ప్రార్థనచేసినంత మాత్రంచేత ఆశీస్సు లివ్వడు.'

— శ్రీ కాళిదాసకవి

'ఈనాడు కవులపై శ్రద్ధ అధికమై, కావ్యాలపై శ్రద్ధ దిగజారుచున్నది. ఇది సాహిత్యలోకానికి ఆరోగ్యకరమైన పరిస్థితి కాదు. ఈ దురవస్థ తొలగిపోవాలి. వ్యక్తిగతమైన ప్రశంసలు తగ్గి కావ్యగతమైన ప్రశంసలు పెంపొందాలి.'

— శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ

'మహనీయుల జీవితచరిత్రలు సామాన్యులకు మార్గదర్శిక ములు. పూర్వులను దూషించకుండ వారు పెట్టిన గోడలపై భవనమును నిర్మించి, భాషాభిమానముతో బాటుగ భాషాభి వృద్ధియు చేయుచు ఉచ్చస్థితిలోనికి బోవుట జాతియొక్క కర్తవ్యము.'

— శ్రీ పిల్లలమర్రి

'సాహిత్యం జాతియొక్క సంస్కృతిని ప్రతిబింబించాలి.'

— 'కవిసామ్రాట్' శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

'గొప్పవాళ్లు కావాలలి అనుకోవడం మంచిదే. కాని గొప్ప వాళ్ల మయామనుకోవడం పొరపాటు. రచయిత ఒకరికి బానిస కారాదు. రచయితలు ప్రపంచ శాసనకర్తలు (Legislators of the World) అనే మాట గుర్తుంచుకోండి. అందుకు తగినట్లుగా వ్యవహరించగలగాలి.'

— శ్రీ నోరి నరసింహశాస్త్రి

'వాదములూ, తర్కములూ ఎప్పుడూ నిష్ఫలములే. వాదాలతో భేదాలు పోగొట్ట ప్రయత్నించడంవల్ల అసంతృప్తీ, విరోధమూ పెరుగుతాయి. మొదట హృదయాన్ని జయించు. తరువాత హేతువుతో మనస్సును ఒప్పించు. వాదం విఫలమైన చోట ప్రేమ విజయం పొందగలదు.'

— శ్రీ స్వామి రామతీర్థ

'సంసారకూపమునుండి గట్టున బడుట అనగా ముక్తిని పొందుట. గురుకృపతోనే సిద్ధిస్తుంది. అట్టి అవతారమూర్తియైన సద్గురువు లభించడం పరమాత్ముని కరుణ కలిగినప్పుడేనని మరువరాదు.'

— శ్రీ కబీరు

'చదువునుబట్టి ఉద్యోగముగాని చదువుకున్నను వంశాను క్రమముగా ఉద్యోగ మేప్రభుత్వము కూడ యివ్వదు. అట్లే బ్రహ్మమును తెలుసుకున్నవానికే బ్రాహ్మణత్వము సిద్ధిస్తుందిగాని వంశాచారమునుబట్టి బ్రాహ్మణత్వము వచ్చుననుకొనుట భ్రాంతి మాత్రమేనని తెలియవలయును.

— శ్రీ మళయాళస్వామి

'ఈశ్వరేచ్ఛను అనుసరించుటలో సింహసదృశ ధైర్యాన్ని, పక్షిరాజు వేగాన్ని, పెద్దపులి బలాన్ని సంపాదించు.'

— యూదుల మతసిద్ధాంతము

'ఇదంతయు పరమాత్మ స్వరూప మను బుద్ధితో జేసిన ప్రపంచ సేవయే. పంచభూతములను, జీవుని, సూర్యచంద్రులను, పరమశివులను పూజించినట్లవుతుంది. సర్వజగత్తును ఈశ్వర స్వరూపముగా గ్రహించి చేయు సేవయే ఉత్తమోత్త మగు పూర్ణపూజ.'

— శ్రీ రమణమహర్షి

'భగవంతుని నెల్లతావుల, నెల్ల వస్తువులలో జూచుటయే నిజమగు జ్ఞానమార్గము. అన్నిటియందు భగవంతుడున్నాడని ప్రేమించుటయే నిజమైన భక్తిమార్గము. అదే బుద్ధితో నిష్కామ ముగ సేవచేయుటయే నిజమైన కర్మమార్గము.'

— శ్రీ అనిబిసెంట్

"ఈ కలియుగమున భగవద్భక్తి రహితమైన కర్మము నిలువజాలదు. అట్టిది ఇసుకతో వేసిన పునాది వంటిది. కావున ముందు దైవభక్తిని సాధన చేయుము. అది కుదిరెనా పిమ్మట నీవు విద్యాశాలలు, వైద్యశాలలు మున్నగునవి ఏవి కట్టించినను అవి సార్థకము లగును. ముందు భక్తి, తరువాతే కర్మము. భక్తి శూన్యమగు కర్మ కేవలము నిస్సహాయము. అది తన కాళ్ళపై తాను నిలబడజాలదు.'

— శ్రీ రామకృష్ణపరమహంస

'వినయవంతుడగు వానికే జ్ఞాన లాభము కలుగును. మిట్టి పడువాని హృదయమునుండి జ్ఞానము పారిపోవును.'

— శ్రీ రామకృష్ణ పరమహంస

'వినాశకాలం వచ్చినవానికి మతి చలిస్తుంది, అతడి కళ్లకు మంచిదంతా చెడ్డగానూ, చెడ్డదంతా మంచిగానూ కనుపిస్తుంది.'

— రాజాజీ భారతం నుండి

'జీవితంలో తనకాళ్లమీద తను నిలబడే శక్తి నిచ్చేది నిజమైన విద్య. ధైర్యం, బలం, క్రమశిక్షణ నేర్పేది విద్య. అన్యాయాన్ని, అధర్మాన్ని భయంలేకుండా ఎదుర్కొనే శక్తి నిచ్చే టానిక్కు లాంటిది.'

— శ్రీ ఐ. వేదవ్యాస, I. A. S.

"An optimist sees an opportunity in every difficulty; a pessimist sees a difficulty in every opportunity."
ఆశావాది ప్రతికష్టంలోనూ ఒక అవకాశాన్ని చూస్తాడు; నిరాశావాది ప్రతి అవకాశంలోనూ ఒక కష్టాన్ని చూస్తాడు.'

— శ్రీ యానన్

'మహాత్ముల జీవితములు గుమ్మడిపాదు వంటివి. ఆ పాదు పుట్టిన స్థలము నుండి చాలాదూరము ప్రాకిపోయి అచ్చట కాయలు కాయును. మహనీయులు కూడ పుట్టిన కుటుంబము వారి కన్న యితరులకే యెక్కువ లాభముగలవా రగుదురు.'

— శ్రీ మహర్షి మలయాళస్వామి

'చేతినిండా పని, మనస్సునిండా సత్సంకల్పం—ఈ రెండూ వుండాలి. లేకపోతే మనస్సు కుక్కతోకలా ప్రవర్తిస్తుంది.'

— కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

'ఏ విషయమైనా నీకు జ్ఞానం కావాలో, దానిమీద నీ బుద్ధిని నిలపాలి. ఇటూ, అటూ కదలనియ్య కూడదు. దీనినే ఏకాగ్రత అంటారు. ఏకాగ్రత అనేది నీ కలవడకపోతే, నీ కెట్టి జ్ఞానమూ కలగదు. ఏ విద్యా అబ్బదు. నీ వే పని కుశలంగా చేయలేవు. కాబట్టి ముందు ఏకాగ్రత కుదుర్చుకో. లేకపోతే వట్టి నిరర్థకుడ వవుతావు.'

—శ్రీ ముట్నూరి కృష్ణారావు

'మనశ్శాంతి కనుక నీకు కావాలంటే, ఇతరుల్ని నిందించకు. నీ తప్పులేమిటో నువ్వు తెలుసుకో. అఖిల ప్రపంచాన్ని నీదిగా చేసుకో. పరాయివారంటూ ఎవ్వరూ లేరు. ఈ ప్రపంచమంతా నీదే.'

—శ్రీ శారదాదేవి

'ఆలోచనలే క్రియాశక్తికి మూలం. మనస్సును ఉన్నత భావాలతో నింపండి. ప్రతినిత్యము ఉత్తమ భావాలు వినండి. నెలల తరబడిగా వాటినే మననం చేయండి. అపజయాలను లెఖ చేయ కండి. అవి సహజములే. జీవితానికి అవి అందాన్ని చేకూరుస్తాయి. ఆదర్శాన్ని నిరంతరం ఉన్నతంగా ఉంచుకోండి. వేయిమారు లోడినా తిరిగి ప్రయత్నించండి.'

—శ్రీ స్వామీ వివేకానంద

'ఉత్తమ స్త్రీ పురుషులు లేని దేశమును శ్రేయోరాజ్య మనలేము. చిత్తశుద్ధియు, శీలసంపత్తియు లేని సమాజమున ఉత్తమ స్త్రీ పురుషు లుండజాలరు. నైతికములగు పునాదులు లేనిదే శీలము వర్ధిల్ల జాలదు. ఆధ్యాత్మిక చైతన్యము లేనిదే నీతి దీపింప జాలదు. కాబట్టి జాతి యొక్క సర్వతోముఖ వికాసమునకు, మానవ కళ్యాణమునకు, విశ్వశాంతికి— మతము, ఆధ్యాత్మికశక్తి జీవనాడులు.'

—శ్రీ కల్లూరి చంద్రమౌళి

'ఇది సంఘటన యుగం. ఈ యుగంలో విజయం సంఘటన మీద ఆధారపడి వుంటుంది. పూర్వం వ్యక్తిగతమైన గొప్పతనం వుంటే సరిపోయేది. నేడు అది చాలదు. నేడు కలిసి నడచి, నడిపించాల్సిన అవసరం ఉన్నది.'

— శ్రీ చిన్మయానందస్వామి

'విశ్వమును సంరక్షించి సుస్థిరమగు శాంతిని స్థాపింపగల శక్తి ఆధ్యాత్మిక తేజస్సునకు మాత్రమే గలదు. ఇది మానవులను సంకుచిత జాతీయతకు, తృష్ణావేశములకు అతీతులను గావింపగల అమృతభాండము. పరస్పర సహనమును, న్యాయమును, ధర్మమును నెలకొల్పి శాంతికి చైతన్యముగ వెలుగొందు శక్తి ఆధ్యాత్మిక తేజస్సే. ఇది భగవత్సామ్రాజ్యమును భక్తితో నారాధింప జేయును.'

— ఆర్చిబిషప్ ఆఫ్ కాంటర్‌బరీ, హెడ్వార్

'ఇతరుల నుంచి మనం ఎన్నో పాఠాలు నేర్చుకోవచ్చు. మంచి ఎక్కడ వున్నా గ్రహించు. కాని దానిని గ్రహించి నీ పద్ధతి కనుగుణంగా జీర్ణించుకో. నీవు మాత్రం అన్యుడివి కావద్దు. నీవు హిందూదేశానికి దూరం కారాదు.

— శ్రీ స్వామి వివేకానంద

'ఉన్నతస్థాయిలో వున్నవారు నీతివంతులై వుంటే, నైతికత సమాజంలో అట్టడుగునవున్నవారికి ప్రవహిస్తుంది; ఫలితంగా అందరికి సౌశీల్యం ఏర్పడుతుంది. శీలాన్ని క్రిందనుంచి పైకి నిర్మించలేము; శీలాన్ని ఎప్పుడూ పైనుండి నిర్మించుకు రావాలి.'

— శ్రీ గురూజీ

# భారతీయ సంస్కృతి

తాయిలాండ్ భాషలో నూటికి ముప్పది సంస్కృత పదాలు కలవు. 'అయోధ్య, విష్ణులోక, రాజపురి, స్వర్గపురి' అను పేర్లు గల నగరాలు కూడా తాయిలాండ్‌లో వున్నాయి. అచటి దేవాలయ గోపురములపై గరుడవాహన మెక్కిన విష్ణుమూర్తి బొమ్మలు కలవు. అచటి మూడు విశ్వవిద్యాలయములలో సంస్కృతం బోధించబడుతున్నది.

ఇండోనేషియాలో ఈనాటికీ మన సంస్కృతీ ప్రభావం కనబడుతుంది. ఆ దేశంలో అచ్చు పుస్తకములలో ప్రారంభమున 'అవిఘ్నమస్తు' అని వుంటుంది. అక్కడి ప్రభుత్వ బ్యాంకు పేరు "బ్యాంక్ కుబేరా." కుబేరుడు మనకు ధనాధిపతి. అక్కడి ఎయిర్‌లైన్స్ పేరు 'గరుడా ఎయిర్ లైన్సు', మన పురాణములలో గరుత్మంతుడు 'విష్ణుమూర్తి వాహనమని, పక్షిరాజు' అని ప్రతీతి.

తాయిలాండ్‌లో నేటికిని బ్రాహ్మణ పురోహితులు అక్కడి రాజునకు పట్టాభిషేకం చేయడం ఆనవాయితి, ఇటీవలనే అజర్‌బైజాన్‌లో బాక్‌పట్టణమువద్ద ఒక హిందూదేవాలయం బయటపడింది. బలి ద్వీపంలో నేటికిని దేవాలయాలలో హిందూమతాచారము ప్రకారమే పూజలు జరుగుతూంటాయి. సుమిత్రా ద్వీపంలో బొమ్మలాటలలోను, కథాకాలక్షేపాలలోను హిందూపురాణ విషయములే ప్రముఖ స్థానాన్ని అలంకరించుతుంటాయి. జపాన్‌లోని బౌద్ధదేవాలయాలలో బుద్ధుని విగ్రహం ప్రక్కన శివుని విగ్రహము కూడా వుంచుదురు.

# భారతీయ పురాణం

ఇండోనేషియాలో భారతీయ పురాణాలు ప్రభావం హెచ్చుగా వున్నది. ఒక పర్యాయం ఈమధ్య భారతీయ చరిత్రకారుడు డా. రఘువీర ఇండోనేషియన్ ప్రెసిడెంట్‌ను కలుసుకొనినప్పుడు 'నా పేరునకు అర్థమేమి'టని సొకర్నో అడిగెను. "ఇది ఆదిలో 'సుకర్ణ' అయి వుండును. బుద్ధుని విగ్రహమునకు చెవులు పెద్దవిగా వేయుదురు. కావున ఇది బుద్ధుని పేరై యుండవచ్చును" అని డా. రఘువీర బదులు చెప్పెను.

సొకర్నో నవ్వి 'అట్లు కాదు. నేను పుట్టినప్పటికి నా తండ్రి ప్రతి దినము మహాభారతము చదువుతుండేవాడట. భారతవీరుని పేరు నాకేదైనా పెట్టవలెనని ఆయన ఆలోచన. భారతంలో ఆయనకు కర్ణుడు బాగా నచ్చినాడుట. కాని భారతంలోని కర్ణుడు దుష్టచతుష్టయము లోనివాడు. నా కుమారుడు దుష్టకర్ణుడు కాక సుకర్ణుడుగా వుండవలెనని తలంచి నా తండ్రి నాకు సుకర్ణుడని పేరు పెట్టినాడుట' అని చెప్పెను.

# నిత్యసత్యాలు

'జీవితంలో తన కాళ్లమీద నిలబడే శక్తి నిచ్చేది నిజమైన విద్య. ధైర్యం, బలం, క్రమశిక్షణ నేర్పేది విద్య. అన్యాయాన్ని, అధర్మాన్ని భయం లేకుండా ఎదుర్కొనే శక్తి నిచ్చేది నిజమైన విద్య. విద్యాలయాలంటే మానసిక దాస్యం, ఉద్యోగంలో దాస్యం నేర్పే జైళ్లు కావు.'

'మితభాష అతి హాయి; అతిభాష మతిహాని.'

'ఆత్మప్రశంసకన్నమిన్నయైన ఆత్మహత్యలేదు. స్వకార్యములు ఘనకార్యములుగా స్వముఖతః కీర్తించుకునేవాడు ఆత్మహంతకులలో అగ్రస్థానం అలంకరిస్తాడు.'

'స్వార్థమును దరికి చేరనీయరాదు. స్వాభిమానం అలవరచుకోనాలి.'

'సరియైన అనుభవంలోనికి రాని విద్య, విజ్ఞానం ఎంతవున్నా ప్రయోజనం శూన్యం.'

'భోగము కంటే త్యాగమే ఎక్కువ మధురమైనది.'

'ఇతరుల దోషాలను విస్మరించి క్షమించడం చేతకాకపోతే మనదోషాలు కొండంతలుగా పెరిగిపోయే ప్రమాదం వున్నది.'

'బానిసకు బాధ లెక్కువ, స్వతంత్రుడికి బాధ్యత లెక్కువ.'

'యాచించడం నేర్ప కూడదు; జీవించడం నేర్పాలి. పరులపై ఆధారపడటం నేర్పకూడదు; తనకాళ్లపై నిలబడటం నేర్పాలి.'

'నిరాడంబరమే మానవునికి వెలలేని ఆభరణము.'

'కోపంవల్ల బుద్ధి మందగిస్తుంది. కోపానికి వశులమైపోతే యథార్థాన్ని చూడగల శక్తిని కోల్పోతాం. దానివల్ల వినాశనం పొందుతాం.'

'దయగల హృదయమే దైవమందిరం.'

'అన్యాయం, అక్రమం జరుగుతూంటే చూస్తూ ఊరుకోవడం ప్రాజ్ఞుల లక్షణంకాదు. ఉదాసీనంగా ఉండటం కూడా అక్రమాన్ని ప్రోత్సహించడమే అవుతుంది. మనకళ్లముందు అన్యాయం జరుగుతూంటే మనకెందుకులే యని ఊరుకోరాదు. అన్యాయాన్ని, అధర్మాన్ని ధైర్యంగా ఎదుర్కొనడం కూడా ఒక సాహసమే. చేతులు ముడుచుకొని కూర్చోవడం బలహీనతకు చిహ్నాం. ఉదాసీన వైఖరి లోకం దృష్టిలో అసమర్థత అవుతుంది. శత్రువుల దృష్టిలో అసమర్థులుగా వుండటం కంటే మరణం మేలు.'

'భక్తియే నిజమైన శక్తి. భక్తిలేని శక్తి నిరర్థకం. ఆత్మ శక్తియే అన్నిటికీ మించిన శక్తి.'

'మాట్లాడేటప్పుడు అర్థంకాని పెద్ద పెద్ద పదాలను, సమాసాలను వాడకండి. సరళమైన, స్వచ్ఛమైన భాషను వాడండి. మీకు తెలియని విషయాలను గురించి మాట్లాడకండి. మీ ఆంతరంగిక విషయాలను గురించి పదిమంది ముందు మాట్లాడకండి. ఎదుటివారు మిమ్ములను చులకనగా చూడవచ్చు.'

'మనస్సు నిశ్చలంగా వుంటే ఎలాంటి సంకట పరిస్థితిలో నయినా ధైర్యం కల్గుతుంది. ధైర్యశాలురు మాత్రమే లోకంలో కార్యసిద్ధిని పొందుతారు. ధైర్యం విడచినవారు ఏ ప్రయత్నమూ చేయలేరు. అధైర్యం అనేక అనర్థాలకు దారితీస్తుంది. ధైర్యవంతుడు ఒక్కపర్యాయం మాత్రమే మరణించును. భీరువు జీవితమునం దడుగడుగునా మరణించుచునే యుండును. ధైర్యమే ప్రయత్నానికైనా మూలం. అధైర్యం అన్నిప్రయత్నాలకు అవరోధం.'

"An idleman's brain is the workshop of the devil."
'సోమరి మనుజుని చిత్తము దయ్యము యొక్క కర్మాగారము.'

'కొంగ తన ముక్కుతో తన కడుపు మాత్రమే నింపుకొన్నట్లు మనుష్యుడు జీవించరాదు. తనవలన అనేకులు బ్రతుకుచున్న మనిషి జీవనమే జీవనము.'

'నవ్వుతూ నవ్వుతూ పనిచేయగలవాడు గొప్పవాడు. నవ్వుతూ కష్టాల నెదుర్కొ-గలవాడు మరింత గొప్పవాడు.'

'ఆశావాది ప్రతి కష్టంలోను ఒక అవకాశాన్ని చూస్తాడు. నిరాశావాది ప్రతి అవకాశంలోను ఒక కష్టాన్ని చూస్తాడు. ఆశావాది చూసేది ముళ్లను కాదు, గులాబీని. నిరాశావాది చూసేది ముళ్లనే, గులాబీని కాదు.'

'ఆత్మవిశ్వాసంతో ముందుకు నడవాలి. ఆత్మగౌరవాన్ని కాపాడుకోవాలి. స్వధర్మాన్ని విడనాడరాదు. పరధర్మాన్ని పట్టుకొని వ్రేలాడరాదు. స్వశక్తిమీద జీవించడం నేర్చుకోవాలి. పరులమీద ఆధారపడి జీవించడంకన్నా మించిన పాపం వేరొకటి లేదు.'

"Look up, aim high." 'పైకిచూడుము, పైకిగురిపెట్టుము. ఊర్ధ్వదృష్టి, ఊర్ధ్వలక్ష్యము కలిగియుండవలెను. అల్పపదవులకై దేవులాడరాదు.'

'ఆశయాలు, ఆదర్శాలు, త్యాగాలు ఎంత ఉన్నంతగా ఉన్నప్పటికి, మహానుభావుల జీవితాలు అంత సామాన్యంగా వుంటాయి.'

'పుణ్యము చేయుచున్నానను అహంకారమునకు మించిన పాపము మరొకటి లేదు.'

'మిత్రుడివల్ల ఏదైనా పొరపాటు జరుగుతే దానిని గురించి నిరొత్సాహమాటంగా మాట్లాడాలి. కాని అలా మాట్లాడేటప్పుడు

అతని అంతర్యాన్ని నొప్పించడానికి మాత్రం ప్రయత్నించ కూడదు.'

'దీర్ఘాలోచన లేకుండా చేసే పనులు అనేక అనర్థాలకు దారితీస్తాయి. తొందరపాటుతనంవల్ల కాబోయే కార్యం కూడా కాకుండా చెడిపోతుంది.'

'పొంగి, క్రుంగని తత్త్వాన్ని అభివృద్ధిపరచుకుంటే, లొంగి, వంగని జీవితం గడుపవచ్చు.'

'మైత్రికి నిజమైన పరీక్షాస్థానం కష్టకాలము. అభివృద్ధిలో నున్నప్పుడు అందరును స్వప్రయోజనమును కాంక్షించి మిత్రభావమునే చూపుదురు. కష్టకాలము దాపురించినప్పుడు మాత్రం నిజమైన మిత్రుడు తప్ప అందరూ దూర మగుదురు, కష్టకాలంలో కూడా ఛాయవలె ఎవరు విడవకుండా వుందురో వారే నిజమైన మిత్రులు. అభివృద్ధిలో నున్నప్పుడు అందరూ మిత్రులే.'

'నీలో పొరపాటున్నదని ఎవరైనా అంటే, అదేమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించాలే తప్ప బుకాయించడానికి ప్రయత్నించకూడదు.'

'నీవు అన్యాయం చూసినపుడు నీ కళ్లు ఎర్రబడాలి. పేదరికం, ఆర్థిక వ్యత్యాసాలు చూసినపుడు కన్నీరు రాల్చగల్గాలి.'

'If you cannot get the work you love, love the work you get.' 'నీవు ప్రేమించేపని నీకు లభ్యంకాకపోతే, నీకు లభ్యమైన పనిని ప్రేమించు.'

'ఇష్టంకాని పనులను ఇష్టమైనవిగా చేసుకోవడం వివేకవంతుని లక్షణం.'

'దృఢమనస్కుడైన వాడికి అంధకారంలోనే కాంతిరేఖ కనిపిస్తుంది; బలహీన మనస్కుడైన వాడికి పట్టపగలే చిమ్మచీకటిగా కనిపిస్తుంది.'

'కోపంగా ఒకరు ప్రశ్నించేటప్పుడు శాంతంగా సమాధానం చెప్పినా, వారి కోపం ఎక్కువవుతుంది. కోపంగా సమాధానమిస్తే, వారి కోపం మరింత ఎక్కువవుతుంది. కాబట్టి నోరు మెదపకుండా ఊరుకోవడం వివేకవంతుని లక్షణం.'

'జీవితమంటే వెలుగు నీడల కలియక. ఎండలో నుండి వస్తేనే నీడ సుఖం తెలిసేది. జీవితంలో సుఖ దుఃఖాలు రెండూ వుంటేనే ఎక్సైట్‌మెంట్.'

'కష్టాలవల్లా, దుఃఖాలవల్లా మనస్సు వికలమైపోయి విచక్షణా జ్ఞానాన్ని పోగొట్టుకోనకుండా నిశ్చలంగా నిలబడేవారే గొప్పవారు.'

'ధర్మమే మానవునికి రక్ష. అలక్ష్యం చేసినట్లయితే ధర్మమే మానవుణ్ణి ధ్వంసం చేస్తుంది.'

'ఎంతటి విజ్ఞానవంతులయినప్పటికి—వారికి నిగ్రహం, అణుకువ, వినయం, జాగరూకత లేకపోతే నాశన మవుతారు.'

'ఓర్పు వహించినవారికి జయం లభించి తీరుతుంది. ధన మదోన్మాదంతో కన్ను కాననివాళ్ళు నశించి తీరుతారు.'

'పగ, కచ్చ అనేవి మరింత హానినీ, కీడునూ కలుగజేస్తాయి. వాటివల్ల సాధించేది యేదీ వుండదు. క్షమాగుణం వల్ల మీరు వ్యక్తిత్వంలో మరో మెట్టు పైకెదుగుతారు.'

'కోపం ఎంత చిన్నదయినా హృదయాన్ని దహించి వేస్తుంది.'

'వేదనలో నలిగినప్పుడే, అవమానాగ్నిలో క్రాగినప్పుడే మానవ హృదయంలోని అసలైన లోతులు బైటపడుతాయి.'

'సుఖ దుఃఖములలో సమత్వ ముండవలెను. జయాప జయములలో సమత్వ ముండవలెను. అట్టివారే మోక్షమున కర్హులు.'

'Aim at a lion and miss it rather than hunt a Jackal and catch it,' 'గురితప్పినను సింహామునే కొట్టుము కాని, నక్కను వేటాడి పట్టుకొన వలదు.'

'చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ప్రయోజనం ఎంతో, కాలం మించిపోయిన తరువాత విచారిస్తే ప్రయోజనం అంతే (శూన్యం).'

'సత్యా ధర్మాలను విడనాడకుండా ఓరిమితో వుండాలి. క్షమాశీలుడు లోకాన్ని జయిస్తాడు. వివేకశీలుడు సర్వాన్ని జయించ గలుగుతాడు.'

'దూరదేశ వ్యాపారానికి ఓడలు ఎంత అవసరమో, సత్య లోక ప్రాప్తికి ధర్మాచరణ అంత అవసరము.'

'అన్ని దోషాలకూ చాలావరకు కామం, లోభం, క్రోధం, అనునవే కారణాలు. వీటిని హృదయ మనే కోటలోనికి చొరబడ నీయక మనస్సును కాపాడుకో గల్గినప్పుడే అందరిచేత మన్ననలను పొందగల్గుతాం.'

'ఈర్ష్య, అసూయ అనేవి ఏ ప్రయోజనమూ లేని పాపాలు. వేరుపురుగు లాంటివి. వాటివల్ల ఎటువంటి వారికైనా పరాభవం తప్పదు. ఆ దుర్గుణాలను దరికి చేరనీయరాదు.'

'చేయవలసిన పని సక్రమంగా, సకాలంలో చేయకపోతే ఫలితం ఆశించిన విధంగా వుండదు.'

'సుఖమును, దుఃఖమును ఒక నాణెపు ఇరువైపుల వంటివి. సుఖమును అపేక్షించువాడు దుఃఖమును కూడా భరించవలసినదే.'

'The greatness of a man lies not in doing great things in a great way, but in doing small things in a great way.' 'మనుజునియొక్క గొప్పతనము పెద్ద పెద్ద కార్యములను ఆర్భాటముగ చేయుటలో లేదు. చిన్నచిన్న కార్యములను గొప్ప మనస్సుతో చేయుటలోనే కలదు.'

'మనుష్యుడు దేవుడూ కాగలడు, రాక్షసుడూ కాగలడు. రెండు శక్తులూ మనలోనే వున్నాయి. పరులకు ఉపకారం చేసే వాడు దేవు డవుతాడు. అపకారం చేసేవాడు రాక్షసు డవుతాడు. తనబలాన్ని, సాహసాన్ని పరులను అన్యాయంనుండి రక్షించడానికి ఉపయోగించాలి. తన శక్తిని, యుక్తిని మానవకళ్యాణానికి వినియోగించాలి గాని విధ్వంసక చర్యలకుకాదు.'

'సాధనను అంత్యకాలము వరకు అవిరామముగా చేయ వలెను. ఆలోచించి నిశ్చయించుకొని త్రొక్కిన మార్గములోనే ఆగకుండా ముందుకు సాగిపోవలెను. ఫలము సిద్ధించేంతవరకు సాధనను సాగించుచునే వుండవలెను.'

'సందర్భోచితమైన ధైర్యం, సమయస్ఫూర్తి, వివేకంతో కూడిన ఆలోచన, ఊహాశక్తి, సాటిలేని సామర్థ్యం, కార్యశూరత, చాకచక్యం గలవారు ఏ రంగంలో నయినా సరే విజయాన్ని సాధించగల్గుతారు.'

'అహంభావం తల కెక్కినవాడు అహంకారంతో తనకే అన్నివిషయాలు తెలుసునని విర్రవీగుతాడు. అహంకార, అహం భావాలు మానవుని పతనం చేస్తాయి.'

'నిరంతరమూ పోరాటం సల్పవలెను. ఈ పోరాటంలో అన్ని వేళలా జయమే కలుగుతుందని చెప్పలేము. అపజయము కల్గినప్పుడు నిరాశ చెందరాదు. జయము కల్గినప్పుడు అహంభావంతో నాప్రతిభేనని విర్రవీగరాదు. జయాపజయములను సమభావంతో చూడగల్గు వారే మహానుభావులు.'

'ప్రాణానికి తెగించి పోరాడే వారితో తెగింపులేక పోరాడే వాళ్లు ఎందరైనా సమానం కాజాలరు. స్వచ్ఛందసేవకులు (Volunteers) తో కూడిన సైన్యానికి, వృత్తిగా ఏర్పడ్డ సైన్యానికి మధ్య పోరాటం జరిగితే సాధారణంగా వాలంటీర్ల సైన్యమే గెలుస్తూ వచ్చినట్లుగా చరిత్రలు నిరూపించాయి.'

'హీన స్థితిలో నున్న మానవుడికి అన్నీ దుర్బుద్ధులే పుట్టుతూ వుంటాయి. అట్టి స్థితిలో కూడా ఉన్నతభావాలను విడనాడని వ్యక్తే నిజంగా ధైర్యశాలి.'

'జీవితం అంటే తీపీ వుంటుంది, చేదూ వుంటుంది. ఎల్లప్పుడూ తీపే తింటే వెగటు పుడుతుంది. అప్పుడప్పుడు చేదును కూడా రుచిచూడటం నేర్చుకోవాలి. సుఖాన్నెలా స్వీకరిస్తామో, అదే విధంగా దుఃఖాన్ని కూడా స్వీకరించడం నేర్చుకోవాలి. సుఖంతో పాటు బాధను కూడా అలవరచుకోనాలి. బాధలో కూడా ఒక విధమైన ఆనందం యిమిడి వుంది. ఈ రెండూ వుంటేనే జీవితం ఉత్తేజకరంగా వుంటుంది.'

'ప్రతివ్యక్తీ మనోధైర్యం, ఆత్మవిశ్వాసం, దృఢ సంకల్పం కలిగి వుండాలి.'

'ప్రచండ దుఃఖంలోనే మానవుడు తన అస్థిత్వాన్ని గుర్తిస్తాడు. కొన్నియెడల సుఖము కంటే దుఃఖమే విశేషముగా జ్ఞానాంజన మగును. లోకశ్రేష్ఠుల శీలము పలిశీలించినచో అందు అధికసంఖ్యాకులకు సుఖము కంటే దుఃఖమే జ్ఞానాంజనమైవదని తేటతెల్లమవుతున్నది.'

'ఏ వస్తువైనను ఉన్నప్పుడు దాని విలువ తెలియదు.'

'విద్యుచ్ఛక్తివలె విజ్ఞానం కూడా ఒక రకం శక్తి. దాని వెనుక వివేకం లేనప్పుడు మారణాయుధంగా పనిచేస్తుంది.'

'చదువురాని దుర్జనుడి కంటే, చదువుకొన్న దుర్జనుడు ఎక్కువ ప్రమాదకారి.'

'తనకు తెలియని విషయాన్ని గురించి మాట్లాడటం అనుచితం. తెలియని విషయాన్ని గూర్చి తెలిసినట్లుగా నటించడం ప్రమాదం. ఏదయినా విషయాన్ని గురించి క్షుణ్ణంగా తెలిసికొనిన తరువాతనే యితరులకు చెప్పడం విజ్ఞత లక్షణం.'

'కష్టపడని ప్రాణికి సుఖప్రాప్తి లేదు. కష్టేఫలి. కష్టాలు చవిచూచిన వానిని నిరాశ, నిస్పృహాలు ఏమీ చేయలేవు.'

'ద్వేషము వేరుపురుగు లాంటిది. ద్వేషము పూనిన మనస్సుకు తృప్తి అనేది వుండదు. ద్వేషము, ఈర్ష్య, అసూయ అనేవి తోడుదొంగల లాంటివి. ఇంకా ఎన్ని సద్గుణాలున్నప్పటికి ఈ మూడు దుర్గుణాలు మనిషిలో చేరితే పతనం కావడం ఖాయం. ఈ మూటికి ఏ మాత్రం అవకాశం యివ్వని వారే సజ్జనులుగా పరిగణించబడుతారు.'

'ఐకమత్యమే మహాబలం. అనైక్యత అరిష్టానికి దారి తీస్తుంది.'

'అసత్య మాడరాదు. సత్యమునే పలుకవలెను.'

'అనుమానం పెనుభూతం.'

'విశ్వాసం సడలినచో ధైర్యము సడలును; ధైర్యము సడలినచో సాధన కుంటుబడును; సాధన కుంటుబడినచో లక్ష్యము దూరమై పోవును. కావున లక్ష్య ప్రాప్తికి అకుంఠిత విశ్వాసము, అపరిమిత శ్రద్ధ అత్యవసరములు.'

'అనుభవంవల్ల కలిగెడి జ్ఞానం సర్వోత్కృష్టమైనది.'

'ఆత్మస్తుతి, పరనింద పనికిరాదు.'

'గొప్పవారికి వ్రతమే సుఖము; తుచ్ఛులకు సుఖమే వ్రతము.'

'ఆశయములేని జీవితము దీపములేని గృహము వంటిది.'

'Childhood shows the man
Morning shows the dawn.'

'అరుణరేఖలు ఉషోదయమును సూచించునట్లు, బాల్యము జీవిత భవితవ్యమును చూపును.'

'మతాలు వేరు కావచ్చు; కాని అవి ప్రతిపాదించే సత్యం ఒక్కటే. మతసిద్ధాంతాలు భిన్నంగా కనుపించవచ్చు; వాటి

అంతిమధ్యేయం మాత్రం ఒక్కటే. ఎన్నో పేర్లతో భగవంతుని పిలువవచ్చు; కాని ఆ భగవానుడు ఒక్కడే. మానవునికి మోక్షమార్గాన్ని చూపించేది మతం. నైతిక, ఆధ్యాత్మిక విలువలను పెంపొందించేది మతం.'

'మనస్సుకి ఉల్లాసం కలిగించే సల్లాపాలు పలికేవారు కోకొల్లలు. అప్రియమయినా సమయస్ఫూర్తితో, సందర్భోచితంగా హితబోధ చేయగల స్నేహితుడు దొరకడం దుర్లభం. కటువుగా నున్న శ్రేయోదాయకమైన హితవును వినగలవాడే ఉత్తమస్థితి పొందుతాడు.'

'ప్రపంచంలో చివరకు నిలచి యుండునది కీర్తి యొక్కటే. పాపమును ప్రజలు మరచి పోవుదురు.'

'పిరికితనంగాని, ధైర్యంగాని జాతి లక్షణం కాదు. రక్తంలో లేదు. శిక్షణలో వుంటుంది.'

'సుఖాన్నెలా స్వీకరిస్తామో, అదేవిధంగా దుఃఖాన్ని కూడా స్వీకరించడం నేర్చుకోవాలి.'

'చరిత్రలో ఏ యుగంలో నయినాసరే, అధికారంలో వున్న వారి బంధు జనులు - ఎంతటి మొద్దులయినా - గౌరవింప బడుతునే వుంటారు.'

'ఉప్పులేని కూర, ఉపకారం చేయని జీవితం, మమకారం చూపని మిత్రుడు, సహాయం చేయని స్నేహితుడు, పౌరుషం లేని పరిపాలకుడు, వివేకంలేని విద్య, మాధుర్యంలేని సంగీతం, పసలేని ఉపన్యాసం, విశ్వాసంలేని యజమాని, విశ్వాసఘాతకులైన బంధు జనులు, కృతజ్ఞతలేని సోదరులు, క్రమశిక్షణలేని సమాజం, శీలంలేని మనిషి, భక్తిలేని పూజ, వినయంలేని విద్యార్థి ఉన్నా ప్రయోజనం లేదు.'

'చేసిన మేలును మరచినవాడు నశిస్తాడు. మిత్రుణ్ణి వంచించ జూసే వాడికి అధోగతే.'

'అనుభవము లేని ప్రచారము నిరర్థకము.'

'విమర్శన లేనిదే వివేకోదయ ముండదు.'

'మాట్లాడటం తేలిక; పనిచేయడం కష్టం.'

'చాడీలు చెప్పడం వంటి నీచమైన పని మరొకటి వుండదు.'

'చెప్పడం కంటే చేయడం ఉత్తమం. చేసిన తరువాత చెప్పాలి.'

'అపవాదులు అంటువ్యాధులవలె వ్యాపించి ప్రజలకు చాలా హాని కలిగిస్తాయి.'

'మనం నివసించే ప్రదేశమును పరిశుభ్రంగా ఉంచాలి. పవిత్రంగా వుండాలి.'

'నియమబద్ధంగా చేసే పని నిరర్థకం కానేరదు.'

'పనిచేయడంవల్ల ప్రయోజనం వుంటుంది. వట్టిమాటలవల్ల ఏమీ ప్రయోజనం ఉండదు.'

'పట్టుదల వుంటే కష్టమైనపని కూడా తేలికవుతుంది.'

'ముఖం అందంగా, పరిశుభ్రంగా వున్నందువల్లనే ప్రయోజనం లేదు. హృదయం విశాలమైనదిగా, గొప్పదిగా వుండాలి.'

'పక్షులలో కాకి నీచము. మృగములలో గాడిద నీచము. సన్యాసులలో కోపము గలవాడు నీచుడు. ఒకరిని ఎప్పుడును దూషించువాడు అందరికంటే నీచుడు.'

'పామునకు విషము కోఱల యందు ఉండును. తేలునకు తోకయందుండును. ఈగకు విషము తలయందు ఉండును. దుర్జనునకు నిలువెల్ల విషమే.'

'Not to live as long as possible, but as mighty as possible.' 'దీర్ఘకాలం జీవించడంకాదు, వీరోచితంగా జీవయాత్ర గడపడం ముఖ్యం.'

'కోరికయే దుఃఖమునకు, క్రూరతకు కారణము.'

'డబ్బున్నవాడు ఎలాంటి చలోక్తి విసిరినా అందరూ చప్పట్లు కొడుతారు.'

'సంపదలవల్ల అవగుణాలు బయటపడుతాయి. కష్టాలవల్ల సుగుణాలు వెల్లడవుతాయి.'

'భుజించడం కోసం జీవించ కూడదు; జీవించడం కోసం భుజించాలి.'

'నీ గురించి నీవే చెప్పుకోకూడదు. మంచి చెప్పుకుంటే ఎవరూ నమ్మరు. చెడు చెప్పుకుంటే ఇంకా ఎంత చెడు వున్నదో ననుకుంటారు.'

'ధనం అజ్ఞానిని శాసిస్తుంది. జ్ఞానికి సేవచేస్తుంది.'

'ఆశించడంవలనగాక, అర్హతను కలిగియుండుట వలన దేనినైనా పొందవచ్చును.'

'కోరికలు నెరవేర్చుకొనడంవలన గాక, అసలు కోరికలే లేకుండా చేసుకోవడంవలన మనిషి సుఖపడుతాడు.'

'జీవితాన్ని తెలియచేయలేని చదువు శ్మశానంలో నక్కల అరుపు లాంటిది.'

'చెడును గురించి కాకిలా గోలచేయకు, మంచిని గురించి కోయిలలా గానం చెయి.'

'పరిస్థితులు మనిషి అధీనంలో ఉండవు. కాని ప్రవర్తన మాత్రం తన అధీనంలో వుండాలి.'

'చెట్టు తన పండు తాను తినదు. నది తన నీరు తాను త్రాగదు. అట్లే సత్పురుషులు తమ జీవితంలో ప్రతి పని ఇతరుల కొఱకే చేస్తారు. ఇతరుల సుఖాన్నే ఆశిస్తారు.'

'విత్తనం తనను తాను భూమిలో నశింప చేసుకోవడం వలననే మహావృక్షంగా మారగలిగింది. స్వార్థత్యాగంచేతనే జీవితంలో ఘనవిజయం సాధించగలం.'

'దుర్మార్గుని హృదయం అతని వాక్కులో గోచరిస్తుంది. సన్మార్గుని వాక్కు అతని హృదయంలో ప్రస్ఫుటమవుతుంది.'

'కష్టాలు వస్తేగాని కళ్లు కన్నీరు కార్చవు. అప్పుడు మనస్సు మథన పడుతుంది. హృదయం పరితపిస్తుంది. ఆత్మ సంక్షోభిస్తుంది. బాధలొస్తేగాని భావాలు పెల్లుబకవు. కవ్విస్తేగాని కలం కవిత్వాన్ని వ్రాయదు.'

'సత్యమునకై దేనినైనను సరే త్యజించవచ్చు; కాని దేనికొఱకైనను సరే సత్యమును మాత్రం త్యజింప కూడదు.'

'అల్పబుద్ధిగల వానికి ఆలోచనలు అల్పంగాను, స్వల్పంగాను, వక్రంగాను, సంకుచితత్వంగాను ఉంటాయి. దొడ్డ (మంచి) బుద్ధిగల వానికి ఆలోచనలు ఉన్నతంగాను, విశాలంగాను, సవ్యంగాను, ఉదారంగాను ఉంటాయి.'

'దుర్జనులు నిందాపవాదంబులచే సజ్జనులను బాధించుచుందురు.'

'దుర్జనులకు హింసయే బలము. రాజులకు అధికారం బలం. స్త్రీలకు శుశ్రూష బలం. సద్గుణవంతులకు క్షమయే బలం.'

'ఏ మాటనైన పలుకుటకంటే, పలకకుండుటయే మేలు. ఒకవేళ పలికినచో సత్యమునే పలుకుట మంచిది. ప్రియమైన మాటలు పలుకుట ఉత్తమం. ధర్మయుక్తమైన మాటలు పలుకుట అత్యంత ఉత్తమం.'

'తాపసులకు తపమే బలం. సద్గుణవంతులకు శాంతియే బలం. బ్రహ్మవేత్తలకు వేదమే బలం. దుర్జనులకు హింసయే బలం. సజ్జనులకు సత్యమే బలం.'

'ప్రపంచంలో కొందరికి ధనమందు ఆసక్తి, కొందరికి కీర్తి యందు ఆసక్తి, మరికొందరికి అధికారమునందు ఆసక్తి, మరికొంత మందికి విషయభోగముల యందు ఆసక్తి, కాని జ్ఞానికి మాత్రం భగవంతునియందు తప్ప మరొక దానిపై ఆసక్తి వుండదు.'

'అవకాశాలు ఎప్పుడు పడితే అప్పుడు రావు. తెలివిగల వ్యక్తి వచ్చిన అవకాశాన్ని ఎన్నడూ జారవిడుచుకోడు.'

'గత సుఖాల స్మృతులు కష్టాలను, మరింత భారవంతం చేస్తాయి.'

'జీవితం గులాబి లాంటిది. కారణం దానికి ముళ్లుండడమే.'

'కోరికలు అనవసరంగా పెంచుకుంటూ పోవడం మహా పాపం.'

'అందర్నీ సంతృప్తి పరచాలనుకునే వ్యక్తి ఎవరినీ ఆనంద పరచలేడు.'

'Dishonesty will surely be punished.' 'మోసము తప్పక శిక్షించబడుతుంది.'

'Fortune favours not the lazy, but only the brave and industrious.' 'సోమరిపోతులను అదృష్టము వరించదు. ధైర్య సాహసులైన శ్రామికులను మాత్రమే వరిస్తుంది.

'Starvation is preferable to slavery.' 'దాస్యకంటే క్షుద్బాధయే మేలు.' (సేవావృత్తితో లభించు పాయసం కంటే, స్వచ్ఛంద వృత్తితో లభించు గంజి మేలు)

'Do not trust friends that desert you in times of danger.' 'విపత్కాలమున విడచిపెట్టు స్నేహితులను నమ్మవద్దు.'

'None will trust one who blows hot and cold.'

'రెండు నాలుకల మనిషిని ఎవరూ నమ్మరు.'

'Strength is given to us for protecting the weak.'

'బలహీనులను సంరక్షించడానికే భగవంతుడు మనకు శక్తి నిచ్చాడు.'

'బీదవాడికి తిండి కావాలి; ధనికునికి ఆకలి కావాలి.'

'నడమంతరపు సిరి నరాలమీద పుండు లాంటిది.'

'నోరు మంచి దయితే ఊరు మంచి దవుతుంది.'

'కలసి వుంటే కలదు సుఖం.'

'బావి లోతు చూడవచ్చునుగాని మనస్సు లోతు చూడలేరు.'

'క్షేత్ర మెరిగి విత్తనము, పాత్ర మెరిగి దానము చెయ్యాలి.'

'తన కంపు తన కింపు, పర కింపు తన కంపు.'

'మోసగాడు తనను తానైనా మోసగించుకొననిదే వుండలేడు.'

'శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు.'

'చిరునవ్వుకూ, కన్నీటికీ నడుమ తిరిగే లోలకమువంటిది జీవితం.'

'ధనం శత్రువులను సృష్టించినంతగా మిత్రులను సృష్టించలేదు.'

'ధనవంతుని కంటే నిరుపేదయే రుచికరమైన భోజనం చేస్తాడు. ఎందువల్లనంటే, ఆకలి ఆహారానికి మాధుర్యం కలిగిస్తుంది.'

'కుటుంబం, భార్యా బిడ్డలు, మన శరీరము, సంపద అన్నీ వాటి దోవన అవి పోయేవే. అవి మనవి కావు. మనం చేసిన మంచిపనులు, చెడ్డపనులు మాత్రమే మన వెంట వుంటాయి.'

'సోమరిపోతు అడుక్కుతినే వానికి తమ్మునివంటివాడు.'

'Time once lost can never be regained.'
'ఒకసారి గడిచిపోయిన కాలం తిరిగిరాదు.'

'You will be punished for your negligence.'
'నీ నిర్లక్ష్యానికి నీకు శిక్ష లభిస్తుంది.'

'Some people prefer wealth to health.'
'కొందరికి ఆరోగ్యం కన్న సంపద మీద మక్కువ.'

'Indiscipline should not ba encouraged.'
'అరాజకతను ప్రోత్సహించరాదు.'

'Health is more precious than wealth.'
'ఆరోగ్యం సంపదకన్న విలువైనది.'

'Man is mortal.'
'పుట్టిన మనుష్యుడు గిట్టక తప్పదు.'

'Bad habits should be nipped in the bud.'
'దురలవాట్లను మొగలోనే తుంచివేయాలి.'

'Truth triumphs in the long run.'
'కొంతకాలానికి నిజం గెలుస్తుంది.'

'Do not ape others.'
'ఇతరులను గుడ్డిగా అనుసరించవద్దు.'

'Lay down your life in the service of the motherland.'
'దేశ సేవలో ప్రాణత్యాగం చేయండి.'

'An idle man is as good as half dead.'
'సోమరి సగం చచ్చినవానిక్రింద లెఖ.'

'Neither borrow nor lend.'
'అప్పు యివ్వవద్దు, తీసుకోవద్దు.'

'There is a great joy in selfless service.'
'నిస్వార్థసేవలో ఎంతో ఆనందం ఉన్నది.'

'Neither deceive nor be deceived.'
'ఒకరిని మోసగించవద్దు, ఒకరి మోసానికి గురికావద్దు.'

'The virtuous alone are happy.'
'నీతిగల వారే సంతోషంగా వుంటారు.'

'Plain-speaking is always unpleasant.'
'ఉన్నది ఉన్నట్టు చెబితే ఎదుటివారు ఇష్టపడరు.'

'Prosperity gains friends, but adversity tries them.'
'సంపదతో స్నేహితులు వస్తారు. లేమి వారికి పరీక్ష అవుతుంది.'

'The innocent are punished along with the guilty.'
'తప్పుచేసినవారితోపాటు అమాయకులకు కూడా శిక్ష పడింది.'

'Opportunists never hesitate to worship the rising sun.'
'అవకాశవాదులు ఎటు అనుకూలంగా వుంటే అటు మొగ్గుతారు.'

*

"అతి పురాతనము, బూజు పట్టినవి అనీ భావింపబడుచున్న గ్రంథములే నేడు మనకు జ్ఞాన నిధులు. పరస్పర వైరుధ్యములను విశదీకరించి, వాని కతీతముగ వెలుగొందు దివ్యసత్యము వంకకు రాచబాటలను నిర్మించి, అందు పయనించిన భారతదేశ ఋషిపుంగవులు భగవంతుని ప్రత్యక్షముగ గాంచిరి. భారతదేశము తన ఆధ్యాత్మిక జ్యోతితో యూరప్‌నకు మార్గమును జూపుగాక!"

Professor J. H. FELEURE, B. Sc., F. R. S.

# మనుష్యుని సరిదిద్దితే...

ఒక గెజిటెడ్ ఆఫీసరు తన పని చేసుకుంటూంటే తన చిరంజీవి ఆయన పనికి అడ్డం వచ్చాడు. కుర్రవాని నుండి తప్పించుకోడానికి, అక్కడ ఒక ప్రపంచ పటము (map) వుంటే చించి, దానిని సరిగా పెట్టమని ఆ పిల్లవానికి యిస్తాడు. ఆ పిల్లవాడు మరుక్షణంలో ప్రపంచ పటమును సరిగా చూపగలిగాడు. ఆఫీసరు గారికి ఆశ్చర్యం వేసింది. 'నీవు ఈ పని ఎట్లా చేయగలిగావు?' అని కుర్రవానిని ఆఫీసరుగారు ప్రశ్నించాడు.

'తండ్రీ! ఇందులో ఆశ్చర్యపడవలసినది ఏమీ లేదు. ఆ పటము వెనకాల మనుష్యుని పట మున్నది. చేతులు, కాళ్లు, తల సరిగా చేర్చాను. అంతే, మనుష్యుడు వచ్చాడు. ఆయన రాకతో ప్రపంచపటము కూడా సరిగా తయారైంది' అని పిల్లవాడు సమాధానం చెప్పాడు.

మనం యిక్కడ నేర్చుకోవలసిన నీతి ఒకటే. మనుష్యుని సరిదిద్దితే ప్రపంచం సరి అవగలదన్నమాట. **'Set the man right and the world will be right.'**

*

# ఉపద్రష్ట జగన్నాథపండితులు

కీ. శే. ఉపద్రష్ట జగన్నాథపండితులు తెలుగుగడ్డమీద జన్మించారు. షాజహాన్ చక్రవర్తి చేత 'పండితరాయలు' బిరుదును పొందారు. వీరు ఏకసంతగ్రాహి. వీరిని షాజహాన్ చక్రవర్తి తన నెమలి సింహాసనం మీద సరసన కూర్చోపెట్టుకున్నాడు. షాజహాన్ చక్రవర్తి తన కూతురు లవంగిని జగన్నాథపండితులవారికి యిచ్చి వివాహం చేశాడు. వీరు 'రసగంగాధరం' అనే అలంకార శాస్త్రమును రచించారు. జయపూర్ సంస్కృత మహా విద్యాలయానికి ప్రధానాచార్యులుగా కొంతకాలం పనిచేసారు. వీరి ప్రతిష్ఠ తెలుగువారికి గర్వకారణం.

# సంస్కృత నీతి లోకోక్తులు - సామెతలు

1. "సత్యాన్న ప్రమదితవ్యమ్"
   సత్యము నుండి చలింప వలదు.
2. "ధర్మాన్న ప్రమదితవ్యమ్"
   ధర్మము నుండి తొలగ వలదు.
3. "కుశలాన్న ప్రమదితవ్యమ్"
   సద్భావముల నుండి భ్రష్టము కావలదు.
4. "సత్యం వద"
   సత్యమును పలుకుము.
5. "ధర్మం చర"
   ధర్మము నాచరించుము.
6. "ధర్మాత్ పరం నాస్తి"
   ధర్మము కంటె శ్రేష్ఠము లేదు.
7. "ధర్మః సర్వేషాం భూతానాం మధు"
   ధర్మము సర్వభూతములలో మధురమైనది.
8. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్"
   శ్రద్ధగలవానికి విద్య లభించును.
9. "శ్రద్ధయా దేయమ్"
   శ్రద్ధతో దానము చేయవలెను.
10. "యథాకర్మ తథా ఫలమ్"
    పని యెట్లుండిన ఫలిత మట్లుండును.
11. "ఆశా దుఃఖస్య కారణమ్"
    ఆశయే దుఃఖమునకు కారణము.
12. "దూరతః పర్వతా రమ్యాః"
    దూరపు కొండలు నునుపు.

13. "గతస్య శోకో న కర్తవ్యః"
గతించినదానికి దుఃఖించరాదు.

14. "శీలం పరం భూషణమ్"
మంచి నడవడియే గొప్ప. (శీలమే జీవునికి అలంకారము)

15. "అతి తృష్ణా వినాశాయ"
అత్యాశ వినాశకరమే.

16. "కాయః కస్య న వల్లభః"
ఎవని శరీరము వానికి సుందరమే. (కాకిపిల్ల కాకికి ముద్దు)

17. "మూర్ఖస్య నా స్త్యౌషధమ్"
మూర్ఖుని మూర్ఖతకు మందు లేదు.

18. "బలీయసీ కేవల మీశ్వరేచ్ఛా"
భగవంతుని యిష్టమే బలవత్తరమైనది.

19. "అర్ధో ఘటో ఘోష ముపైతి నూనమ్"
సగము కుండకు చప్పుడెక్కువ.

20. "అనురాగస్తు ఫలేన సూచ్యతే"
ఫలితమే స్నేహమును తెలుపును.

21. "అతి సర్వత్ర వర్జయేత్"
అధికప్రసంగం పనికిరాదు. (అతిగా పనిని చేయరాదు)

22. "అతిస్నేహః పాప శంకీ"
అతిస్నేహము పాపము నూహించును.

23. "ఆధిక స్యాధికం ఫలమ్"
గొప్పదానికి గొప్ప ఫలం.

24. "అత్యుచ్ఛ్రయగ పతనహేతుః"
పెరుగుట విరుగుట కొఱకే.

25. "అనాథో దేవ రక్షకః"
దిక్కులేని వానికి దేవుడే దిక్కు.

26. "అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్"
తా నొకటి తలచిన దైవ మొకటి తలచును.

27. "అర్థస్య పురుషో దాసః"
మనుష్యుడు డబ్బుకు దాసుడు.

28. "అల్పవిద్యో మహా గర్వీ"
కొంచెము విద్య గలవానికి గొప్పగర్వము.

29. "అల్పారంభః క్షేమం కరః"
చిన్న ఆరంభం శ్రేయస్కరము.

30. "అహింసా పరమో ధర్మః"
అహింసయే ఉత్తమ ధర్మము.

31. "ఆచారః పరమో ధర్మః"
మంచి నడవడి ఉత్తమమైన ధర్మము.

32. "ఆయు రన్నం ప్రయచ్ఛతి"
ఆయుస్సు అన్నం పెట్టును.

33. "ఆలస్యా దమృతం విషమ్"
ఆలస్యమైన అమృతం విషమగును.

34. "అతిభారః పురుష మవ సాదయతి"
తలకు మించిన బరువు తనను కూల్చును.

35. "అగ్నిదాహా దపి విశిష్ట వాక్పారుష్యమ్"
నిప్పుమంట కంటే సూటి పోటీ మాట మంట దొడ్డది.

36. "అప్రాప్యం నామనే హాస్తి, ధీరస్య వ్యవసాయినః"
పట్టు విడువక పాటుపడువానికి పొందలేనిది లేదు.

37. "అతి తృష్ణా వినాశాయ"
అత్యాస వినాశమునకు హేతువు.

38. "అశాన్తస్య కుత స్సుఖమ్"
శాంతిలేనివానికి సుఖ మెక్కడ?

39. "అమిత్రస్య కుతః సుఖమ్"
మిత్రులులేనివానికి సుఖ మెట్లు లభించును?

40. "అలసస్య కుతో విద్యా"
సోమరికి విద్య ఎట్లు లభించును?

41. "ఆశా దుఃఖస్య కారణమ్"
ఆశ దుఃఖమునకు కారణము.

42. "అనురాగస్తు ఫలేన సూచ్యతే"
అనురాగము ఫలితముతో మాత్రమే సూచించబడుచున్నది.

43. "అగ్నిదాహాదస్య సహ్యం వాక్పారుష్యమ్"
అగ్నిజ్వాలలకంటే కటువైనమాట మిక్కిలి సహింపరానిది.

44. "అంగీకృతం సుకృతినో న పరిత్యజన్తి"
సజ్జనులు చేబట్టిన కార్యమును మధ్యలో వదలరు.

45. "అవయవ శక్తేః సముదాయ శక్తి ర్బలీయసీ"
విడివిడిగావున్న శక్తి కంటే సమూహశక్తి గొప్పది.
(ఐకమత్యమే మహాబలము)

46. "అపన్థానం తు గచ్ఛన్తం సోదరోఽపి విముంచతి"
చెడుమార్గమున నడచువానిని సోదరుడు కూడా విడచును.

47. "ఆచారాత్ కిం నసాధ్యతే"
మంచినడవడి వలన సాధించబడనిదేది?

48. "అర్థోహి లోకేషు బన్ధుః"
ధనమే లోకమునకు బంధువు.

49. "అగ్నిర్హిమస్య భేషజమ్"
నిప్పు మంచుకు మందు.

50. "అయమపరో గండ స్యోపరి స్ఫోటః"
గోరుచుట్టుపై రోకలిపోటు.

51. " అంబునో బిన్దు రల్పోపి శుక్తౌ ముక్తాఫలం భవేత్ "
నీటిచుక్క చిన్నదైనను ముత్యపుచిప్పయందున్నదై మంచి ముత్యమగును.

52. " ఉదర నిమిత్తం బహు కృత వేషః "
పొట్టకోస మెన్నియో వేషములు.
( కోటివిద్యలు కూటి కొరకే )

53. " ఉద్యోగం పురుష లక్షణమ్ "
పనిచేయుట పురుష లక్షణము.

54. " ఉష్ణ ముష్ణేన శీతలమ్ "
వేడి వేడిచేతనే చల్లబడును.

55. " ఉదారాస్య తృణం విత్తమ్ "
ఉదారస్వభావముగల దాతకు ధనము గడ్డిపోచ వంటిది.

56. " శూరస్య మరణం తృణమ్ "
శూరునకు, వీరునకు చావు గడ్డిపోచ వంటిది.

57. " వృథా తృప్తస్య భోజనమ్ "
కడుపు నిండిన వానికి భోజనము వ్యర్థము.

58. " ఖలో మృగయతే దోషమ్ "
నీచుడు దోషమునే వెతుకును.

59. " విద్యా నరస్య భూషణమ్ "
విద్య సమస్తమునకు అలంకారము.

60. " నాస్తి లోభ సమో వ్యాధిః "
ఆశతో సమానమైన రోగము లేదు.

61. " నాస్తి క్రోధ సమో రిపుః "
కోపముతో సమానమైన శత్రువు లేదు.

62. " నాస్తి దారిద్ర్యవత్ దుఃఖమ్ "
దారిద్ర్యము వంటి దుఃఖము లేదు.

63. "నాస్తి జ్ఞానాత్ పరం సుఖమ్"
జ్ఞానము కంటె గొప్పదైన సుఖము లేదు.

64. "ఉద్ధరే దాత్మ నాత్మానమ్"
తన్ను తానే ఉద్ధరించు కోవలెను.

65. "త్యాగా చ్ఛాన్తి రనంతరమ్"
త్యాగమువలన శాంతి లభించును.

66. "న సుఖం సంశయాత్మనః"
సంశయములు కలవానికి సుఖము లేదు.

67. "క్షుద్రం హృదయ దౌర్బల్యమ్"
మనోదుర్బలత్వము నీచమైనది.

68. "గతస్య శోకః న కర్తవ్యమ్"
గతించిన దానికై చింతించరాదు.

69. "గతజల సేతు బంధనమ్"
నీరుపోయిన వెనుక కట్టగట్టుట.
(చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొనుట)

70. "గర్వాత్ శీలం మహత్"
గర్వము కంటే శీలము గొప్పది.

71. "ఋణం కృత్వా ఘృతం పిబేత్"
అప్పుచేసుకొని నెయ్యి త్రాగవలెను.
(అప్పుచేసి పప్పుకూడు)

72. "కోపః పాపస్య కారణమ్"
కోపము పాప హేతువు.

73. "చర్విత చర్వణమ్"
తిన్నదానినే తినుట.
(చదివిందే చదువుట, చేసిందే చేయుట)

74. "జనవాక్యం తు కర్తవ్యమ్"
జనుల మాట ప్రకారము చేయదగును.

75. "జాతస్య మరణం ధ్రువమ్"
పుట్టినవానికి చావు నిశ్చయము.
( పుట్టినవాడు గిట్టకమానడు )

76. "జామాతా దశమో గ్రహః"
అల్లుడు పదియవ గ్రహము.

77. "దండో దశ గుణో భవేత్"
దెబ్బ పదిగుణములు గలది. (దెబ్బకు దయ్యంపారిపోవును)

78. "దుర్జనం దూర తస్త్యజేత్"
దుర్జనునికి దూరంగా వుండవలెను.

79. "దైవస్య చిత్రా గతిః"
దైవగతి చిత్రమైనది.

80. "ధనమూల మిదం జగత్"
లోకమున కంతయూ ధనమే మూలము.

81, "ధర్మస్య సూక్ష్మగతిః"
ధర్మము అతి సూక్ష్మమైనది.

82. "ధర్మమేవ జయతి"
ధర్మమే సర్వోత్కృష్టమై యున్నది.

83. "ధైర్యం సర్వత్ర సాధకమ్"
ధైర్యముతో అన్నిచోట్ల అన్ని కార్యములు సాధించవచ్చును.

84. "నందో రాజ భవిష్యతి"
నందుడు రాజు కాగలడు.

85. "నభూతో న భవిష్యతి"
కలుగలేదు, కలుగబోదు.

86. "నదీనాం సాగరోగతిః"
నదులకు సముద్రమే గతి.

87. " నహి సర్వస్వం జానాతి "
అందఱు, అన్నిటిని ఎఱుగరు.

88. " నా నృతం వదేత్ "
అసత్యం చెప్పకూడదు.

98. " నారదః కలహప్రియః "
నారదుడు కలహప్రియుడు.

90. " నైషధం విద్వ దౌషధమ్ "
నైషధం విద్వాంసులకు ఔషధము.

91. " నైకం చక్రం పరిభ్రమతి "
ఒకే చక్రముతో బండి నడుపజాలదు.

92. " నా తప్త లోహో లోహేన సన్ధీయతే "
కరుగని లోహము కలియదు లోహముతో.

93. " నాస్త్యగ్నే ర్దౌర్బల్యమ్ "
నిప్పునకు నీరసము లేదు.

94. " నాస్తి రత్న మఖణ్డితమ్ "
సానపెట్టని రత్నము లేదు.

95. " నికృతి ప్రియాః హి నీచాః "
చెడుపనులే నీచుల కిష్టము.

96. " న చేతనవతాం వృత్తి భయమ్ "
పాటుపడువానికి బ్రతుకు భయము లేదు.

97. " న వంశ వృక్షేషు ఫలన్తి ద్రాక్షాః "
వెదురుచెట్టున ద్రాక్షపండ్లు పండవు.

98. " న నిశ్చితార్థా ద్విరమన్తి ధీరాః "
ధీరులు వెనుకంజ వేయరు.

99. " నా స్త్యర్థినో గౌరవమ్ "
యాచకునకు గౌరవము లేదు.

100. "న చాగతం సుఖం త్యజేత్"
వచ్చిన సుఖాన్ని కూడా విడువరాదు.

101. "న దుర్జనో జాతు జ హాతి దుర్గుణమ్"
దుర్జనుడెన్నడును తనదుర్గుణములను విడువడు.

102. "గుణై ర్విహీనాః బహు జల్పన్తి"
గుణహీనులకు ప్రగల్భము లెక్కువ.

103. "గతస్య శోచనమ్ నాస్తి"
గతించినదానికై వగచుట తగదు.

104. "గతః కాలోన పున రుపైతి"
గడచిన కాలము తిరిగిరాదు.

105. "గతం దుఃఖం సుఖం తత్"
గడచిన దుఃఖానుభవ మిప్పుడు ఆనందాశ్రువులను కలిగించును.

106. "ఘటే రిక్తే ధ్వని ర్మహాన్"
ఖాళీ కుండకు చప్పు డెక్కువ.

107. "చక్రం క్రందత్య తైలకమ్"
నూనెలేని చక్రము అరచును.

108. "గతాను గతికో లోకః"
మహాజనుల మార్గమునే లోకులు అనుసరించుదురు.

109. "నక్వాపి పరశేన పదం నిధీయతే"
కార్యసాధకునకు ముక్కుసూటి అడుగుమాత్రమే పనికిరాదు.

110. "పూర్ణో ఘటో నైవం కరోతి శబ్దమ్"
నిండు కుండ ఏమాత్రం శబ్దం చేయదు.

111. "గౌరవం లభ్యతే దానాత్"
దానము వలన గౌరవము లభించును.

112. "చరా దపి వరం శిక్షా"
ఎంత వయస్సు మీరినను విద్యాభ్యాసము శ్రేష్ఠమే.

113. "ఛలం ఛలాను బన్ధి స్యాత్"
ఒక పాపము మరియొక పాపమును అనుసరించినదై యుండును.

114. "చక్రవత్ పరివర్తన్తే దుఃఖానిచ సుఖానిచ"
సుఖ దుఃఖములు చక్రమువలె క్రిందు మీదు లగుచుండును.

115. "చకాస్తి యోగ్యే నహి యోగ్య సంగమః"
యోగ్యునితో యోగ్యుని స్నేహము ప్రకాశించును.

116. "పటాటోపో భయంకరః"
పటాటోపము భయంకరమైనది.

117. "పరాన్నం ప్రాణ సంకటమ్"
ఇతరుల యన్నం ప్రాణ సంకటము.
(పరులసొమ్ము ప్రాణసంకటము)

118. "పాపాయ పరపీడనమ్"
పరపీడ పాపహేతువు.

119. "పరోపకారార్థ మిదం శరీరమ్"
ఈ శరీరము పరోపకారము కోసమే.

120. "బాలానాం రోదనం బలమ్"
బాలులకు ఏడుపే బలము.

121. "భుక్త్వా శతపదం గచ్ఛేత్"
భుజించి నూఱడుగులు నడువవలయును.

122. "మూర్ఖేణ కిం భాషణమ్"
మూర్ఖునితో మాటలేల ?

123. "యతో ధర్మ స్తతో జయః"
ధర్మమెక్కడ నుండునో జయము అక్కడే వుండును.

124. "యథా బీజం తథాఽంకురః"
విత్తనము ఎట్టిదో మొలక అట్టిది.

125. "యథా రాజా తథా ప్రజాః"
రాజు ఎట్లో ప్రజ లట్లే యుందురు.

126. " లోకో భిన్న రుచిః "
లోకము భిన్న రుచి కలది.

127. " విద్యా విహీనః పశుః "
విద్యలేనివాడు వింతపశువు.

128. " వినాశకాలే విపరీత బుద్ధిః "
వినాశకాలము దాపురించిన వానికి విపరీతబుద్ధి పుట్టును.

129. " శత శ్లోకేన పండితః "
నూరు శ్లోకములచే పండితుడు.

130. " సత్పుత్ర కులదీపకః "
మంచి పుత్రుడు కులమునకు కీర్తిని దెచ్చును.

131. " కాలోహి దురతి క్రమః "
కాలమును దాటుటకు శక్యముకానిదేగదా!

132. " దేవో దుర్బల ఘాతకః "
భగవంతుడు కూడా బలహీనులనే సంహరించును.

133. " విద్వాన్ సర్వత్ర పూజ్యతే "
విద్వాంసుడు అన్నిచోట్ల గౌరవించబడును.

134. " విద్యా దదాతి వినయమ్ "
విద్య వినయమును యిచ్చును.

135. " కుంజరం శతహస్తేషు, దుర్జనం దూరతస్త్యజేత్ "
ఏనుగును నూరుబారలందును, దుష్టుని దూరమందును విడువవలెను.

136. " గజం హస్త సహస్రేషు, దుష్టం దూరేణ వర్జయేత్ "
ఏనుగునకు నూరుబారల దూరమందేగాని, దుష్టునకు మిక్కిలి దూరమందు వుండవలెను.

137. " గురోశ్చ మాతు రాజ్ఞాచ సర్వదా శిరసా వహేత్ "
గురువులయు, తల్లిదండ్రులయు ఆజ్ఞను శిరసావహించవలెను.

138. " చపలేన సహాస్నేహః స్సర్వథా న కర్తవ్యః "
చపలచిత్తునితో నెన్నడును స్నేహం చేయరాదు.

139. " దుర్జనేన సమం వైరం ప్రీతిం చాపి నకారయేత్ "
దుష్టులతో వైరముగాని చెలిమిగాని పూనరాదు.

140. " నానృతం బ్రూయా న్నాన్య స్వమా దద్యాత్ "
అబద్ధమాడరాదు, పరద్రవ్య మాసింపరాదు.

141. " నోత్తమై ర్వి రుద్ధ్యేతః నా వరానుపా సీత "
ఉత్తములతో విరోధింపరాదు, నీచులను సేవింపరాదు.

142. " పాపం కృత్వా న గూహేత గుహమానం వివర్ధతే "
పాపంచేసి దాచుకొనరాదు ; అది దాచినకొద్దీ పెరుగును.

143. " పితృ మాతృ పరిత్యాగీ ఛండాలానాం శతం వ్రజేత్ "
తల్లిదండ్రులను విడచువాడు. ఛండాలుడుగా నూరుసార్లు పుట్టును.

144. " పుణ్యేన వర్ధతే లక్ష్మీః పాపేన క్షీయతే ధ్రువమ్ "
పుణ్యకార్యములు చేయుట వలన సిరిసంపదలు పెరుగును, పాపకార్యములచే అప్పటికున్న సిరిసంపదలు తొలగిపోవును.

145. " పుస్తక దాతా సహస్ర గోదాన ఫలం లభేత్ "
పుస్తకము దానమిచ్చువాడు వేయి గోవుల దానమిచ్చిన పుణ్యము పొందును.

146. " భక్తం రక్తం సదాసక్తం నిర్దోషం న పరిత్యజేత్ "
భక్తుడు, రక్తుడు, ఆసక్తుడు, నిర్దోషి అగు ఆశ్రితుని వీడరాదు.

147. " గుణీ గుణం వేత్తి నవేత్తి నిర్గుణః "
గుణవంతునికే గుణముల విలువ తెలియును, గుణహీనునకు తెలియదు.

# బాల
# విజ్ఞానకోశము
## సప్తమ భాగము

## ఆంగ్ల నీతిలోకోక్తులు - సామెతలు

# ఆంగ్లనీతి లోకోక్తులు - సామెతలు

1. Art is long and life is short
   అంతములేనిది కళ ; అందు మన జీవితమొక అణువు.

2. To please all to please none
   అందరిని మెప్పించడం అలవికాని పని.

3. A friend in need is a friend in deed
   అక్కరకు వచ్చినవాడే అయినవాడు.

4. Ask and it shall be given to you
   అడగనిదే అమ్మైనా పెట్టదు.

5. Lie not for any consideration
   అనృతము పలకరాదు.

6. Jack of all trades, master of none
   అన్నీ తెలుసు గాని అంతా అసంపూర్తే.

7. Practice makes one perfect
   అభ్యాసం కూసు విద్య.

8. Time and tide waits for none
   అయ్యవారు రాలేదని అమావాస్య అట్టే వుంటుందా !

9. A barking dog never bites
   అరిచే కుక్క కరవదు.

10. Hunger is the best sauce
    ఆకలి రుచి యెరుగదు.

11. A bad workman quarrels with his tools
    ఆడలేక మద్దెల ఓడు అన్నట్లు.

12. Cut your coat according to the cloth
ఆదాయ మెరిగి వ్యయము చేయుము. (పిండి కొలది రొట్టె)

13. Health is wealth
ఆరోగ్యమే మహాభాగ్యము.

14. Procrastination is the thief of time
ఆలస్యం అమృతం విషం.

15. Injure not another's reputation or business
ఇతరుల కీర్తికి, పనికి కీడు చేయకుము.

16. Bare words buy no barley
ఉత్త చేయి మూర వేసినట్లు.

17. Good homer sometimes nods
ఏనుగుకైనా ఒక పరి కాలు జారక తప్పదు.

18. Set your sail according to the wind
ఏ యెండ కా గొడుగు పట్టాలి.

19. Empty vessels make much noise
ఒట్టి గొడ్డుకి అరుపు లెక్కువ.

20. Faults are thick when love is thin
ఒల్లని భార్యకు చేయి తగిలినా తప్పే, కాలు తగిలినా తప్పే.

21. Grapes are sour
ఒళ్ళు వంగని వానికి ఊరు అచ్చిరాదు.
( అందని పండ్లు పులుపు )

22. Blessed are the meek, for they shall inherit the earth
ఓరిస్తే ఓరుగల్లు పట్టణ మౌతుంది.

23. No pains, no gains
కష్టపడకుండా కాలైనా వంగదు,

24. Endure trials patiently
కష్టములలో ఓర్పును గల్గియుండుము.

25. Rob the Peter and pay the Paul
కాకులను కొట్టి గద్దలకు వేసినట్లు.

26. A stitch in time saves nine
కీ తెరిగి వాత పెట్టమన్నట్లు.

27. You can't have the cake and eat it too
కుండలో కూడు కుండలో వుండాలి, బిడ్డలు మొద్దుల్లా ఉండాలి.

28. Tit for tat
కుక్క కాటుకు చెప్పు దెబ్బ.

29. Fair words butter no parsnips
కూడు గుడ్డ అడక్కపోతే చంటిబిడ్డను సాకినట్లు సాకుతా.

30. Law-maker should not be law-breaker
గట్టే పైరు మేస్తే కాపు ఏమి చేయగలడు ?

31. Casting pearls before swine
గాడిదకు తెలుసా గంధం వాసన. ( పందికేం తెలుసు పన్నీటి వాసన ).

32. Penny - wise and pound - foolish
గుమ్మడికాయ పోయేదారి తెలియదు.
ఆవగింజ పోతే పట్టుకొస్తాడు.

33. Add fuel to fire
గోరుచుట్టుమీద రోకటిపోటు అన్నట్లు.

34. Fools throw stones while they live in glass houses
గురువిందగింజ తన క్రింద నలుపెరుగదు.

35. Face is the index of the mind
చల్ల కొచ్చి ముంత దాచినట్లు.

36. Lamb at home and a lion at chase
చూపులకు పిల్లి, వేటకు పులి.

37. Spare the rob and spoil the child
చెట్టై వంగనిది మ్రానై వంగునా!

38. Example is better than precept
చెప్పటం కంటే చేయటం మేలు.

39. Many a slip betwist the cup and lip
చేతి కందినది నోటి కందలేదు.

40. Prevention is better than cure
చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొన్నట్లు.

41. As you sow, as you reap
చేసుకొన్నవారికి చేసుకొన్నంత మహాదేవా!

42. Christmas comes but once a year
జన్మానికి శివరాత్రి.

43. First deserve, then desire
డబ్బు లేనివాడు ముందు పడవెక్కినట్లు.

44. Misfortunes never come single
తగిలిన కాలికే తగులును.

45. Respect the counsel of parents
తల్లిదండ్రుల మాటను గౌరవింపుము.

46. Blood is thicker than water
తా నూరకున్న బంధువు లూరకొందురా!

47. Man proposes and god disposes
తా నొకటి తలచిన దైవ మొకటి తలచును.

48. A tree is known by its fruit
తులసివనంలో గంజాయి మొలచునా !

49. All are not saints that go to church
తెల్లని దంతయు పాలు నల్లని దంతయు నీరు అగునా !

50. Haste makes waste
తొందరపడి ఏ పని చేయరాదు.

51. Do not look a gift horse in the mouth
దాన మిచ్చిన ఆవు పళ్ళను పట్టి చూచినట్లు. ( పుణ్యానికి పుట్టెడిస్తే పిచ్చుకుంచె మని పోట్లాడినట్లు )

52. Make hay while the sun shines
దీప ముండగనే ఇల్లు చక్కబెట్టుకో.

53. Keep your mind from evil thought
దురాలోచనలు చేయకుము.

54. Distance lends enchantment to the view
దూరపు కొండలు నునుపు.

55. Everybody is wise after the event
దొంగలు పడిన ఆరు నెలలకు కుక్కలు మొరిగినట్లు.

56. Make the best of a bad bargain
నాశన మగునపుడు నిలచినది నిక్షేపము,

57. Empty vessels make the most sound
నిండు కుండ తొణకదు.

58. Do unto others as you would wish to be done by others

నీ ప్రాణం నీ కెంత తీపో పరుల కంతే ననుకొనుము.

59. Hold integrity sacred

న్యాయబుద్ధి పవిత్రమైనదిగా భావించుము.

60. Familiarity breeds contempt

పండుగనాడు కూడ పాత మొగుడేనా !

61. Slow and steady wins the race

పరుగెత్తి పాలు త్రాగేకన్నా
నిలబడి నీరు త్రాగుట మంచిది.

62. Rome was not built in a day

పుట్టుకలోనే ఆవకాయ ముద్ద.

63. Every tide has its ebb.

పెరుగుట విరుగుట కొరకే.

64. Bare words buy no barely

మంత్రాలకు చింతకాయలు రాలునా !

65. Too much of anything is good for nothing

మితము తప్పితే అమృతమైనా విషం.

66. Good wine needs no bush

ముంజేతి కంకణమునకు అద్దమేల ? (జగమెరిగిన బ్రాహ్మణు
నకు జందెమేల ? )

67. All that glitters is not gold

మెరిసే దంతా బంగారం కాదు.

68. The child is father of the man
మొక్కై వంగనిది మ్రానై వంగునా!

69. Truth finds foes, where it makes none
యథార్థవాది లోక విరోధి.

70. Birds of the same feather flock together
రత్నాలన్నీ ఒకచోట చేరితే నత్తగుల్లలన్నీ మరొక ప్రక్క చేరినట్లు.

71. God stays long but strikes at last
రాజు వెంటనే చంపును. దైవము నిదానించి చంపును.

72. A bird in the hand is worth two in the bush
రేపటి విందు కంటె నేటి గంజే మేలు.

73. Look before you leap
లోతెరుగక నీట ప్రవేశింపకుము.

74. Honesty is the best policy
సత్యమే దైవము.

75. Strike while the iron is hot
సమయానికి లేని తెలివి నిరుపయోగము.

76. An idle man's brain is a devil's workshop
సోమరి తల దయ్యాల కొంప.

77. East or west, home is best
స్వగృహమే స్వర్గసమము.

78. Power goes with power
అధికారం ధనం వెంట పోతుంది.

79. When prestige is in, progress is out
అభిమానం లోపల ప్రవేశిస్తే, అభివృద్ధి బయటకు పోతుంది.

80. A lie travels round the world, while truth is putting on her boots
సత్యం చెప్పులు తొడుక్కొనే లోగా, అసత్యం భూ ప్రదక్షిణం చేసి వస్తుంది.

81. Success covers multitude of blunders
విజయం అసంఖ్యాకములైన తప్పులను దాచివేస్తుంది.

82. An open door may tepmt a saint
తెఱచియున్న ద్వారము సన్యాసిని సహితం ప్రలోభపెట్టవచ్చు.

83. Not failure, but low aim is crime
విఫలం కావడం నేరంకాదు, చిన్నఆశయం పెట్టుకోవడమే నేరం.

84. An obedient wife commands her husband
విధేయతగల భార్య భర్తను శాసిస్తుంది.

85. Beggar's bag has no bottom
యాచకుని సంచికి అడుగుండదు.

86. Tomorrow is thc day on which idle men work
రేపు అనేది సోమరులు పని చేసే రోజు.

87. Idleness is hunger's mother, and of theft it is first brother
సోమరితనము ఆకలికి తల్లి మరియు దొంగతానానికి పెద్ద సోదరుడు.

88. Pleasant company alone makes this life tolerable
సత్సాంగత్యము వల్ల మాత్రమే జీవితాన్ని భరించగలం.

89. Friendship multiplies joys and divides griefs
స్నేహము దుఃఖాన్ని భాగిస్తుంది, ఆనందాన్ని హెచ్చిస్తుంది.

90. Character is nine points in education
సచ్ఛీలమే తొమ్మిది పాళ్లు విద్య.

91. Character is three-fourth religion
సచ్ఛీలమే మూడుపాళ్ళు మతము.

92. Truth sits on the lips of dying men
సత్యము చనిపోయే మనుష్యుల పెదిమలపై కూర్చొని వుంటుంది.

93. A full purse never lacks friends
కలిగినవాని కంతా చుట్టాలే.

94. No smoke without fire
విత్తులేనిదే చెట్టు మొలవదు.

95. The remedy is worse than the disease
కొండనాలుకకు మందువేస్తే, ఉన్ననాలుక ఊడిపోయినట్లు.

96. Still waters run deep
నిండుకుండ తొణకదు.

97. Dare to struggle, dare to win
ధైర్యే సాహసే లక్ష్మి

98. Greed leads to ruin
దురాశ దుఃఖమునకు చేటు.

99. It is difficult to hide the truth long
సత్యాన్ని శాశ్వతంగా దాచలేము.

100. Where there is pain there is gain
కష్టే ఫలి.

101. Put your trust in God, misfortune will pass
దేవుని నమ్ముకుంటే కష్టకాలం అదే గడచిపోతుంది.

102. Do not proud of your riches
మీ సంపదకు గర్వించవద్దు.

103. Do not use harsh words for anybody
ఎవ్వరితో పరుషంగా మాట్లాడవద్దు.

104. Exercise is a panacea for all physical ailments.
వ్యాయామము అన్ని జబ్బులకు సరయిన మందు.

105. After lunch sleep a while, after dinner walk a mile
మధ్యాహ్నము భోజనం తరువాత విశ్రాంతి, రాత్రి భోజనం తరువాత ఒక మైలు నడవాలి.

106. Giving way to anger is a sign of weakness
కోపము బలహీనతకు గుర్తు.

107. To rest is to rust
విశ్రాంతి అంటే తుప్పు పట్టినట్టే.

108. Justice delayed is justice denied
న్యాయం జరగడంలో ఆలస్యమయితే న్యాయం జరగనట్టే.

109. Do not speak ill of others
ఇతరులను గురించి చెడుగా మాట్లాడవద్దు.

110. Always keep the idiots off you
మూర్ఖులను దగ్గరకు చేరనీయవద్దు.

111. Do not lend, for a loan often loses both itself and a friend
అరువు ఇవ్వవద్దు. డబ్బు, స్నేహం రెండూ పోవచ్చు.

112. Idleness is the root cause of all ills
సోమరితనము అన్ని చెడులకు మూలం.

113. Every ass loves his bray
కాకిపిల్ల కాకికి ముద్దు.

114. Give a dog a bad name and hang him
ఎవరినైనా చంపాలంటే చెడ్డపేరుపెట్టి మరీ చంపు.

115. Society moulds man
సమాజం మానవునిలో మార్పు తెస్తుంది.

116. Fools praise fools
బుద్ధిహీనులు, బుద్ధిహీనులను పొగడుతూ వుంటారు.

117. Many heads many minds
పుర్రె కొక ఆలోచన

118. Truth prevails
నిజం నిలకడమీద తేలుతుంది.

119. Give a loan, an enemy own
అప్పిచ్చావో, శత్రువును కొనుక్కున్నట్టే.

120. Silence is half commitment
మౌనం అర్ధాంగీకార సూచన.

121. A man is a slave to his stomach
కూటికోసం కోటి విద్యలు.

122. A dog is a lion in his lane
ఏ వీధి కుక్క ఆ వీధికి సింహం.

123. A burnt child dreads the fire
చేయికాలిన బిడ్డకు నిప్పంటే భయం.

124. A honey tongue, a heart of gall
పయోముఖ విషకుంభం.

125. All's well that ends well
ముగింపు బాగుంటే అంతా బాగున్నట్టే.

126. Style makes the man
తీరునుబట్టి మనిషిని తెలుసుకోవచ్చు.

127. One nail drives another
ముల్లును ముల్లుతోనే తీయాలి.

128. Quick believers need broad shoulders
మాటలు త్వరగా నమ్మేవారు అందరి ఆరోపణలకు గురవుతారు.

129. One lie leads to another
ఒక అబద్ధానికి నూరు అబద్ధాలు చెప్పాలి.

130. Think before you speak
మాట్లాడే ముందు ఆలోచించండి.

131. Be a good listener
ఎవరు చెప్పినా వినండి.

132. Be friendly but not familiar
స్నేహం చూపండిగాని సన్నిహితం కావద్దు.

133. Punishment can be overcome by wit
ఉపాయముతో శిక్షను తప్పించుకొనవచ్చును. ( ఉపాయముతో అపాయమునుండి తప్పించుకొన వచ్చును )

134. Do not build castles in the air
గాలిలో మేడలు కట్టకుము.

135. A wise enemy is far better than a foolish friend
తెలివి తక్కువ మిత్రుడికన్న తెలివిగల విరోధి మేలు.

136. Misfortune does not come single
కష్టములు ఒంటరిగా రావు.

137. Do not play tricks on anyone.
ఎవరితోను పరిహాసము లాడకుము.

138 By presence of mind, one can avert disaster
బుద్ధిబలముచే ఆపదలను తప్పించుకొన వచ్చును.

139. Too much of merriment is dangerous
అమితానందం ప్రమాదకరం

140. Contentment is better than riches
సంపదకన్న సంతృప్తి గొప్పది.

141. Kindness creates affection even on brutes
దయ, బుద్ధిహీనులయందు సైతము అనురాగమును కల్గించును.

142. Co-operation achieves happier results than individual efforts
వ్యష్టి ప్రయత్నం కన్న సమిష్టిసహకారం సత్ఫలితముల నిచ్చును.

143. Empty vanity may lead to danger
అహంకారం ప్రమాదమునకు దారితీయును.

144. One cannot escape the results of one's evil intentions
ఏ ఒక్కడూ తన దుష్కృత్యములనుండి తప్పించుకొన లేడు.

145. Do not think none else is cleverer than you
ఏ ఒక్కరూ నీకన్న తెలివిగలవారు కారని భావించకుము.

146. It is better to know one trade perfectly than to know a little of several trades
వివిధ విషయముల యందు అల్పజ్ఞానము కలిగియుండుటకన్న ఒకే విషయమందు పరిపూర్ణ జ్ఞానం కలిగియుండుట మేలు.

147. Truth will out sooner or latter
నిజం నిలకడ మీాద బయటపడును. (నిజం ఎక్కువకాలం దాగదు)

148. Forgiveness is the noblest revenge
కక్ష సాధించుట కంటే క్షమాగుణమే ఉత్తమోత్తమం.

149. One cannot deceive for long
ఎల్లకాలము మోసగించలేము.

150. Wicked men ruin themselves by their action
దుర్మార్గులు వారి దుశ్చర్యలవలననే అంతమొందుదురు.

151. Evil to him who will thinks
చెడుతలపెట్టు వాడే చెడును. (చెరపకురా చెడెదవు)

*

"National integration cannot be built by brick and mortor, by chisel and hammer, But it has to grow silently in the minds and hearts of men."

జాతీయసమైక్యతా సౌధనిర్మాణం కేవలము ఇటుక, అడుసులతోగాని, సుత్తి, ఉలిలతోగాని కాజాలదు, అది మానవ మస్తిష్క హృదయాలలో నిదానముగా పెంపొందవలెను.

— డా. సర్వేపల్లి రాధాకృష్ణ

# బాల
# విజ్ఞానకోశము
## అష్టమ భాగము
## ప్రశ్నలు - సమాధానములు

# ప్రశ్నలు

1. రామాయణమును సంస్కృతంలో వ్రాసిన దెవరు ?
2. భారతమును సంస్కృతములో వ్రాసిన దెవరు ?
3. భారతమును మొదట తెనిగించిన దెవరు ? వారి నేమందురు ?
4. భగవద్గీత ఎవరు, ఎవరికి, ఎక్కడ బోధించారు ?
5. 'వందేమాతరం' జాతీయ గీతమును వ్రాసిన దెవరు ?
6. 'జన గణ మణ' ను ఎవరు వ్రాసారు ?
7. భారత దేశ ప్రథమ రాష్ట్రపతి ఎవరు ?
8. భారత దేశ తొలి ప్రధానమంత్రి ఎవరు ?
9. పాండవులు ఎంతమంది ? వారి పేర్లు ?
10. పాండవులు ఎవరు, ఏ తల్లికి జన్మించారు ?
11. దశరథుని పుత్రుల పేర్లు ? ఎవరు ఏ తల్లికి జన్మించారు ?
12. భారత దేశ ద్వితీయ రాష్ట్రపతి ఎవరు ?
13. భారత దేశ ద్వితీయ ప్రధానమంత్రి ఎవరు ?
14. భారత దేశ ముఖ్యపట్టణ మేది ?
15. మన రాష్ట్ర ముఖ్యపట్టణ మేది ?
16. పాకిస్థాన్ ముఖ్యపట్టణ మేది ?
17. బంగ్లా దేశ్ ముఖ్యపట్టణ మేది ?
18. గోదావరినది ఎక్కడ పుట్టినది ?
19. కృష్ణానది జన్మస్థల మేది ?
20. పాండవులకు, కౌరవులకు యుద్ధం ఎక్కడ జరిగింది ? ఎన్ని రోజులు ?
21. మన రాష్ట్రంలో బొగ్గుగనులు ఎక్కడ వున్నాయి ?
22. మన దేశంలోని ఓడ రేవులలో అతి సహజమైన దేది ?
23. మన రాష్ట్రంలో కృష్ణానదీతీరంలోవున్న పుణ్యక్షేత్రము లేవి ?

24. తిరుమల – తిరుపతి ఏ జిల్లాలో వున్నది ?
25. శ్రీశైలం ఏ జిల్లాలో వున్నది ?
26. మన తెలుగుదేశమునకు మరొక పేరు ఏమిటి ? అది ఎలా వచ్చింది ?
27. బౌద్ధమత స్థాపకు లెవరు ? అతని అసలు పేరు ఏమిటి ?
28. శిక్కు మతమును స్థాపించిన దెవరు ?
29. శివాజి గురువుపేరు ఏమిటి ? ఆయన ఆరాధ్య దేవత ఎవరు ?
30. కాకతీయ సామ్రాజ్యం ముఖ్య పట్టణ మేది ?
31. హైద్రాబాద్‌కు మరొక పేరు ఏమిటి ?
32. నెల్లూరు పట్టణమునకు గల మరొక పేరు ఏమిటి ?
33. మనరాష్ట్రంలో పెద్ద పేపరు మిల్లులు ఎక్కడ వున్నవి ?
34. మనరాష్ట్రంలో పెద్ద పంచదార మిల్లులు ఎక్కడ వున్నవి ?
35. మనరాష్ట్రంలో పలకల పరిశ్రమ ఎక్కడ వున్నది ?
36. మనరాష్ట్రంలోని విశ్వవిద్యాలయముల పేర్లు ? అవి ఎక్కడ వున్నవి ?
37. మనరాష్ట్రంలో వైద్యకళాశాలలు ఎక్కడ వున్నవి ?
38. కాశీ, ప్రయాగలు ఏ రాష్ట్రంలో వున్నవి ?
39. త్రివేణీసంగమం ఎక్కడ వున్నది ? దాని కా పేరు ఎలా వచ్చింది ?
40. రామేశ్వరం ఏ రాష్ట్రంలో వున్నది ? అక్కడ దేవుడి పేరు ఏమిటి ?
41. మహమ్మదీయ మతమును స్థాపించిన దెవరు ? వారి మత గ్రంథ మేది ?
42. క్రైస్తవ మతమును స్థాపించిన దెవరు ? వారి మత గ్రంథ మేది ?
43. నేతాజి స్థాపించిన సంస్థ ఏది ?
44. భారతదేశ తృతీయ ప్రధానమంత్రి ఎవరు ?

45. భారతదేశ తృతీయ రాష్ట్రపతి ఎవరు ?
46. విదేశాలలో విస్తృతంగా హిందూ ధర్మాన్ని ప్రబోధించిన సన్యాసి ఎవరు ? ఆయన గురువు పేరు ?
47. మహాత్మాగాంధీ ఏ రాష్ట్రంలో, ఏ గ్రామంలో పుట్టెను ? ఆయన పూర్తి పేరు ?
48. మద్రాసు నుంచి మనరాష్ట్రం ఎప్పుడు విడిపోయింది ? తాత్కాలిక రాజధాని ఎక్కడ పెట్టారు ? తొలి ముఖ్య మంత్రి ఎవరు ?
49. ఆంధ్రప్రదేశ్ ఎప్పుడు అవతరించింది ? తొలి ముఖ్య మంత్రి ఎవరు ?
50. 'ఆంధ్రపితామహ' ఎవరు ? వారు జన్మించిన గ్రామం, తాలూకా, జిల్లా ఏమిటి ?
51. అమెరికా ముఖ్యపట్టణ మేది ?
52. రష్యా ముఖ్యపట్టణ మేది ?
53. భారతంలో ఎన్ని పర్వములు కలవు ? అవి ఏవి ?
54. శాకుంతలమును రచించిన సంస్కృత మహాకవి ఎవరు ?
55. తెలుగు నైషధం రచించిన దెవరు ? సంస్కృతంలో ఎవరు రచించిరి ?
56. భాగవతమును సంస్కృతంలో వ్రాసిన దెవరు ? తెనిగించిన దెవరు ?
57. భర్తృహరి సుభాషితములను తెనిగించిన దెవరు ?
58. తెలుగు నెలల పేర్లు ?
59. ఇంగ్లీషు నెలల పేర్లు ?
60. ఋతువు లెన్ని ? అవి ఏవి ?
61. చైనా ముఖ్యపట్టణం ఏది ?
62. వేదము లెన్ని ? అవి ఏవి ?
63. వేదాంగము లెన్ని ? అవి ఏవి ?

64. ఉపాంగము లెన్ని ? అవి ఏవి ?
65. యుగము లెన్ని ? అవి ఏవి ?
66. తెలుగు తిథు లెన్ని ? అవి ఏవి ?
67. తెలుగు నక్షత్రము లెన్ని ? అవి ఏవి ?
68. తెలుగు రాసులెన్ని ? అవి ఏవి ?
69. నవగ్రహముల పేర్లు ?
70. సప్తఋషుల పేర్లు ?
71. దిక్కు లెన్ని ? అవి ఏవి ?
72. అష్టదిక్పాలకుల పేర్లు ?
73. అష్టదిక్పాలకుల పట్టణముల పేర్లు ?
74. అష్టదిక్పాలకుల భార్యల పేర్లు ?
75. అష్టదిక్పాలకుల ఆయుధముల పేర్లు ?
76. అష్టదిక్పాలకుల వాహనముల పేర్లు ?
77. అష్టదిగ్గజముల పేర్లు ?
78. అష్టదిగ్గజముల భార్యల పేర్లు ?
79. త్రిమూర్తుల పేర్లు ?
80. పురుషార్థములెన్ని ? అవి ఏవి ?
81. ఆశ్రమములు ఎన్ని ? అవి ఏవి ?
82. పంచభూతము లేవి ?
83. జ్ఞానేంద్రియము లెన్ని ? అవి ఏవి ?
84. కర్మేంద్రియము లెన్ని ? అవి ఏవి ?
85. పంచకావ్యము లేవి ?
86. షడ్రసము లేవి ?
87. అరిషడ్వర్గము లేవి ?
88. షట్ఛాస్త్రము లేవి ?
89. షట్చక్రవర్తుల పేర్లు ?
90. అష్టైశ్వర్యములు ఏవి ?

91. అష్టభోగము లేవి ?
92. నవబ్రహ్మ లెవరు ?
93. నవరసము లేవి ?
94. నవరత్నము లేవి ?
95. నవధాన్యము లేవి ?
96. శ్రీకృష్ణుని కథ ఏ గ్రంథమందు కలదు ?
97. భాగవత కథను ఎవరు, ఎవరికి చెప్పిరి ?
98. శ్రీకృష్ణుని తల్లి దండ్రు లెవరు ?
99. శ్రీకృష్ణ బలరాములు ఎవరివద్ద విద్య నేర్చుకొనిరి ?
100. భాగవత భాగముల నేమందురు ? అవి ఎన్ని ?
101. త్రిమూర్తుల వాహనముల పేర్లు ?
102. త్రిశూలము ఎవరి ఆయుధము ?
103. విష్ణువు చక్రము పేరు ఏమి ?
104. అవతారములెన్ని ? అవి ఏవి ?
105. దేవతల గురువు ఎవరు ?
106. రాక్షసుల గురువు ఎవరు ?
107. త్రిగుణము లేవి ?
108. 'ఆచార్యత్రయ' మనగా నెవరు ?
109. ఆచార్యత్రయం ప్రబోధించిన సిద్ధాంతము లేవి ?
110. శంకరాచార్యుని తల్లి దండ్రు లెవరు ?
111. శంకరాచార్యుని గురువు ఎవరు ?
112. శంకరాచార్యులు రచించిన గ్రంథము లేవి ?
113. రామానుజాచార్యుల తల్లి దండ్రు లెవరు ?
114. రామానుజాచార్యులు రచించిన గ్రంథము లేవి ?
115. మధ్వాచార్యులు తల్లి దండ్రు లెవరు ?
116. మధ్వాచార్యులు రచించిన గ్రంథము లేవి ?

117. ప్రపంచములో ప్రచారమునగల మతముల పేర్లు, వాటి మత చిహ్నములను పేర్కొనుము ?
118. బౌద్ధమతగ్రంథ మేది ?
119. భారతదేశ చతుర్థ రాష్ట్రపతి ఎవరు ?
120. భారతదేశ చతుర్థ ప్రధానమంత్రి ఎవరు ?
121. భారతదేశ ఐదవ రాష్ట్రపతి పేరు? ప్రస్తుత రాష్ట్రపతి ఎవరు ?
122. కాశీవిశ్వవిద్యాలయ సంస్థాపకు లెవరు ?
123. ఆర్యసమాజ స్థాపకు లెవరు ?
124. స్వామిదయానంద వ్రాసిన గ్రంథ మేది ?
125. బ్రహ్మసమాజ స్థాపకు లెవరు ?
126. ఏ గ్రంథమును పంచమవేద మందురు ?
127. దక్షిణ భారతదేశ నదులలో పొడవైన నది ఏది? దాని పొడవు ఎంత ?
128. ఆంధ్రప్రదేశ్ వైశాల్యం ఎంత ?
129. నాగార్జునసాగర్ డాం ఏ నదిమీద కట్టారు ?
130. భాక్రానంగల్ ప్రాజక్టు ఏ రాష్ట్రంలో, ఏ నదిమీద వున్నది ?
131. 'స్వరాజ్యం నా జన్మహక్కు' అని నినాదం యిచ్చిన జాతీయ నాయకు డెవరు ?
132. రవీంద్రనాథటాగూర్ వ్రాసిన ప్రసిద్ధికెక్కిన పుస్తకం ఏది ?
133. కాళిదాసమహాకవి వ్రాసిన ప్రముఖ గ్రంథము లేవి ?
134. అమెరికా ఖండమును మొదటగా ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
135. సముద్రమార్గంద్వారా మొదట ఇండియాకు చేరిన దెవరు? ఎప్పుడు ?
136. ఆటంబాంబును కనుగొన్న దెవరు ? ఎప్పుడు ?
137. యునైటెడ్ నేషన్స్‌కు అధ్యక్షస్థానం అలంకరించిన ప్రథమ భారతీయు లెవరు ?

138. ఎత్తైన పర్వత శిఖరం ఏది? దాని ఎత్తెంత?
139. ప్రపంచంలో పొడవైన నది పేరు? పొడవు?
140. ప్రపంచంలో అన్నిటి కన్నా పెద్ద ఎడారి పేరు? దాని విస్తీర్ణం ఎంత?
141. బట్టల మిల్లులు ఎక్కువగానున్న పట్టణం ఏది?
142. చెప్పుల పరిశ్రమలు ఎక్కువగానున్న పట్టణం ఏది?
143. టీ తోటలు ఎక్కువగానున్న ప్రదేశం ఏది?
144. మనదేశంలో బంగారపు గనులు ఎక్కడ వున్నవి?
145. 'గేట్ వే ఆఫ్ ఇండియా' ఎక్కడ వున్నది? ఎప్పుడు, ఎందుకు కట్టించారు?
146. శాంతిని కేతన్ ఏ రాష్ట్రంలో వున్నది? ఎవరు స్థాపించారు?
147. డండం విమానాశ్రయం ఎక్కడ వున్నది?
148. ఫాలం విమానాశ్రయం ఎక్కడ వున్నది?
149. శాంతాక్రుజ్ విమానాశ్రయం ఎక్కడ వున్నది?
150. శ్రీలంక ముఖ్యపట్టణం ఏది?
151. మనదేశానికి స్వాతంత్ర్య మెప్పుడు వచ్చినది?
152. భారత్ ఎప్పుడు 'రిపబ్లిక్' గా అవతరించింది?
153. ఆంధ్రప్రదేశ్ ద్వితీయ ముఖ్యమంత్రి ఎవరు?
154. నేపాల్ ముఖ్యపట్టణం ఏది?
155. మనరాష్ట్రంలో ఎన్ని జిల్లాలున్నవి? అవి ఏవి?
156. విజయనగరసామ్రాజ్యమును ఎవరు స్థాపించిరి? వారి గురు వెవరు?
157. ప్రపంచం ఎన్ని ఖండములుగా విభజించబడినది? అవి ఏవి?
158. మనదేశము ఏ ఖండములో నున్నది?
159. ఆంధ్రప్రదేశ్ తృతీయ ముఖ్యమంత్రి ఎవరు?
160. భారతరాజ్యాంగమును రచించిన దెవరు?
161. భారత జాతీయ జెండాను రూపొందించిన ఆంధ్రు డెవరు?

162. 'బార్డోలి సత్యాగ్రహము' ను నడిపిన జాతీయ నాయకుని పేరు ఏమి?
163. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఎప్పుడు జరిగింది?
164. ప్రపంచంలో అందమైన పట్టణం ఏది?
165. భారతదేశమందు ఇనుము, ఉక్కు కర్మాగారములు ఎక్కడ వున్నవి?
166. స్వదేశీ సంస్థానములను విలీనంచేసిన దెవరు?
167. భారతదేశంలో గవర్నరుగా పనిచేసిన మొదటి స్త్రీ ఎవరు?
168. ప్రథమ భారత స్వాతంత్ర్య సమరమున పాల్గొన్న వీర వనిత ఎవరు?
169. హోం రూల్ ఉద్యమమును స్థాపించిన దెవరు?
170. జలియన్ వాలా బాగ్ లో హత్యలు చేయించిన ఆంగ్లేయుడు ఎవరు? ఎప్పుడు?
171. బర్మాదేశము రాజధానిపేరు ఏమిటి?
172. భారతదేశములోని రాష్ట్రముల సంఖ్య?
173. ఇండియా మొదటి గవర్నరు జనరల్ ఎవరు?
174. బ్రిటిష్ ఇండియా ఆఖరి గవర్నరు జనరల్ ఎవరు?
175. సతీసహగమనమును నిర్మూలించవలసినదిగా ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చిన భారతీయు డెవరు? ఎవరి కాలములో?
176. ఆంధ్రప్రదేశ్ లో ముద్రించబడుతున్న ప్రముఖ తెలుగు దినపత్రికలు ఏవి?
177. ఆంధ్రప్రదేశ్ లో ముద్రింపబడుతున్న ప్రముఖ ఇంగ్లీషు దినపత్రికలు ఏవి?
178. ఆంధ్రప్రదేశ్ చతుర్థ ముఖ్యమంత్రి ఎవరు?
179. ఆంధ్రరాష్ట్రం కోసం ఆత్మబలిదానం చేసుకున్న మహానీయు డెవరు?
180. కృష్ణాపత్రిక ప్రముఖ సంపాదకు లెవరు?

181. స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న కొంతమంది విప్లవ వీరుల పేర్లు ?
182. భూమి ఒకసారి సూర్యునిచుట్టూ తిరగడానికి ఎన్నిరోజులు పట్టును ?
183. భూమి తనచుట్టూ తాను తిరగడానికి ఎన్ని గంటలు పట్టును ?
184. పెన్నానది ఎచట పుట్టుచున్నది ?
185. 'ఆదికవి' అని ఎవరికి పేరు కలదు ?
186. 'దేశభాష లందు తెనుంగు లెస్స' అనిన దెవరు ?
187. ప్రముఖ సర్వోదయనాయకు లెవరు ?
188. 'కవిసామ్రాట్' బిరుదు ఎవరికి కలదు ?
189. ఆంధ్రప్రదేశ్ పంచమ ముఖ్యమంత్రి ఎవరు ?
190. మనరాష్ట్రమునకు స్త్రీ గవర్నరుగా పనిచేసిన దెవరు ?
191. శ్రీకృష్ణదేవరాయలు తెలుగులో వ్రాసిన గ్రంథ మేది ?
192. రాయలు ఆస్థానమందలి కవుల నేమందురు ?
193. 'ఆంధ్రభోజుడు' అని బిరుదు ఎవరికి కలదు ?
194. 'మనుచరిత్ర' ను వ్రాసిన దెవరు ?
195. 'అయోధ్య' ఏ నది ఒడ్డున నున్నది ?
196. అన్నిటికన్నా ఉన్నతమైన న్యాయస్థానం ఏది ?
197. మనదేశంలో లోకప్రసిద్ధిగన్న శాస్త్రజ్ఞు లెవరు ?
198. పలనాటి వీరు డెవరు ?
199. కాకతీయ సామ్రాజ్య మేలిన వీరవనిత ఎవరు ?
200. శ్రీకృష్ణదేవరాయలు మంత్రి ఎవరు ?
201. భారతదేశంలో ప్రముఖ ఇంజనీరు పేరు ?
202. అజంతా, ఎల్లోరా గుహాలు ఎక్కడ ఉన్నవి ?
203. 'కుతుబ్ మినార్' స్తంభం ఎక్కడ వున్నది ?
204. 'మహాబలిపురం' ఎక్కడ వున్నది ? ఏ రాజుల కాలంలో నిర్మించబడింది ?

205. తాజ్ మహల్ ఎక్కడ వున్నది? ఎవరు కట్టించిరి?
206. ప్రపంచంలోకెల్లా పొడవైన రైల్వే ప్లాట్‌ఫారం ఏది?
207. కాంతివేగమును ఎవరు, ఎప్పుడు కనిపెట్టిరి?
208. 'ఫౌంటెన్ పెన్' ను ఎవరు, ఎప్పుడు కనిపెట్టిరి?
209. 'హనిమాన్' దేనిని కనిపెట్టెను?
210. తొలిసారిగా మానవనిర్మిత ఉపగ్రహాన్ని భూమిచుట్టూ గల కక్ష్యలోనికి ఎవరు, ఎప్పుడు ప్రవేశపెట్టిరి?
211. 'రివాల్వర్' ను కనిపెట్టిన దెవరు?
212. మానవనిర్మిత జలాశయా లన్నిటిలో పెద్దది ఏది?
213. మిలటరీ టాంకును కనిపెట్టిన దెవరు?
214. ఐక్యరాజ్యసమితి మొదటి ప్రధాన కార్యదర్శి ఎవరు?
215. ప్రపంచంలో అతి పొడవైన బ్రిడ్జి ఎక్కడున్నది?
216. ప్రపంచ భాషలలో తెలుగు ఎన్నో స్థానము ఆక్రమించింది?
217. హిందీ కవి 'ప్రేమ్‌చంద్' అసలు పేరు ఏమిటి?
218. 'ఆక్సిజన్' ను కనుగొన్న దెవరు?
219. 'పియానో' కనుగొన్న దెవరు?
220. 'టెలివిజన్' ను కనుగొన్న దెవరు?
221. అత్యధిక వర్షపాతానికి పేరు పొందిన 'చిరపుంజి' మన దేశంలో ఎక్కడ వున్నది?
222. జంతువు లన్నింటిలో అత్యంత నిదానంగా నడిచేది ఏది?
223. సూర్యునికి అన్ని గ్రహాలకంటే దగ్గరనున్న గ్రహమేది?
224. 'గార్డెనర్' వ్రాసిన సుప్రసిద్ధ భారతీయకవి ఎవరు?
225. రెండవ ప్రపంచ యుద్ధంలో మిత్రరాజ్యాల సేనలకు సుప్రీం కమాండర్‌గా పనిచేసిన దెవరు?
226. ప్రపంచ ప్రసిద్ధిగాంచిన 'ధవళగిరి' పర్వతశిఖరం ఎక్కడ వున్నది?
227. తొలిసారిగా 'అణుబాంబు' ప్రేలుడును నిర్వహించిన దెవరు?

228. డీసెల్ ఇంజనును కనుగొన్న దెవరు ?
229. క్రీ. పూ. 4-వ శతాబ్దంలో 'ఏథెన్సు' పాలకులు విషం యిచ్చి చంపిన సుప్రసిద్ధ తత్వవేత్త ఎవరు ?
230. 'సితార్' వాయిద్యాన్ని ఎవరు రూపొందించారు.
231. అన్నిఖండాలలోకి పెద్దది ఏది ? చిన్నది ఏది ?
232. భూమిపై నివసించే జంతువులన్నిటిలోకి అతి పెద్ద జంతువేది ?
233. 'ది గ్రేట్ వే ఆఫ్ ఇండియా' గా పేరుపొందిన నగరమేది ?
234. 'ఎయిర్ కండిషన్' ను ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
235. అమెరికా తొలి అధ్యక్షు డెవరు ?
236. లోహముల కన్నిటిలోనికి అతి తేలికైన లోహమేది ?
237. ఒకే అంగంలో అన్ని జంతువులకంటే ఎక్కువ దూరాన్ని దూకగల జంతువేది ?
238. 'పతంజలి' ఎవరు ?
239. "స్ట్రెప్టోమైసన్" మందును కనుగొన్న దెవరు ?
240. అన్నింటిలోనికి గట్టి పదార్థమేది ?
241. పీఠభూములలోనికి ఎత్తైన పీఠభూమి ఏది ?
242. ఐక్యరాజ్యసమితిలో భారతదేశం ఎప్పుడు చేరినది ?
243. నదులన్నిటిలో పొడవైన నది ఏది ? ఎక్కడ వున్నది ?
244. 'బి' విటమిన్ ను కనుగొన్న దెవరు ?
245. తొలిసారిగా అణువిచ్ఛేదన చేసిన దెవరు ?
246. ఐక్యరాజ్యసమితిలో మొదటిసారిగా హిందీ ప్రసంగం చేసిన దెవరు ? ఎప్పుడు ?
247. 'మైక్రోఫోన్' కనుగొన్న దెవరు ?
248. ఇండియాలో 'ది సిటీ ఆఫ్ గోల్డెన్ టెంపుల్' గా పేరు పొందిన నగరమేది ?
249. ప్రపంచం మొత్తంమీద మంచినీటిసరస్సు లన్నిటిలోకి పెద్దది ఏది ?

250. జంతువులన్నిటిలోకి ఎక్కువ కాలం జీవించగల జంతువేది ?
251. ఇండియాలో చలనచిత్రాన్ని నిర్మించిన తొలి భారతీయు డెవరు ?
252. 'ఎలక్ట్రాన్' ను కనుగొన్న దెవరు ?
253. క్రీస్తు నిర్యాణం చెందినది ఎప్పుడు ?
254. ప్రపంచంలో కెల్ల అతి పెద్ద దేవాలయం ఏది ?
255. 'టెలిస్కోప్' ను కనుగొన్న దెవరు ?
226. 'ప్రవక్త మహమ్మద్' జన్మించింది ఎప్పుడు ?
257. ప్రపంచంలో అతి లోతైన సరస్సు ఏది ?
258. ద్వీపాలన్నిటిలోకి పెద్ద ద్వీపం ఏది ?
259. ప్రపంచంలో మిక్కిలి పెద్ద గంట ఏది ? ఎక్కడ వున్నది ?
260. కలరా, క్షయ క్రిములను తొలుత గుర్తించిన దెవరు ?
261. 'స్టెతస్కోప్' ను కనుగొన్న దెవరు ?
262. శాస్త్రజ్ఞులు తొలిసారిగా కనుగొన్న హార్మోన్ ఏది ?
263. ఆంగ్లేయుల ఈస్టు ఇండియా కంపెనీ ఏర్పడినది ఎప్పుడు ?
264. జంతువు లన్నింటిలో అత్యధిక వేగంతో పరుగెత్తగల దేది ?
265. 'కంప్యూటర్' ను కనుగొన్న దెవరు ?
266. ప్రపంచంలో నేలపై నివసించే జంతువులలో అన్నిటికంటే పొడవైన జంతువేది ?
267. కాళిదాసు వ్రాసిన 'శకుంతల' నాటకాన్ని తొలిసారిగా ఇంగ్లీషులోనికి తర్జుమా చేసిన దెవరు ?
268. అన్నిటిలోనికి పెద్ద పక్షి ఏది ?
269. మానవనిర్మిత రిజర్వాయర్లలో పెద్దది ఏది ?
270. 'రేజర్' కనుగొన్న దెవరు ?
271. శరీరంలో రక్తప్రసరణను తొలిసారిగా గుర్తించిన దెవరు ?
272. 'కుట్టుమిషన్' ను ఎవరు కనిపెట్టారు ?
273. జలపాతాలన్నిటిలోకి బాగా వెడల్పైన జలపాత మేది ?
274. ఇంగ్లండ్ తొలి ప్రధాని ఎవరు ?

275. 'లౌడ్‌స్పీకర్' ను ఎవరు కనుగొన్నారు?
276. ప్రపంచం మొత్తంమీద సరస్సు లన్నిటిలోకి పెద్ద దేది?
277. 'ఫోటోగ్రఫీ' ని తొలిసారిగా ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు?
278. ప్రపంచంలో కెల్లా గొప్పదిగా ఎంచబడిన నదీ ప్రవాహం ఏది?
279. గ్రహాలన్నింటిలోనికి పెద్ద గ్రహం ఏది?
280. 'డైనమో'ను, 'ట్రాన్స్‌ఫార్మర్'ను కనుగొన్న దెవరు, ఎప్పుడు?
281. మొట్టమొదటిసారిగా 'సినిమా' ను కనుగొన్న దెవరు ఎప్పుడు?
282. 'థార్' ఎడారి ఏ దేశంలో వున్నది?
283. 'హెలీకాప్టర్' ను ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు?
284. ప్రపంచ ప్రసిద్ధిచెందిన 'విక్టోరియా' జలపాతం ఏ ఖండంలో వున్నది.
285. ప్రపంచంలో మొట్టమొదటిసారిగా గుండె మార్పిడి శస్త్ర చికిత్స జరిపినది ఎవరు, ఎప్పుడు?
286. సముద్రాలన్నిటిలోనికి పెద్దది ఏది? చిన్నది ఏది?
287. ప్రపంచం మొత్తంలో నదులపైన నిర్మించిన డాము లన్నిటిలోకి అత్యంత పొడవైన డామ్ ఏది, ఎక్కడ వున్నది?
288. భారతీయ క్రికెట్ ఆటగాండ్లలో 'అర్జున్ అవార్డు' పొందిన దెవరు?
289. ప్రపంచం మొత్తంమీద అన్ని భవనాలకంటే ఎత్తైన భవనం ఏది, దాని ఎత్తు ఎంత?
290. భూమికి వున్న ఒకే ఒక్క ఉపగ్రహమేది?
291. మలేరియా నివారణకు వాడే 'డి. డి. టి.' ని ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు?
292. 'డిక్షనరీ ఆఫ్ ఇంగ్లీషు లాంగ్వేజ్ 'ని రూపొందించిన దెవరు?

293. 'మోటారు సైకిల్'ను ఎవరు, ఎప్పుడు తయారు చేశారు ?
294. చరిత్ర ప్రసిద్ధమైన 'ఫ్రెంచి విప్లవం' ప్రారంభమైనది ఎప్పుడు ?
295. విటమిన్ 'సి' ని ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
296. 'డైనమేట్' ను కనుగొన్న దెవరు ?
297. 'వాల్టా ఘటము'ను కనుగొన్న దెవరు, ఎప్పుడు ?
298. 'విద్యుత్ అయిస్కాంతము' ను కనుగొన్న దెవరు, ఎప్పుడు ?
299. 'గంధకము' ను కనుగొన్న దెవరు, ఎప్పుడు ?
300. 'హైడ్రోజన్ సల్ఫైడ్' ను కనుగొన్న దెవరు, ఎప్పుడు ?
301. 'అల్యూమినియం'ను కనుగొన్న దెవరు, ఎప్పుడు ?
302. 'అమ్మోనియా వాయువు' ను కనుగొన్న దెవరు, ఎప్పుడు ?
303. సూక్ష్మజీవుల ఉనికిని కనిపెట్టిన శాస్త్రవేత్త ఎవరు ?
304. భారతీయ భాషలపై తొలిసారిగా సర్వే జరిపిన దెవరు ?
305. ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవులను వరుసగా వ్రాయుము.
306. 'ఆవిరి ఇంజను'ను కనుగొన్నది ఎవరు, ఎప్పుడు ?
307. 'దూరదర్శిని' (టెలిస్కోప్‌ను) ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు?
308. 'టెలిఫోన్' ను ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
309. 'వైర్‌లెస్ టెలిగ్రాఫ్' ను ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
310. 'సూక్ష్మదర్శిని' (Compound Microscope) ని ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
311. 'మోటారుకారు'ను ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
312. గ్రుడ్డివారు చదువుటకు, వ్రాయుటకు వీలగు పద్ధతిని ఎవరు, ఎప్పుడు కనుగొనిరి ?
313. అచ్చు అక్షరముల తయారీని ఎవరు, ఎప్పుడు కనుగొనిరి ?
314. 'జలాంతర్గామి' (Submarine) ని ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
315. 'విద్యుద్దీపము' (Electric Bulb) ను ఎవరు, ఎప్పుడు కనుగొనిరి ?

316. 'స్టెయిన్‌లెస్ స్టీల్' ను ఏవరు, ఏప్పుడు కనుగొనిరి ?
317. 'ఏక్స్‌రే' ని ఎవరు, ఎప్పుడు కనుగొనిరి ?
318. 'రైలు ఇంజనును' ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
319. 'టేపు రికార్డర్' ను కనిపెట్టింది ఎవరు ?
320. 'బైసికిల్'ను ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
321. 'విమానము' ను ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
322. విమానము రాకలను తెలుసుకొనగల 'రాడార్' ను కనుగొన్న దెవరు ?
323. 'క్లోరోఫారమ్' ను ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
324. అమెరికా ఖండమును ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
325. 'గ్రామఫోన్' ను ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
326. ఇండియాకు నౌకామార్గమును ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
327. బ్రెజిల్ దేశమును, ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
328. ఉత్తర ధృవమును కనుగొన్న దెవరు, ఎప్పుడు ?
329. దక్షిణ ధృవమును ఏవరు, ఎప్పుడు కనుగొన్నారు ?
330. దక్షిణ ధృవమును భూమార్గంలో మొదట చేరిం దెవరు, ఎప్పుడు ?
331. మొదటి పానిపట్టు యుద్ధము ఎప్పుడు జరిగినది ?
332. రెండవ పానిపట్టు యుద్ధము ఎప్పుడు జరిగినది ?
333. హాల్దీఘాట్ యుద్ధము ఎప్పుడు జరిగినది ?
334. మొదటి, రెండవ, మూడవ కర్ణాటక యుద్ధములు జరిగిన సంవత్సరములు వరుసగా తెలియజేయుము.
335. ప్లాసీ యుద్ధము ఎప్పుడు జరిగినది ?
336. 'బక్సార్' యుద్ధము ఎప్పుడు జరిగినది ?
337. మొదటి సిక్కు యుద్ధము ఎప్పుడు జరిగినది ?
338. 'హోం రూల్' ఉద్యమం ఎప్పుడు, ఎవరు నిర్వహించిరి.

339. మాంచెంగ్ చెమ్సు ఫర్టు సంస్కరణములు ఎప్పుడు ప్రవేశ పెట్టబడినాయి ?
340. 'జాతీయపుష్పం' ఏది ?
341. 'వాటర్‌లూ' యుద్ధము ఎప్పుడు జరిగినది? ఎవరు జరిపించారు?
342. 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' ను స్థాపించిన దెవరు, ఎప్పుడు ?
343. 'నానాజాతిసమితి' ఎప్పుడు ఏర్పాటయింది ?
344. మొదటగా అణుబాంబు వేయబడిన ప్రదేశమేది, ఎప్పుడు ?
345. సూయజ్ కాలువను ఎవరు, ఎప్పుడు త్రవ్విరి? ఏ ఏ సముద్రములను కలుపుచున్నది, దానిపొడవు, వెడల్పు, లోతుఎంత ?
346. చంద్రమండలంమీద మొదటగా దిగిన దెవరు, ఎప్పుడు ?
347. భూమి ఆకర్షణ సిద్ధాంతమును కనుగొన్న దెవరు ?
348. రంగులు మారుస్తూ ప్రాకెడి జంతువు ఏది ?
349. 'గ్రేట్‌వాల్ ఆఫ్ చైనా' ను ఎవరు, ఎప్పుడు, ఎక్కడ నిర్మించారు? దాని పొడవు ఎంత ?
350. ప్రపంచంలోకల్లా ఎత్తయిన గోపురమేది ? ఎవరు, ఎక్కడ, ఎప్పుడు నిర్మించారు ? ఎత్తెంత ?
351. 'భారతీయజ్ఞానపీఠ అవార్డు' పొందిన ప్రథమరచయిత్రిఎవరు ?
352. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయముచే గౌరవ డాక్టరేట్ పట్టము పొందిన భారతీయ సినిమా దర్శకుడు ఎవరు ?
353. ప్రపంచంలో కెల్ల పెద్ద ఓడరేవు ఏది ?
354. భారతదేశంలో ఎత్తైన ఆనకట్ట ఏది ?
355. భారతదేశంలో ఎత్తైన జలపాతము ఏది ?
356. భారతదేశంలో పొడవైన వ్రేలాడు వంతెన ఏది ?
357. 'సిటీ ఆఫ సెవెన్ హిల్సు' అని ఏ పట్టణమును అందురు ?
358. ప్రపంచంలో పెద్ద ఓడ పేరు ఏమిటి ?
359. ఆంధ్రప్రదేశ్ ఆరవ ముఖ్యమంత్రి ఎవరు ?
360. ఆంధ్రప్రదేశ్ ఏడవ ముఖ్యమంత్రి ఎవరు ?

361. ప్రపంచంలో అధిక జనసాంద్రత గల పట్టణ మేది ?
362. ప్రపంచంలో పెద్ద నగరం ఏది ?
363. 'రోటరీ క్లబ్' ను ఎవరు, ఎప్పుడు, ఎక్కడ స్థాపించారు ?
364. 'రెడ్ క్రాస్ సొసైటీ'ను ఏవరు, ఏప్పుడు, ఏక్కడస్థాపించారు ?
365. 'ఐక్యరాజ్యసమితి' స్థాపించిన దెప్పుడు, ఏక్కడ ?
366. 'ప్రపంచ బ్యాంకు' స్థాపించిన దెప్పుడు, కేంద్ర కార్యాలయ మేది ?
367. 'ప్రపంచ ఆరోగ్య సంస్థ' (W. H. O.) స్థాపించిన దెప్పుడు? కేంద్ర కార్యాలయం ఏది ?
368. భారత దేశంలో వివేకానంద శిలా స్మారకము ఏక్కడవున్నది?
369. ప్రపంచంలో సినిమా పరిశ్రమకు ప్రసిద్ధిచెందిన నగర మేది ?
370. ఏసుక్రీస్తు జన్మస్థలం ఏది ?
371. టైఫాయిడ్ జ్వరమును కలిగించు సూక్ష్మజీవుల పేరేమిటి ?
372. మెగస్తనీస్ ఏవరు ?
373. ఒకప్పటి పరిషియా దేశాన్ని ఇప్పుడు ఏమని పిలుస్తున్నారు ?
374. 'ఏస్కిమోలు' అంటే ఏవరు ?
375. 'బ్రోకెన్ వింగ్' రచించిన దెవరు ?
376. 'పంచతంత్రము' ను రచించిన దెవరు ?
377. 'మీనంబాకం' విమానాశ్రయం ఎక్కడ వున్నది ?
378. 'బేగంపేట' విమానాశ్రయం ఎక్కడ వున్నది ?
379. కృష్ణానది ఎక్కడ పుట్టినది ?
380. గోదావరినది ఎక్కడ పుట్టినది ?
381. కావేరినది ఎక్కడ పుట్టినది ?
382. పోచంపాడు ప్రాజెక్టు ఎక్కడ వున్నది ?
383. తుంగభద్ర ప్రాజెక్టు ఎక్కడ వున్నది ?
384. 'ఆర్యభట్' అను కృత్రిమ ఉపగ్రహాన్ని అంతరిక్షంలోనికి ఎప్పుడు పంపారు ?

385. 'రోహిణి' ఉపగ్రహమును అంతరిక్షంలోనికి పంపిన దెప్పుడు? ఎక్కడ నుంచి?
386. 'ది రిపబ్లిక్' వ్రాసిన ప్రాచీన గ్రీకు తత్వవేత్త ఎవరు?
387. శ్రీలంకకు తొలి అధ్యక్షు డెవరు?
388. 'ఆంధ్ర కేసరి' పేరేమిటి?
389. 'పంజాబు కేసరి' గా పేరుగాంచిన దెవరు?
390. లండన్ ఏ నది ఒడ్డున వున్నది?
391. ప్రపంచంలో అతి పెద్ద ఖండము ఏది?
392. ప్రపంచంలో అతి చిన్న ఖండము ఏది?
393. ప్రపంచంలో పెద్ద ద్వీపము ఏది?
394. తాష్కెంట్ ఒడంబడిక ఎప్పుడు జరిగినది?
395. అతిపొడవైన రైల్వే ప్లాట్‌ఫారం ఏది?
396. ఇంగ్లీషులో కవిత చెప్పిన మొదటి భారతీయ మహిళ ఎవరు?
397. ఆంధ్రపత్రిక, భారతి మొదలకు పత్రికలను ప్రారంభించిం దెవరు? ఆంధ్రమహాసభ వారు వారికియిచ్చిన బిరుదు ఏమిటి?
398. తిరుపతి వేంకట కవులెవరు?
399. సూర్యుడు భూమధ్యరేఖ వద్ద ఎప్పుడు లంబంగా వుంటాడు?
400. ఆరావళి పర్వతాలు ఏ రాష్ట్రంలో వున్నాయి?
401. 'సూర్యుడు ఉదయించు భూమి' (Land of rising sun) అని దేనికి పేరు?
402. బ్రిటిష్ పార్లమెంటుకు ఎన్నికైన తొలి భారతీయు డెవరు?
403. తెలుగు జైమిని భారత కర్త ఏవరు?
404. తిరుపతి వేంకట కవుల సుప్రసిద్ధ రంగస్థల నాటకం ఏది?
405. మంగళవారంకు మరొక పేరు ఏమిటి?
406. 'గౌరవ' వ్రాసిన ద్విపదకావ్యం ఏది?
407. శివుడి చేతిన వున్న వాద్యం పేరు?
408. ప్రఖ్యాత హాస్య కవిపేరు ఏమిటి?
409. ఆదివారమునకు మరొక పేరు ఏమిటి?

# సమాధానములు

1. వాల్మీకి. 2. వ్యాసుడు. 3. నన్నయ, తిక్కన ఎఱ్ఱాప్రగడ : కవిత్రయ మందురు. 4. శ్రీకృష్ణుడు, అర్జునుడికి కురుక్షేత్ర మహా సంగ్రామంలో. 5. బంకించంద్ చటోపాధ్యాయ. 6. రవీంద్రనాథ్ టాగూర్. 7. బాబూ రాజేంద్రప్రసాద్. 8. జవహర్‌లాల్ నెహ్రూ. 9. ఐదుగురు. ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు. 10. ధర్మరాజు, భీముడు, అర్జునుడు కుంతీదేవికి ; నకుల సహదేవులు మాద్రికి. 11. శ్రీరాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు. శ్రీరాముడు కౌసల్యకు ; లక్ష్మణుడు, శత్రుఘ్నుడు సుమిత్రకు ; భరతుడు కైకేయికి. 12. సర్వేపల్లి రాధాకృష్ణన్. 13. లాల్‌బహదూర్ శాస్త్రి. 14. ఢిల్లీ. 15. హైద్రాబాద్. 16. ఇస్లామాబాద్. 17. ఢాకా. 18. నాసిక్ వద్ద త్రయంబకేశ్వర్. 19. మహాబలేశ్వర్. 20. కురుక్షేత్రం, 18 రోజులు. 21. కొత్తగూడెం, సింగరేణి, బెల్లంపల్లి. 22. విశాఖపట్నం. 23. అమరావతి, విజయవాడ, వేదాద్రి, శ్రీశైలం. 24. చిత్తూరు. 25. కర్నూలు. 26. త్రిలింగదేశము, శ్రీశైలము, కాళహస్తి, ద్రాక్షారామముల లోని లింగములవలన. 27. గౌతమబుద్ధుడు, సిద్ధార్థుడు. 28. గురు నానక్. 29. సమర్థరామదాసు, భవాని. 30. ఓరుగల్లు. 31. భాగ్యనగర్. 32. సింహపురి. 33. రాజమండ్రి, సిరిపుర్ కాగజ్‌నగర్, కర్నూలు, భద్రాచలం. 34. ఉయ్యూరు, చల్లపల్లి, బోధన్, తణుకు, చాగల్లు, పాలకొల్లు, భీమడోలు, సీతానగరం, బొబ్బిలి. 35. మార్కాపురం. 36. ఆంధ్ర విశ్వవిద్యాలయం – విశాఖపట్నం ; ఉస్మానియా విశ్వవిద్యాలయం–హైద్రాబాద్ ; కాకతీయ విశ్వవిద్యాలయం–వరంగల్ ; నాగార్జున విశ్వవిద్యాలయం గుంటూరు ; శ్రీ వేంకటేశ్వరా విశ్వవిద్యాలయం – తిరుపతి,

37. గుంటూరు, కాకినాడ, విశాఖపట్నం, కర్నూలు, తిరుపతి, వరంగల్, హైదరాబాద్. 38. ఉత్తరప్రదేశ్. 39. అలహాబాద్. గంగా, యమున, సరస్వతీ నదులు కలిసిన ప్రదేశము కాబట్టి. 40. తమిళనాడ్, రామలింగేశ్వరస్వామి. 41. మహమ్మద్ ప్రవక్త, ఖురాన్. 42. ఏసుక్రీస్తు, బైబుల్. 43. అజాద్ హిందూఫౌజ్. 44. శ్రీమతి ఇందిరాగాంధి. 45. జాకీర్ హుస్సేన్. 46. స్వామి వివేకానంద, రామకృష్ణ పరమహంస. 47. గుజరాత్‌లోని సౌరాష్ట్రం, పోరు బందర్, మోహన్‌దాస్ కరంచంద్ గాంధి. 48. 1953-వ సంవత్సరం అక్టోబరు-1. కర్నూలు. శ్రీ టంగుటూరి ప్రకాశం. 49. 1956-వ సంవత్సరం, నవంబరు-1. శ్రీ నీలం సంజీవ రెడ్డి. 50. శ్రీ మాడపాటి రామచంద్రరావు, పొక్కునూరు, నందిగామ తాలూకా, కృష్ణాజిల్లా. 51. వాషింగ్‌టన్. 52. మాస్కో. 53. 18 పర్వములు. అది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థాన, స్వర్గారోహణ పర్వములు. 54. కాళిదాసు 55. శ్రీనాథుడు, శ్రీ హర్షుడు 56. వ్యాసుడు, బమ్మెర పోతన 57. ఏనుగు లక్ష్మణకవి, యెలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మకవి 58. చైత్రం, వైశాఖం, జ్యేష్ఠం ఆషాఢం, శ్రావణం, భాద్రపదం, ఆశ్వీజం, కార్తీకం, మార్గశిరం, పుష్యం, మాఘం, ఫాల్గుణం 59. జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్, మే, జూన్, జూలై, ఆగస్టు, సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్, డిసెంబర్ 60. ఆరు. చైత్ర, వైశాఖ మాసములు-వసంతఋతువు ; జ్యేష్ఠ, ఆషాఢ మాసములు - గ్రీష్మఋతువు : శ్రావణ, భాద్రపద మాసములు - వర్షఋతువు : ఆశ్వీజ, కార్తీక మాసములు-శరదృతువు : మార్గశిర, పుష్యమాసములు హేమంతఋతువు : మాఘ, ఫాల్గుణ మాసములు - శిశిరఋతువు. 61. పేకింగ్. 62. నాలుగు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ

వేదము 63. ఆరు. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము 64. నాలుగు. ధర్మ, పురాణ, మీమాంస, న్యాయశాస్త్రములు 65. నాలుగు. కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము. 66. పదిహేను, పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, అమావాస్య లేక పూర్ణిమి 67. ఇరువైఏడు. అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము,ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి 68. పన్నెండు. మేషము, వృషభము, మిధునము. కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనస్సు, మకరము, కుంభము, మీనము 69. సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, రాహువు, కేతువు 70. కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వశిష్ఠుడు 71. యెనిమిది. తూర్పు, ఆగ్నేయమూల, దక్షిణము, నైరృతి మూల, పడమర, వాయువ్యమూల, ఉత్తరము, ఈశాన్యమూల 72. ఇంద్రుడు, అగ్ని,యముడు, నైరృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు, 73. అమరావతి, తేజోవతి, సంయమని, కృష్ణాంగన, శ్రద్ధావతి, గంధవతి, అలక, యశోవతి, 74. శచీదేవి, స్వాహాదేవి, శ్యామలాదేవి, దీర్ఘాదేవి, కాళికాదేవి, అంజనాదేవి, చిత్రరేఖ, పార్వతీదేవి 75. వజ్రము, శక్తి, దండము, కుంతము, పాశము, ధ్వజము, ఖడ్గము, త్రిశూలము 76. ఐరావతము, తగరు (పొట్టేలు), మహిషము, నరుడు, ముసలి, లేడి, గుఱ్ఱము, వృషభము, 77. ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము 78. అభ్రము, కపిల,

పింగల, అనుపమ. తామ్రపర్ణి, శుభ్రదంతి, అంగన, అంజనావతి 79. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు 80. నాలుగు. ధర్మము, అర్థము. కామము, మోక్షము 81. నాలుగు. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము 82. పృథ్వి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము 83. ఐదు. శ్రోత్రము, చక్షువు, జిహ్వ, చర్మము, ముక్కు 84. ఐదు. వాక్కు, పాణి, పాదము, ఆయువు, ఉపస్థ 85. రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, మాఘము, భారవి 86. ఉప్పు, పులుపు, కారము, తీపు, చేదు, ఒగరు. 87. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము 88. తర్కశాస్త్రము, వ్యాకరణశాస్త్రము, ధర్మశాస్త్రము, మీమాంసశాస్త్రము, వైద్యశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము 89. హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుడు, పురూరవుడు. సగరుడు, కార్తవీర్యార్జునుడు 90. దాసీజనము, భృత్యులు, పుత్రులు. మిత్రులు, బంధువులు, వాహనములు, ధనము, ధాన్యము 91. అన్నము, వస్త్రము, గంధము, పుష్పము, పానుపు, తాంబూలము, స్త్రీ, గానము 92. మరీచి, భరద్వాజుడు, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, దక్షుడు, వసిష్ఠుడు, వామదేవుడు 93. శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, భీభత్స, అద్భుత, శాంతరసములు 94. వజ్రము, వైడూర్యము, గోమేధికము, పుష్యరాగము, మరకతము, మాణిక్యము, నీలము, ప్రవాళము, ముత్యము 95. వడ్లు, ఉలవలు, పెసలు, మినుములు, నువ్వులు, గోధుమలు, అనుములు, కందులు, సెనగలు. 96. భాగవతము 97. మొదట వ్యాసమహర్షి శుకమహర్షికి, శుకమహర్షి పరీక్షిత్ మహారాజునకు చెప్పెను 98. దేవకీ వసుదేవులు 99. సాందీప మహాముని 100. స్కంధములు, పదునొకండు 101. బ్రహ్మ – హంస; విష్ణువు – గరుత్మంతుడు; శివుడు – నంది 102. శివుడు 103. సుదర్శనము 104. పది. మత్స్య, కూర్మ,

వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, శ్రీకృష్ణ, బుద్ధ, కల్కి 105. బృహస్పతి 106. శుక్రాచార్యుడు 107. సత్త్వ గుణము, రజోగుణము, తమోగుణము 108. శంకరాచార్యులు, రామానుజాచార్యులు మధ్వాచార్యులు 109. అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము 110. ఆర్యాంబ, శివగురువు 111. గురుగోవింద వల్లభుడు 112. సూత్రాభాష్యము, గీతా భాష్యము, ఉపనిషద్భాష్యము, విష్ణుసహస్రనామభాష్యము, భజగోవింద శ్లోకములు, ఆత్మబోధ, వివేకచూడామణి 113. కాంతిమతి, కేశవాచార్యులు 114. వేదాందసారము, వేదార్థసంగ్రహము, శ్రీభాష్యము 115. వేదవతి, మధ్యగేహ భట్టు 116. భాగవత, భారత తాత్పర్యము, ఉపనిషద్భాష్యములు, దశప్రకరణలు 117. హిందూమతం - ఓంకారం; బౌద్ధమతం - ధర్మచక్రం; ఇస్లాంమతం - చంద్రవంక, నక్షత్రం; క్రైస్తవ మతం - శిలువ 118. ధర్మపథం 119. శ్రీ వి. వి. గిరి 120. మురార్జీ దేశాయ్ 121. ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్, నీలం సంజీవరెడ్డి 122. మదనమోహనమాళవ్యా 123. స్వామి దయానందసరస్వతి 124. సత్యార్థప్రకాశ్ 125. రాజా రామమోహనరాయి 126. మహాభారతం 127. గోదావరి, 720 కిలోమీటర్లు 128. 2, 75, 244 చ. కిలోమీటర్లు 129. కృష్ణానది, నందికొండవద్ద 130. పంజాబు, సట్లెజ్ నదిమీద 131. బాలగంగాధరతిలక్ 132. గీతాంజలి 133. శాకుంతలం, రఘువంశం, కుమారసంభవం, మేఘసందేశం, విక్రమోర్వశీయం 134. కొలంబస్ (ఇటాలియన్), 1492 సం. 135. వాస్కోడిగామా, 1498 సం.రం 136. OTTO HAHN ( జర్మనీ ), 1941 సం.రం 137. విజయలక్ష్మీపండిట్ 138. ఎవరెస్టు, 29,156 అడుగులు 139. నైలునది ( ఈజిప్టు ), 4,160 మైళ్లు 140. సహారాఎడారి, 3,500,000 చ. మై. 141. అహమ్మదాబాద్ 142. ఆగ్రా,

కాన్పూర్ 143. డార్జిలింగ్ 144. కోలార్ 145. బొంబాయి, 1911 సం. జార్జి V ఇండియాకు వచ్చినపుడు 146. పశ్చిమబెంగాల్, రవీంద్రనాథ్ టాగూర్ 147. కలకత్తా 148. న్యూఢిల్లీ 149. బొంబాయి 150. కొలంబో 151. 1947 సం. ఆగష్టు 15, 152. 1950 సం. జనవరి 26 153. శ్రీ దామోదరం సంజీవయ్య 154. ఖాట్మండ్ 155. 23. కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం, ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు, అనంతపూర్, కడప, కర్నూలు, ఖమ్మం, వరంగల్, నల్లగొండ, కరీంనగర్, అదిలాబాద్, మహబూబ్ నగర్, నిజామాబాద్, మెదక్, రంగారెడ్డి, హైద్రాబాద్ 156. హరిహర రాయలు, బుక్కరాయలు, విద్యారణ్యస్వామి 157. ఆరు. ఆసియా, యూరప్, ఆఫ్రికా, ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, ఆస్ట్రేలియా 158. ఆసియా 159. శ్రీ నీలం సంజీవరెడ్డి, 160. అంబేద్కర్ 161. శ్రీ పింగళి వెంకయ్య 162. సర్దార్ వల్లభబాయి పటేల్ 163. 1857 సం.రం 164. పారిస్ 165. జంషెడ్ పూర్, రూర్కెలా, భిలాయ్, దుర్గాపూర్, బొఖారో, భద్రావతి 166. సర్దార్ వల్లభబాయి పటేల్ 167. సరోజినీ నాయుడు 168. ఝాన్సీ లక్ష్మిభాయ్ 169. అనీబిసెంట్ 170. డయ్యర్, 1919 ఏప్రిల్ 13-వ తేదీ 171. రంగూన్ 172. 22 173. విలియం బెంటిక్ 174. లార్డ్ మౌంటుబాటన్ 175. రాజా రామమోహనరాయి, బెంటిక్ కాలములో 176. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఈనాడు, విశాలాంధ్ర, ఆంధ్రభూమి 177. ఇండియన్ ఎక్స్‌ప్రెస్, హిందూ 178. శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి 179. పొట్టి శ్రీరాములు 180. శ్రీ ముట్నూరి కృష్ణారావు 181. భగవత్సింగ్, చంద్రశేఖర అజాద్, వీరసావర్కార్, అల్లూరి సీతారామరాజు 182. 364 1/4 రోజులు 183. 24 గంటలు 184. కర్ణాటకరాష్ట్రంలోని,

కోలారు జిల్లా యందలి నందిదుర్గ కొండలలో 185. నన్నయ 186. శ్రీకృష్ణదేవరాయలు 187. ఆచార్య వినోబాభావే, జయప్రకాశ్ నారాయణ్ 188. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ 189. శ్రీ పి. వి. నరసింహారావు 190. శారదా ముఖర్జీ 191. ఆముక్తమాల్యద 192. అష్టదిగ్గజములు 193. శ్రీకృష్ణ దేవరాయలు 194. అలసాని పెద్దన 195. సరయూనది 196. సుప్రీంకోర్టు 197. జగదీశచంద్రబోస్, సర్. సి. వి. రామన్ 198. బాలచంద్రుడు 199. రుద్రమదేవి 200. తిమ్మరుసు 201. సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య 202. మహారాష్ట్రము లోని ఔరంగాబాదునకు సమీపమున 203. ఢిల్లీ 204. మద్రా సుకు సమీపమున సముద్రపు ఒడ్డున కలదు. పల్లవరాజులు 205. ఉత్తరప్రదేశ్‌లోని ఆగ్రా పట్టణం, షాజహాన్ 206. ఇండి యాలో బీహార్‌లోని సోనేపూర్ (2480 అ.) 207. 'పేజి' అను నతడు 1802 లో కనిపెట్టెను 208. 'వాటర్‌మన్' 1814 లో కనిపెట్టెను 209. 'హోమియోపతి' ని కనిపెట్టెను 210. రష్యావారు- 1957 లో 211. అమెరికాకు చెందిన 'క్రోల్ట్' 212. రష్యాలోని అంగారా నదిపై వున్న రిజర్వాయర్ 213. బ్రిటన్‌కు చెందిన 'స్వింటన్' 214. ట్రివ్లీ 215. శాన్ ఫ్రాన్సిస్కో-లో, ఓక్‌లండ్ బ్రిడ్జి. దాని పొడవు 8 1/2 మైళ్ళు 216. 14-వ స్థానము 217. ధన్‌పత్ రామ్, శ్రీవాస్తవ 218. జె. బి. ప్రీస్టలీ 219. క్రిస్టోఫర్ల్ 220. బాయిర్డ్ 221. మేఘాలయాలలో 222. నత్త 223. బుధగ్రహం 224. రవీంద్రనాథటాగూర్ 225. ఐసన్‌హోవర్ 226. నేపాల్‌లో 227. రాబర్ట్ ఓపెన్ హీమర్ బృందం 228. జర్మనీకి చెందిన డీసెల్ 229. సోక్రటీస్ 230. ఢిల్లీని పాలించిన అల్లాఉద్దీన్ ఖిల్జీ ఆస్థాన విద్వాంసుడు అమీర్ ఖుస్రో 231. ఆసియా, ఆస్ట్రేలియా 232. ఆఫ్రికన్

ఏనుగు. 10 అ. 6 అం. ఎత్తు, 6 1/2 టన్నుల బరువు 233. బొంబాయి 234. అమెరికాకు చెందిన కార్లెర్, 1911 లో 235. జార్జి వాషింగ్‌టన్ 236. లిథియమ్ 237. కంగారు 12.8 మీటర్లు దూకగలదు 238. క్రీ. పూ. 2-వ శతాబ్దానికి చెందిన సంస్కృత పండితుడు 239. సాల్‌మన్ వాక్‌మన్ 240. వజ్రము 241. టిబెట్ 242. 1945 అక్టోబరులో 243. అమేజాన్ నది, దక్షిణ అమెరికాలో వున్నది 244. అమెరికాకు చెందిన మెక్‌కోలమ్ 245. రూథర్ ఫర్డ్ 246. శ్రీ అటల్ బిహారీ వాజపాయి, 1977 అక్టోబరు 4-వ తేదీన 247. అమెరికాకు చెందిన బెర్లినర్ 248. అమృతసర్ 249. అమెరికా-కెనడాలలో వున్న 'లేక్ సుపీరియర్', 31,820 చ. మై. వైశాల్యం 250. తాబేలు 251. హరిశ్చంద్ర భట్‌వాడేకర్, 1899 లో 252. జోసఫ్ థామ్సన్ 253. క్రీ. శ. 29-వ సంవత్సరంలో 254. కంపూచియాలో అంకోర్‌వాట్ దేవాలయం, 402 ఎకరాల విస్తీర్ణంలో వున్నది. 255. ఇటలీకి చెందిన గెలిలియో. 1609 లో. 256. క్రీ. శ. 570 లో 257. రష్యాలోని బైకాల్ సరస్సు. లోతు 6,365 అ. 258. గ్రీన్ లాండ్. విస్తీర్ణం 8,40,000 చ. మై. 259. మాస్కోలోని 'గ్రేట్ బెల్.' బరువు 216 ట., ఎత్తు 19అ. 260. రాబర్టుకోక్ 261. ఫ్రాన్సుకు చెందిన లోనెక్ 262. అడ్రినలిన్ హార్మోను 263. క్రీ. శ. 1600 లో 264. చిరుతపులి 265. బ్రిటన్‌కు చెందిన బాబేజ్ 266. జిరాఫీ. పొడుగు 19 అ. 3 అం. 267. సర్ విలియమ్ జోన్సు 268. ఉష్ట్రపక్షి, బరువు 135 కిలోలు 269. రష్యాలోని అంగారానదిపై వున్న బ్రెట్‌స్కీ-లేక్ రిజర్వాయర్ 270. అమెరికాకు చెందిన 'గిల్లెట్' 271. విలియం హార్వే. 272. అమెరికాలోని 'హూవే' 273. లావోస్‌లోని హూనే ఫాల్సు 274. రాబర్ట్ వాల్‌పోల్ 275. అమెరికాకు చెందిన రైస్ కెల్లాగ్, 1924 సంవత్సరములో. 276. రష్యా- ఇరాన్‌లలో వున్న 'కాస్పియన్‌సీ.' దాని విస్తీర్ణం

1,43,550 చ.మై. 277. ఫ్రాన్సుకు చెందిన సర్ సీప్పే, 1826 లో 278. అమేజాన్ నదీ ప్రవాహం 279. బృహస్పతి 280. ఇంగ్లండ్‌కు చెందిన ఫారడే, 1831-వ సంవత్సరము 281. ఫ్రాన్సుకు చెందిన ల్యూమియర్ సోదరులు, 1895 లో 282. భారతదేశంలో 283. ఫ్రాన్సుకు చెందిన 'కార్నెు', 1907 లో 284. ఆఫ్రికాలో 285. క్రిష్టియన్ బార్నార్డ్, 1967 లో 286. దక్షిణచైనా సముద్రము, ఆర్కిటిక్ సముద్రము 287. హీరాకుడ్ డాం, ఇండియాలో ఒరిస్సాలో మహానది మీాద వున్నది 288. జి. ఆర్. విశ్వనాథ్ (1977-'78) 289. చికాగోలోని సీఎర్సు టవర్సు, 110 అంతస్థు లున్నది, 1454 అ. ఎత్తున్నది 290. చంద్రుడు 291. జర్మనీకి చెందిన జీడ్లెర్. 1874 లో 292. అమెరికాకు చెందిన 'వెబ్‌స్టర్' 293. జర్మనీకి చెందిన 'డైమ్లెర్', 1885 లో 294. 1789 లో 295. నార్వేకి చెందిన 'హాల్డ్సు ఫ్రాలిక్', 1912 లో 296. 'ఆల్ఫ్రెడ్ బి నోబెల్' 297. 'వాల్టా', 1790 లో 298. డెన్మార్క్ దేశస్థుడైన 'ఓయర్‌స్టెడ్', 1819 లో 299. 'లెవోయిజే', 1777 లో 300. 'షిలే', 1777 లో 301. 'ఆయిర్‌స్టెడ్', 1825 లో 302. ప్రీస్ట్లీ, 1774 లో 303. లీవెన్‌హాక్ 304. సర్ జార్జి గ్రియర్‌సన్ 305. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, కాశీ కృష్ణమాచార్య, కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, డా. దాశరథి 306. ఇంగ్లండుకు చెందిన 'జేమ్సువాట్', 1769 లో 307. ఇటలీకి చెందిన 'గెలీలియో', 1609 లో 308. అమెరికాకు చెందిన 'అలెగ్జాండర్ గ్రాహంబెల్', 1876 లో 309. ఇటలీకి చెందిన 'మార్కోనీ', 1896 లో 310. హాలెండ్‌కు చెందిన 'జాన్‌స్సెన్' 1590 లో 311. జర్మనీకి చెందిన 'బెంజ్', 1885 లో 312. ఫ్రాన్సుకు చెందిన 'లూయీ బ్రెయిల్', 1829 లో 313. జర్మనీకి చెందిన 'గుటెన్‌బర్గ్', 1850 లో 314. అమెరికాకు

చెందిన 'హాలెండ్', 1891 లో 315. అమెరికాకు చెందిన 'థామస్ ఆల్వా ఎడిసన్', 1878 లో 316. ఇంగ్లండుకు చెందిన 'బ్రియర్ లే', 1916 లో 317. జర్మనీకి చెందిన 'కోనార్డు రోంట్ జెన్' 1895 లో 318. స్టీఫెన్ సన్, 1814 లో 319. 'వాల్టిమార్ పాల్సెన్' 320. ఇంగ్లండుకు చెందిన 'స్టార్ లీ' 1884 లో 321. అమెరికాకు చెందిన రైట్ సోదరులు (ఆర్ విల్లీ రైట్, విల్బర్ రైట్), 1903 లో 322. 'వాస్టన్ వాట్' 323. బ్రిటన్ కు చెందిన 'సర్ జేమ్సు సింప్సన్' 1847 లో 324. 'కొలంబస్', 1492 లో 325. అమెరికాకు చెందిన 'థామస్ ఆల్వా ఎడిసన్' 1877 లో 326. పోర్చుగీసుకు చెందిన 'వాస్కో-డిగామా' 1498 లో 327. పోర్చుగీసుకు చెందిన 'పి. ఎ కేబ్రాల్', 1500 లో 328. అమెరికాకు చెందిన 'రాబర్ట్ ఎడ్విన్ పియరీ' 1909 లో 329. నార్వేకు చెందిన 'అముండ్సెన్' 1911 లో 330. 'ఎడ్మండ్ హిల్లరీ' 1958 లో 331. 1526 లో 332. 1556 లో 333. 1576 లో 334. 1748, 1749, 1756 లలో 335. 1757 లో 336. 1764 లో 337. 1845–'46 లో 338. ఆనీబీసెంట్, 1916 లో 339. 1919 లో 340. తామర పువ్వు 341. 1815 లో 342. W. A. హ్యూమ్, 1885 లో 343. 1920 లో 344. హిరోషిమామీద (1945 ఆగష్టు 6–వ తేదీన), నాగసాకీమీద (1945 ఆగష్టు 9–వ తేదీన) 345. ఫ్రెంచి ఇంజనీరు 'ఫెర్డినండ్ డిలెస్సెప్స్' 1869 లో త్రవ్వించాడు. మధ్యధరాసముద్రమును ఎర్రసముద్రముతో కలుపుచున్నది. పొడవు 104.5 మైళ్లు, వెడల్పు 380 అడుగులు, లోతు 35 అడుగులు 346. అమెరికాకు చెందిన అమ్‌స్ట్రాంగ్, ఎడ్రిన్ ఆల్డ్రిన్ లు; 1969, జూలై 21 347. 'న్యూటన్' 348. ఊసరవెల్లి 349. చైనా చక్రవర్తి చిన్-హుయంగ్-టీ, క్రీ.పూ. 211 లో నిర్మించాడు. కన్సూ రాష్ట్రం నుండి హూపే రాష్ట్రము వరకు. పొడవు 1500 మైళ్లు

350. 'అలెగ్జాండర్ గస్టావ్' అను ఇంజనీరు, 1889 లో పారిస్ లో 984 అ. ఎత్తుగల ఇనుపగోపురం ( ఎయ్ ఫెల్ టవర్ ) నిర్మించాడు. 351. ఆశాపూర్ణాదేవి 352. సత్యజిత్ రే 353. క్వీన్ ఎలిజిబత్ 354. భాక్రానంగల్, 740 అ. (పంజాబు) 355. జోగ్ జలపాతము. 360 అ. ( మైసూరు ) 356. హౌరాబ్రిడ్జి (కలకత్తా) 357. రోము 358. క్వీన్ ఎలిజిబత్ 359. శ్రీ జలగం వెంగళరావు 360. శ్రీ మర్రి చెన్నారెడ్డి 361. టోక్యో 362. న్యూయార్క్ 363. పాల్ పి. హారిన్. 1905 ఫిబ్రవరి 23 న; అమెరికాలోని చికాగో నగరంలో 364. స్విట్జర్లండ్ దేశీయుడు హెన్రీ డ్యూనంట్; 1863 లో, జినీవా నగరంలో 365. 1945 అక్టోబరు 24, శాన్ ఫ్రాన్సిస్కో 366. 1946 లో వాషింగ్టన్ 367. 1948 లో, జినీవా 368. కన్యాకుమారి అగ్రమున, సముద్రములో, ఒడ్డుకు 800 గ. దూరములో వున్నది 369. హాలీవుడ్ ( అమెరికా ) 370. బెత్లెహాం ( ఇజ్రాయిల్ ) 371. వైరస్ 372. చంద్రగుప్త మౌర్యుని ఆస్థానంలో, గ్రీకు రాయబారి 373. ఇరాన్ 374. కెనడా ఉత్తర ప్రాంతంలోను, గ్రీన్ లాండ్, అలస్కా, తూర్పు సైబీరియా లలో నివసించే ఒక తెగ ప్రజలు 375. సరోజినినాయుడు 376. విష్ణుశర్మ 377. మద్రాసు 378. హైద్రాబాద్ 379. మహారాష్ట్రలో మహాబలేశ్వరంవద్ద 380. మహారాష్ట్రలో నాసిక్ జిల్లాలో త్ర్యంబక్ వద్ద 381. కర్ణాటకలో బ్రహ్మగిరివద్ద 382. అదిలాబాద్ జిల్లా నిర్మల్ తాలూకాలో గోదావరి నదిమీద 383. కర్ణాటకలో హాస్పేటవద్ద 384. 1975 ఏప్రిల్ 19 న 385. 1980 జూలై 18-వ తేదీ, శ్రీహరికోట నుంచి ( ఆంధ్ర ప్రదేశ్ ) 386. 'ప్లేటో' 387. జయవర్ధనే 388. శ్రీ టంగుటూరి ప్రకాశం 389. లాలా లజపతిరాయ్ 390. ఢేమ్సు 391. ఆసియా 392. ఆస్ట్రేలియా 393. గ్రీన్ లాండ్ 394. 1966, జనవరి 11 395. సోనేపూర్ ( బీహార్ లో ) 396. తోరుదత్ ( బెంగాలీ )

397. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, దేశోద్ధారక 398. దివాకర్ల తిరుపతిశాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి 399. సెప్టెంబరు 23, మార్చి 21 400. రాజస్థాన్‌లో 401. జపాన్ దేశము 402. దాదాభాయ్ నౌరోజీ 403. పినవీరభద్రుడు 404. ఉద్యోగ విజయాలు 405. భామవారము 406. నవనాథచరిత్ర 407. డమరుకం 408. తెనాలి రామకృష్ణ 409. భానువారము.

*

## పిల్లలకు స్తన్య మీయని తల్లులు

ప్రపంచంలో తల్లులు పిల్లలకు స్తన్య మిచ్చే అలవాటు క్రమ క్రమంగా తగ్గిపోతున్నది. ఈవిషయంలో ప్రపంచ ఆరోగ్యసంస్థ ప్రపంచ ఆరోగ్యదినోత్సవ ( 1973 సం. ఏప్రిల్ 7-వ తేదీ ) సందర్భమున ఆందోళన వెల్లడించింది.

ఇలా తల్లులు పిల్లలకు స్తన్య మీయని అలవాటు ఒక ఫ్యాషన్‌గా సంపన్నులలోనేగాక, అన్యులలో కూడా పెరిగిపోయింది. దీనివల్ల పిల్లల పౌష్టికాహారం విషయం ఒక ప్రపంచ సమస్యగా రూపొందిందని ఆ సంస్థ విచారం వెల్లడిజేసింది. తల్లిపాలు పిల్లలకు మంచి పౌష్టికాహారం కావడమేకాక, పిల్లల రోగనిరోధక శక్తికికూడా చాలా అవసరమని విజ్ఞాన శాస్త్రం చెబుతున్నది.

ఈ ఫ్యాషనులవల్ల వస్తున్న నష్టాన్ని భర్తీచేయడానికి మాంస కృత్తులు ఎక్కువగా వుండే పాలను ఎక్కువగా ఉత్పత్తిచేయడమనే సమస్య తలఎత్తింది. ఆసియాలోని స్త్రీలందరూ పిల్లలకు స్తన్య మీయని పక్షంలో, ఆ నష్టాన్ని భర్తీచేసేందుకు 14 కోట్ల 40 లక్షల పశువులు అవసరమవుతాయి. అయినప్పటికి పసిపిల్లలందరికీ తగినన్ని పాలు లభ్యమవుతాయనే నమ్మకంలేదు.

తల్లిపాలు అద్వితీయమయినవి. అలాంటి పాలతయారీ సాధ్యంకాదు. "స్తన్యము ద్వారానే బిడ్డల పోషణ తల్లులు స్వీకరించడం ఒక్కటే తగిన పద్ధతి" అని ప్రపంచ ఆరోగ్యసంస్థ ప్రపంచ ఆరోగ్యదినోత్సవ సందర్భమున తల్లులకు సందేశ మిచ్చింది.

# బాల
# విజ్ఞానకోశము

## నవమ భాగము

## ప్రపక్తులు

# గౌతమబుద్ధుడు

మానవత్వం నశించి పశుత్వం విలయతాండవం చేస్తున్న రోజులవి. హింసాప్రవృత్తి తీవ్రరూపం ధరించిన దినాలవి. యజ్ఞ యాగాదుల పేరిట నిర్దాక్షిణ్యంగా నరబలులు, జంతుబలులు యిస్తున్న సమయం అది. క్షుద్రదేవతలను ఆహ్వానించి వారి అను గ్రహానికి పాత్రులు కావడానికి ఛాందసంగా, క్రూరాతి క్రూరంగా నిండు ప్రాణాలను సహితం బలి యిచ్చి దేవునికి ప్రీతిపాత్రులవ్వాలని తాపత్రయపడే దుర్దినాలవి. బలి యివ్వడం పవిత్రమని, మతధర్మ మని భావించి ప్రచారం చేసేవారు. దేవుని పేరిట కొంతమంది స్వార్థపరులు మతప్రవక్తలమని చెప్పుకుంటూ ప్రజలను క్రూరంగా శాసిస్తూ అక్రమ, అమానుష కృత్యాలను ఏమాత్రం వెరవకుండా స్వేచ్ఛగా హింసాప్రవృత్తిని ప్రోత్సహిస్తుండేవారు. సమాజ సంపదను తమ స్వార్థ స్వప్రయోజనాల కోసం వినియోగించు కుంటూండేవారు. దేవుని తమ సొత్తుగా భావించి, దేవాలయాల ఆస్తులను తమ స్వంత ఆస్తులుగా అనుభవిస్తుండేవారు. తాము చెప్పిందే వేదమని, పలికిందే ధర్మమని, చేసేదే యాగమని—ఆనాటి మతప్రవక్తలు ఛండశాసనులుగా వ్యవహరిస్తుండేవారు. ప్రేమ, కరుణ, దయలాంటి సద్గుణాలకు స్థానం లేకుండా పోయిన దుర్ది నాలలో కరుణామయుడు, దయార్ద్రహృదయుడు, ప్రేమతపస్వి, అహింసావాదాన్ని వెలుగులోనికి తెచ్చిన మహనీయుడు, మహా ప్రవక్త 'గౌతమబుద్ధుడు' కలియుగంలో ఒక అవతారమూర్తిగా అవతరించి పీడిత మానవాళిని సముద్ధరించాడు. అశాంతికి ఆలవాలమైన ఆనాటి సమాజాన్ని సక్రమమార్గాన పెట్టాడు. ప్రేమ, దయ, జాలి, కరుణల గొప్పతనాన్ని ప్రచారం చేసి ప్రశాంత వాతావరణాన్ని సృష్టించాడు. అహింసయొక్క గొప్పతనాన్ని వివరించి హింసాప్రవృత్తిని తగ్గించాడు. ధర్మప్రబోధం చేసి

అధర్మాన్ని రూపుమాపాడు. అందువలననే మన పెద్దలు బుద్ధావతారమును కూడా దశావతారములలో చేర్చారు.

నేటికి సుమారు ఇరువదిఅయిదువందల సంవత్సరాలకు పూర్వం కోశలదేశపు ఈశాన్యభాగమున నున్న రోహిణీ నదీ తీరమున కపిలవస్తు మహానగరం వుండేది. దానిని కేంద్రముగా గైకొని శాక్యవంశపురాజు శుద్ధోధనుడు పరిపాలించుచుండెడివాడు. ఇది ప్రస్తుతం నేపాలులో వున్నది. అచట ఆదిలో కపిలమహర్షి ఆశ్రమము వుండటంవల్ల ఆ పట్టణానికి 'కపిలవస్తునగరం' అని పేరు వచ్చినది. ఇక్ష్వాకువంశమునకు చెందిన మాయాదేవి ఆయన పట్టపురాణి. ఆ దంపతులు సంతానం లేక విసిగి వేసారి నిరాశతో జీవితంమీదనే విరక్తిజెంది రాజ్యవైభవాలను సహితం త్యజించి సన్యసించుదామనే తరుణంలో మాయాదేవి గర్భము ధరించెను. నవమాసములు నిండెను. కపిలవస్తు నగరమునకు మూడు క్రోసుల దూరములో నున్న లంబినీ వనమునకు ప్రసవించుటకై మాయాదేవిని రాజు తీసుకొనిపోయెను. అచట రాణి శుభలగ్నమున, సుఖప్రదముగా ప్రసవించి ఒక కుమారుని గనెను. అతనికి 'సిద్ధార్థు'డని నామకరణం జేసిరి. శాక్యవంశస్థుడగుటచే అతనినే 'శాక్యముని' యనియు, 'శాక్యసింహు'డనియు పిలువసాగిరి. గౌతమ గోత్రమునకు చెందిన వాడగుటచే 'గౌతముడు' అని పేరుకూడా వచ్చెను. ఆ బాలుని పెంచి పోషించవలసిన బాధ్యత సవతితల్లియగు 'ప్రజావతి' పై బడినది. ఈమె రాజుగారి ద్వితీయ భార్య. మాయాదేవి యొక్క సోదరి కూడాను. ఈమెకు 'గౌతమి' అని మరొక పేరు కూడ కలదు. అందువలన సిద్ధార్థునికి 'గౌతముడు' అని పేరు కూడ వచ్చెనని చరిత్రకారులు చెబుతున్నారు.

సిద్ధార్థుడు దినదినప్రవర్ధమానంగా పెరుగుచుండెను. సమస్త భూతజాలములయందు అపారదయ గలిగి, కరుణాహృదయుడై ప్రవర్తింప సాగెను. సకలశాస్త్ర విద్యలతోపాటు,

శస్త్రవిద్యలను కూడ అభ్యసించెను. మేధాసంపత్తిగలవాడగుటచే సమస్తశాస్త్ర విద్యలయందు సమర్థుడై, సకల శస్త్రవిద్యల యందు సిద్ధహస్తుడై, పలుకళలయందు ప్రావీణ్యుడై సిద్ధార్థుడు పేరు ప్రఖ్యాతులను గాంచెను. కాని వయసు పెరిగిన కొలది అతని హృదయము భోగ విలాసములపట్ల విరక్తియు; భగవ ధ్యానముపట్ల అనురక్తియు; ఇహ సౌకర్యముల యెడల వైరాగ్యము; పరమునందు పరమానందం; రాజభోగములయందు విముఖత; ఆధ్యాత్మికచింతనయందు సుముఖత ప్రబలు చుండెను. వేషభాషలయందు నిస్పృహ జనించు చుండెను. అది చూచి తండ్రి శుద్ధోధనుడు కుమారుడు ఎక్కడ విరాగియై పోవునో నని భయపడి ఒక చక్కని కన్యను తీసుకొనివచ్చి వివాహము చేసెను. ఆమె పేరు 'యశోధర'. వారిరువురికి ఒక కుమారుడు పుట్టెను. అతనికి 'రాహులు'డని పేరు పెట్టిరి. భార్యను, కుమారుని చూచు కుంటూ పూర్వపు వైరాగ్య వాసనలను దరిచేరనీయకుండా, ఆనందంతో కొంతకాలం జీవితాన్ని గడిపెను.

ఒకనాడు వనవిహారమునకు రథమునెక్కి బయలు దేరెను. మార్గమధ్యమున ఒక రోగి కనపడెను. రోగ బాధచే కృంగి, కృశించి, నీరసించి, అన్నపానాదులు లేక యమయాతనల ననుభవిస్తూ ప్రాణంపోక, రోగం నయంకాక నానా అవస్థలు పడుతున్న నిర్భాగ్యుని చూచి సిద్ధార్థుని హృదయం ద్రవించెను. సానుభూతి ఉదయించెను. మనమునందు పూర్వపు వైరాగ్యం తిరిగి జనించెను. విహారము నొల్లక రాజభవనమునకు మరలి పోయెను.

మరల కొంతకాలానికి విహారమునకు బయలుదేరి వెళ్ళు తుండగా త్రోవలో నిరాశ్రయుడైయున్న ఒక వృద్ధుని చూచెను. శరీరం ముడతలుపడి, తల నెరసి, వణుకుతూ కర్ర సహాయంతో నడవలేక నడుస్తూన్న ఒక వయోవృద్ధుని దృశ్యం చూచి

హృదయము క్షోభించెను. ఎప్పుడో ఒకనాడు తాను కూడా అదేవిధముగా అగుదునుగదా యని భావించి బాధ పడెను. యౌవనమదాంధకారంలో భవిష్యత్తును గురించి ఏమాత్రం ఆలోచించలేక పోయినందులకు వ్యథ చెందెను. వ్యాకులతతో తిరిగి అంతఃపురం జేరెను.

మూడవ పర్యాయం వినోదయాత్రకు బయలుదేరి నగర మధ్యమును జేరగానే ఒక 'శవము' కంట బడెను. వారి బంధువులు ఆర్తనాదాలు జేస్తూ, బిగ్గరగా ఏడుస్తూ ఆ శవాన్ని దహన సంస్కారాల నిమిత్తం మోసుకొనిపోతున్న దృశ్యమును చూచెను. అతని కోమల హృదయం కంపించి పోయింది. మనస్సు పరిపరివిధముల పోయింది. 'మృత్యువును ఎంతటి వారైనా ఎదుర్కొనలేరు గదా!' అని చింతించెను. హృదయావేదనతో, పొంగి పొరలివచ్చే దుఃఖంతో వెనుతిరిగి రాజప్రాసాదమునకు చేరెను.

వెనుకటి వైరాగ్యం తిరిగి మనస్సులో ఉద్భవించెను. మమకారం మానవుని పాలిటి కాళపాశముగదా యని భావించెను. మానవజీవితం క్షణభంగురమని తలంచెను. సంసారమునందు విరక్తి కలిగెను. జరామరణ దుఃఖములను దాటు ఉపాయమును అన్వేషించవలెనని నిశ్చయించుకొనెను. మోక్షసాధనవాంఛ ప్రబలెను. సకలభోగభాగ్యములను తృణప్రాయంగా నెంచి తల్లిదండ్రులు, భార్యాపిల్లలమీద మమకార బాంధవ్యాలను త్రెంచుకొని, ఒకనాటి కాళరాత్రి బయలుదేర నిశ్చయించుకొని, సారథిని రథమును సిద్ధము చేయమని ఆజ్ఞాపించెను. బయలుదేరే ముందు తన ముద్దుల కుమారుని ఒక్కసారి ముద్దిడి వెళ్ళవలెననే కోరిక ఉదయించి, అంతఃపురమున కేగి ఉయ్యేలలో ప్రశాంత వదనంతో నిద్రిస్తున్న పసిపాపను; అతిలోక సుందరి, అనుపమాన సౌందర్యరాశి అయిన తన అనుంగు అర్ధాంగి యశోధర గాఢ

నిద్రలో మునిగియున్న దృశ్యాన్ని తిలకించి, 'ఒక్క క్షణ మిచ్చట నున్నచో జీవిత మధఃపతనమై పోవును' అని శంకించి, మనస్సును దిట్టపరచుకొని, హృదయాన్ని రాయి చేసుకొని ముద్దుబిడ్డగు రాహులుని ముద్దిడకయే రథమెక్కెను.

అరణ్య మధ్యమునకు జేరి రథము దిగి, రాజవేషమును తీసివేసి సారథికి యిచ్చి తన కత్తితో తన జుట్టును ఖండించుకొని "నేను సన్యాసినైతిని. నా కొఱకు విచారింపవలదు. అందరితో జెప్పుము" అని సారథిని త్రిప్పి పంపెను. భిక్షుకవేషమును ధరించి కొంతదూరం నడవగా ఒక తత్త్వజ్ఞుడు కనుపించెను. తత్త్వ జ్ఞానమును కొంతకాలము అక్కడ వుండి అభ్యసించెను. దానివల్ల ప్రయోజనం లేదని భావించి వైశాలి నగరమున కేగెను. అది పాటలీపుత్రమునకు ఉత్తర దిశగా వున్నది. అక్కడొక ఆచార్యు నాశ్రయించి ప్రాణాయామాదుల నభ్యసించి, యోగియై సమాధి నుండి పరతత్త్వము నెఱుంగ ప్రయత్నించెను. కాని దానివల్ల కూడా లాభంలేదని తలంచి, మగధదేశ రాజధానియైన రాజ గృహమున కరిగెను. తపస్సు చేయనివారికి ముక్తిలేదని, అక్కడ కొంతమంది ఆచార్యులు చెప్పగా, గయాపట్టణ ప్రాంతమునకు చేరి అయిదు వత్సరములు అతినిష్ఠతో, తదేక దీక్షతో తపస్సు చేసి నప్పటికి మనశ్శాంతి లభించక పోవడంతో ఆచోటును వీడి అదే పట్టణంలో నున్న ఒక రావిచెట్టు క్రింద కూర్చొని నిశ్చలచిత్తుడై తత్త్వవిచారణ ప్రారంభించెను. హఠాత్తుగా కర్తవ్యం స్ఫురించెను. అంతరాత్మయందు నూతనజ్యోతి వెలిగెను. జ్ఞానోదయమయ్యెను. జ్ఞానము సంప్రాప్తించిన యా వృక్షము బోధివృక్షముగా ప్రసిద్ధి గాంచినది. ఆ స్థలముచకు 'బుద్ధగయ' యని పేరు వచ్చెను.

గౌతముడు తపస్సు చాలించి ధర్మప్రచారానికి బయలు దేరెను. సారానాథ్ నుండి తన ప్రచారమును ప్రారంభించెను. తనశిష్యులకు అక్కడనే బౌద్ధ ధర్మదీక్షను యిచ్చి దేశమంతటా

ప్రచారకులుగా పంపెను. కాశీకి వెళ్లి అక్కడ పండితులతో వాదోప వాదములు జరిపి, మూడుమాసములలో అరువదిమందిని బౌద్ధ మతంలో చేర్చి వారిని నలుదెసలకు ప్రచారకులుగా పంపెను. అక్కడ నుండి మగధరాజధాని వెళ్లి బింబిసారుని, యింకా అనేక మందిని బౌద్ధ మతంలో చేర్చినారు. అచట నుండి తన స్వస్థలమైన కపిలవస్తుకు వెళ్లి నలుబదిదినాలుండి తల్లిదండ్రులకు, భార్యా పిల్లలకు, అన్యకుటుంబ సభ్యులకు బౌద్ధ ధర్మం ప్రబోధించి మత దీక్ష నొసగిరి. దేశంలో చాలాచోట్లకువెళ్ళి మతబోధ గావించి, ప్రచారకులను తయారుచేసి దేశదేశాల పంపిరి.

గౌతమునికి ఇల్లు విడచునప్పటికి ముప్పదిఏండ్ల వయసు కలదు. ముప్పది ఆరవసంవత్సరంలో జ్ఞానోదయమై బుద్ధుడయ్యెను. నలుబదినాలుగేండ్లు బౌద్ధమత ధర్మప్రచారము గావించి ప్రజలలో ప్రేమ, దయ, కరుణ, జాలిలాంటి ఉత్తమ సద్గుణములను నెలకొలిపి, అహింసా ధర్మాన్ని ప్రబోధించి, దేశంలో శాంతియుత ప్రశాంత వాతావరణమును ఏర్పాటుచేసి యెనబదవఏట కుశల నగరమున పరమపదించెను.

గౌతముడు ముఖ్యంగా ఎనిమిది ముఖ్యవిషయాలను ప్రపంచానికి చాటెను. వీనినే బౌద్ధధర్మంలో 'అష్టాంగిక' మార్గములందురు. 1. సమ్యక్ దృష్టి : అనగా మంచిచెడుల మధ్య తారతమ్యతను గుర్తించుట. 2. సమ్యక్ సంకల్పం : అనగా మంచి తలంపు, మంచి ఆలోచన. దురాలోచనలను దరికి చేరనీయ కుండుట 3. సమ్యక్ వచనము : అనగా మంచిపలుకు, చక్కని మాట పలుకుట. 4. సమ్యక్ కర్మ: అనగా మంచిపనులు, పవిత్రమైన కార్యాలుచేయుట. 5. సమ్యక్ జీవిక: అనగా పరిశుద్ధమైన సంపాదన, పాపకృత్యములను చేయకుండా ధర్మము ననుసరించి ధనమును సంపాదిస్తూ జీవితాన్ని గడపుట. 6. సమ్యక్ ప్రయత్నం : ఇంద్రియములను తమ వశమునందుంచుకొని మంచిపనులు చేయుట,

ఆచరణశుద్ధి లేనివాడు ఏ కార్యమును సఫలీకృతం చేయలేడు. ఇంద్రియములు వశము తప్పిన అనేక దుర్వ్యసనములకు మానవుడు లోనగును. 7. సమ్యక్ స్మృతి : తన కర్తవ్యమును సదా ధ్యానము నందు స్మరించుకుంటూ విద్యుక్త ధర్మమును నిర్వర్తించుట 8. సమ్యక్ సమాధి: చిత్తము నేకాగ్ర మొనర్చుట. చిత్తచాంచల్యము గలవాడు ఏపనిని స్థిరముగా చేయజాలడు. చంచలస్వభావుడు సదా నిరాశను ఎదుర్కొనవలసివస్తుంది. ఏ కార్యమును చేబట్టినను తన సర్వశక్తులను కేంద్రీకరించి, ఏకాగ్రతతో కృషిసల్పినచో కార్యం సఫలత నొందెను.

*

# భారతీయ గణితశాస్త్రము

అసలు గణితశాస్త్రమును ప్రపంచానికి అందించినది మొట్టమొదట భారతదేశమే. ఋగ్వేదంలో 'బిబింధు' ( అంకగణితం ) అను శాస్త్ర ( Arithmetic ) మున్నది. రాజరాజనరేంద్రుడు పరిపాలించిననాటి తాటాకు గ్రంథములలో క్షేత్రగణితము ( Geometry ), బీజగణితము (Algebra) ఇత్యాదివి వున్నాయి. పావులూరి మల్లన్న వ్రాసిన "క్షేత్ర బీజగణితం" ( తాటాకు గ్రంథములమీద ) లో వృత్తములు, త్రిభుజములు ఈనాడు "పైథాగరస్" పేరున అనుకొనే సూత్రమూ మొదలగునవి వున్నాయి.

"పైథాగరస్" అను గ్రీకు శాస్త్రవేత్త భారతదేశమునకు వచ్చి యిట పండితులవద్ద శుశ్రూషచేసి అనేకవిద్యలను నేర్చుకొనె నని 'మాక్సుముల్లర్' సహితం అంగీకరించారు. భూమి కొలతలు మొదలైన శాస్త్రమంతా బోధాయన మహర్షి రచించిన "శుల్బసూత్రములు" అను గ్రంథంలో వున్నాయి. దానిలోని విషయాలను 'పైథాగరస్' గ్రీకు భాషలోనికి అనువాదం మాత్రమే చేశాడు. అసలు దానిని 'పైథాగరస్' రచించాడనే విషయం ఏమాత్రం వాస్తవంకాదు. అది అపోహ మాత్రమే.

# శ్రీ జగద్గురు శంకరాచార్య

భారతదేశంలో నాస్తికవాదం తీవ్రరూపం దాలుస్తున్న దినాలలో హిందూమత ధర్మ, సంస్కృతీ పరంపరలను గురించి తూలనాడుతూ, దురాచారాలను ప్రోత్సహిస్తూ, ధర్మాన్ని శంకిస్తూ, అధర్మాన్ని ప్రబోధిస్తూ, నాస్తిక భావాలను ప్రచారం చేస్తూ, నైతిక, ఆధ్యాత్మిక విలువలను కించపరస్తూ, సమాజంలో తీవ్ర అశాంతిని కలుగజేస్తున్న సమయంలో 'జ్ఞానభాస్కరుడు' ఉదయించాడు. జ్ఞానశూన్యులై అజ్ఞానాంధకారంలో పయనిస్తున్న ప్రజానీకానికి దివ్యజ్యోతిని ప్రసాదించాడు. దేశగతినే మార్చి వేశాడు. హిందూధర్మ ఔన్నత్యాన్ని వాడవాడ ప్రబోధించాడు. ఆత్మవిస్మృతి జెంది నిద్రాణమైయున్న జాతిలో నవచైతన్యాన్ని కలుగజేసి హిందూమతం యెడల ప్రగాఢమైన విశ్వాసాన్ని పునః ప్రతిష్ఠించాడు. ప్రయాణసౌకర్యాలు లేకపోయినా, రాజాదరణలు లభించకపోయినా ఆత్మవిశ్వాసంతో, అకుంఠిత దీక్షతో ఆసేతు హిమాచలపర్యంతం, పరివ్రాజకుడై కాలినడకన పర్యటన జేసి జాతిని తిరిగి తేజోవంతం జేశాడు. దేశసమైక్యతను కాపాడాడు. కన్యాకుమారి నుండి హిమాలయాల వరకు గల భారతప్రజలు ఆ మహనీయునికి మోకరిల్లారు. నీరాజనా లర్పించారు. ఆ యుగ పురుషుడే 'ఆదిశంకరులు, జగద్గురు శ్రీ శంకరాచార్య.'

భారతవర్షంలో కేరళ ప్రాంతంలోని 'కాలడీ' అనే కుగ్రామంలో ఆ మహనీయుడు అవతరించాడు. తండ్రి పరమశివభక్తాగ్రేసరుడు శివగురువు. తల్లి ఆర్యాంబ. ఆనాడు ఈశ్వరాంశ మనుష్య రూపంలో అవతరించింది. అదొక మంగళ ముహూర్తం.

అద్వైత వేదాంత ప్రచారానికి నాందీ ప్రస్తావన ఆ పరమపవిత్ర దినాన జరిగింది. వైదికమత ప్రచారానికి కలియుగంలో తిరిగి శాశ్వతకీర్తిని పునః ప్రతిష్ఠించిన ఆదిశంకరులు నందననామ సంవత్సర, వైశాఖ శుద్ధ పంచమి, ఆదివారం, పునర్వసు నక్షత్ర శుభ సమయమున అవతరించారు. ఇదే కలి శకానుసారము 2593–వ సంవత్సరం. అనగా క్రీ. పూ. 509–వ సంవత్సరం. పిన్నవయస్సులోనే సకలశాస్త్రపారంగతుడైనాడు. వీరికి చౌలోపనయనాదులు యథాకాలంలో విధి విధానంతో నిర్వహించబడినాయి. మధూకర వృత్తితో నియమపూర్వకంగా, గురుసాన్నిధ్యంలో చతుర్వేదాధ్యయనం చేశారు. ఆ సమయంలోనే వీరు ఒక బీదరాలగు బ్రాహ్మణ గృహిణి వలన 'అమలక' భిక్షను స్వీకరించి, శ్రీ మహాలక్ష్మిని 'కనకధారాస్తవం' తో స్తోత్రం చేయగా, ఆమె గృహ పరిసరమంతటా సువర్ణామలకవృష్టి కురిసిందని చరిత్ర చాటుచున్నది.

ఆదిశంకరులు ఆర్యాంబ తల్లికి ఏకైక పుత్రుడు. పుట్టినందులకు ఋణము తీర్చవలయునని తలంచు కొడుకు తల్లికి సేవచేయును. దేశమునకు ఉపయోగపడును. ఒక రోజున ఆచార్యులవారి తల్లి వృద్ధాప్యంవల్ల నిత్యము చేయు స్నానము చేయలేకపోవడంవల్ల, అప్పుడు శంకరులు నదీప్రవాహపు జాలునే త్రిప్పి తన యింటి ప్రక్కగా పారునట్లు చేసిరట. అంతట తల్లి ఆర్యాంబతో కలసి 'చూర్ణి' నదిలో స్నానము చేయుచుండగా ఒక మొసలి శంకరుని కాలు పట్టుకొనెను. అప్పటికే శంకరుల తండ్రి గతించెను. భర్త పోవడమేకాక, కొడుకు కూడా పోతున్నాడే నని ఎంతో ఆ తల్లి బాధపడుచుండెను. మొసలి నదిలోనికి ఈడ్చుకొని పోవుచుండగా శంకరులు "అమ్మా! మొసలి ఈడ్చుకొని పోవుచున్నది. సన్యాసం స్వీకరించడానికి అనుమతి యిస్తే వదలివేస్తుంది. లేకపోతే

తీసుకొని పోతుంది. మొసలి నోటను పడి మరణించిన యెడల అది దుర్మరణ మగును. నీకు పుత్ర కృత్యము చేయువారుండరు. సన్యాసమునకు నీవు అనుమతి యిస్తే దుర్మరణము తప్పుతుంది. నీతోపాటు ఇరువదిఒక్క తరములవారును కూడా తరించుదురు" అని కేకలు పెట్టగా, పిల్లవాడు బ్రతుకుతే అంతే చాలునని సన్యాసం స్వీకరించడానికి ఆర్యాంబతల్లి అంగీకరిస్తుంది. అంత శంకరులు ప్రైషమంత్రమును ఉచ్చరించి సన్యాసి యాయెను. దూర్వాసముని యొక్క శాపము నుంచి విముక్తి నొంది మొసలి మటుమాయ మయ్యెను.

తల్లికడ సెలవు తీసుకొని పరివ్రాజకుడై నర్మదానదీ తీరాన నున్న గోవింద భగవత్పాదులవద్దకు వెళ్ళి తమను తామే పరిచయం చేసుకొని "శివః కేశవోఽహాం" అనే మకుటం గల దశ శ్లోకిని చెబుతారు. "గోవిందం పరమానందం, మద్గురుం ప్రణతోస్మ్యహాం" అని ప్రణామం చేస్తారు. అప్పుడు వారు వ్రాసిన 'భజగోవింద స్తోత్రము' గురుపరముగను, దైవపరముగను వెలయుచున్నది. శ్రీ గోవింద భగవత్పాదులు ఆనందంతో అనుగ్రహించి శిష్యులుగా స్వీకరించి మహావాక్యోపదేశాన్ని చేస్తారు.

గురువాజ్ఞ శిరసావహించి వింధ్యపర్వతములను దాటి కాశీ పట్టణానికి చేరుతారు. అది మహాపండితులకు నిలయం. పదునారు వత్సరాల ప్రాయంలో దేదీప్యమానంగా వెలిగిపోతున్న ఈ బ్రహ్మచారి, బ్రహ్మతేజస్సును చూచి పండితు లంతా తల లొంచి మోకరిల్లుతారు. అచటనే వీరు బ్రహ్మసూత్రములకు, ఉపనిషత్తులకు, భగవద్గీతకు భాష్యాలు రచించుతారు. వీటికే "ప్రస్థాన త్రయభాష్యములు" అని పేరు. వీరిచే 'సనత్సు జాతీయ భాష్యం' ఇచటనే రచింపబడినది. 'మనీషాపంచకం' కూడా ఇచటనే చెప్ప బడింది. అంతేకాదు. ఆ పవిత్ర కాశీక్షేత్రంలోనే వేదవ్యాసుల వారితో బ్రహ్మసూత్రభాష్యంలోని 'తరంతర ప్రకరణం' పై

గోష్ఠి జరిగింది. అనేకమంది శిష్యులైనారు. వీరిలో 'సనందనుడు' ముఖ్యుడు. ఆయనే 'పద్మపాదాచార్యులు' గా ప్రసిద్ధులయ్యారు. తరువాత 'హస్తమలకాచార్యు'లను శిష్యులుగా స్వీకరిస్తారు. పిమ్మట 'ఆనందగిరి' ని శిష్యులుగా చేర్చుకుంటారు. వీరినే 'తోటకాచార్యులు' అని అంటారు. తోటక వృత్తంలో శంకరులను స్తోత్రం చేయడం వలన ఆనందగిరికి 'తోటకాచార్యులు' అని పేరు వచ్చింది. వీరి తోటకాష్టకంలోని తత్వ సమన్వయం మహామహులను ముగ్ధులను చేసింది. తుదకు 'సురేశ్వరుల'ను శిష్యులుగా పరిగ్రహిస్తారు. వీరి పూర్వాశ్రమనామం 'మండన మిశ్రుడు'. వీరు శంకరులతో వాదన సలిపి, వాగి జ్ఞానమార్గాన్ని అంగీకరించి శిష్యులై, శ్రీవారికి ప్రీతిపాత్రులు కావడంవల్ల కంచి పీఠానికి తమ తరువాత సురేశ్వరులు అధిపతులుగా నియమింపబడుతారు.

ఆదిశంకరులు భారతవర్షమంతా రెండు పర్యాయములు విజయయాత్ర చేసారు. మొదటి పర్యాయం బౌద్ధ జైనమతాల వల్ల మితిమీరి ప్రబలిన నాస్తిక భావాలను ఖండించి అద్వైత జ్ఞానాన్ని ప్రబోధించారు. రెండవ పర్యటనలో సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాలను దర్శించి, జీర్ణావస్థలోనున్న వాటిని పునరుద్ధరించి వాటి మహత్తును గురించి అనేక పుస్తకాలు వ్రాసారు. కైలాసానికి వెళ్లి సదాశివుణ్ణి 'వేదాంత చూర్ణిక' తో స్తోత్రంచేసి అచటనుండి ఐదు స్ఫటిక లింగములను ; శాస్త్రపరము, మంత్రశాస్త్ర సమ్మతము ఐన "సౌందర్యలహరి" అనే గ్రంథాన్ని ( ఇందు ఆనందలహరిని మాత్రం ) భువికి తీసుకొని వచ్చారు.

కాశ్మీరులో ప్రతిష్ఠించబడియున్న సర్వజ్ఞపీఠాన్ని అధిరోహించుతారు. మండనమిశ్రుని ( శ్రీ సురేశ్వరులు ) ధర్మపత్ని సరసవాణి ( ఉభయభారతి ) తో ఎంతో క్లిష్టమైన శాస్త్రచర్చలను జరిపి ఆమెను జయించుతారు. ఆమె సరస్వతీ అవతారమని ప్రతీతి.

తుంగభద్రానదీ తీరాన్న శృంగేరీ మఠాన్ని స్థాపించి శక్తి స్వరూపిణిగా 'శారదాదేవి' అనే పేరుతో సరస్వతిని ప్రతిష్ఠించుతారు. దానికి తమశిష్యులైన 'పృథ్వీధరు' లను మఠాధిపతిగా నియమించుతారు. ఉత్తరాన బదరీనారాయణంలో 'జ్యోతిర్మఠాన్ని' స్థాపించి 'ఆనందగిరి' ని అధిపతుల్ని గావించుతారు. పశ్చిమాన ద్వారకా మఠమును స్థాపించి హస్తామలకాచార్యులను దానికి అధిపతులుగా చేస్తారు. తూర్పున మహోదధితీరంలో పూరీ గోవర్ధన మఠాన్ని ప్రతిష్ఠించి దానికి పద్మపాదాచార్యులను అధిపతులుగా నియమించుతారు. కాశీలో 'సుమేరు' లేక 'పాదుకా' పీఠాదులను ప్రతిష్ఠించుతారు. కంచిలోని కామకోటి పీఠాన్ని తామే అధిష్ఠించి దాన్ని తక్కిన పీఠాలకు కేంద్ర పీఠంగా విరాజిల్ల జేస్తారు.

కైలాసం నుంచి తెచ్చిన ఐదు స్ఫటికలింగాలలో భోగ లింగాన్ని శృంగేరిలో, మోక్షలింగాన్ని చిదంబరంలో, వరలింగాన్ని నేపాలంలో, ముక్తిలింగాన్ని కేదారంలో ప్రతిష్ఠించి, ఐదవ యోగ లింగాన్ని కంచిలో ఉంచి వారే నిత్యం త్రికాలార్చన చేసేవారు. శ్రీరంగంలో జనాకర్షణ యంత్రాన్ని, తిరుమల శ్రీ వెంకటేశ్వర క్షేత్రంలో ధనాకర్షణ యంత్రాన్ని ప్రతిష్ఠించుతారు. తిరుచునాపల్లి వద్దనున్న జంబుకేశ్వరంలో గణపతిని ప్రతిష్ఠించి అఖిలాండేశ్వరీదేవి ఉగ్రరూపాన్ని తగ్గిస్తారు.

కన్యాకుమారీ నుండి కాశ్మీరం వరకు, ఇటు మహోదధి నుండి అటు రత్నాకరం వరకు పర్యటించి, నాలుగు మూలల నాలుగు మఠాలను నెలకొలిపి, కంచిని కేంద్రముగా చేసుకొని అద్వైత బ్రహ్మవిద్యాప్రచారం గావించి, దేశంలో విభిన్న సాంప్రదాయాలు, భావాలు, భాషల ప్రజ లున్నప్పటికీ – వీరంతా ఒకే సంస్కృతీ, ధర్మపరంపరలకు వారసులమనే భావాన్ని ప్రచారంచేసి, అనేక పుణ్యక్షేత్రాలను దర్శించి, యంత్ర ప్రతిష్ఠలను చేసి, అచ్చటి దివ్య

తేజస్సును దేదీప్యమానం చేసి, భారతదేశసమైక్యతను, సమగ్రతను పరిరక్షించి ప్రజలలో నవచైతన్యాన్ని కలుగజేసిన మహనీయులు, యువప్రవక్త అయిన ఆదిశంకరులు 32-వ సంవత్సరంలో అనగా క్రీ. పూ. 477 సంవత్సరంలో కాంచీక్షేత్రంలోని కామాక్షీదేవి ఆలయంలో అవతారం చాలిస్తారు.

ఈ మహనీయుని చరిత్ర మనకు అత్యంత పవిత్రమైనది. ధర్మం క్షీణించి, అధర్మం ప్రబలుతున్నప్పుడు, సాధు సజ్జనులను సంరక్షించి, దుర్మార్గులను హతమార్చి ధర్మప్రతిష్ఠాపన గావించుటకు పరమాత్మే స్వయముగా మనుష్యరూపంలో అవతరించుతాడని భగవద్గీత బోధించిన నగ్నసత్యమును ఆదిశంకరుల జీవితం ఋజువు జేస్తున్నది. ఆ మహనీయుని స్మరించుట మన ప్రప్రథమ కర్తవ్యం. విద్యుక్త ధర్మం.

ఆదిశంకరుల జీవితసంగ్రహం ఈక్రింది శ్లోకంలో సంగ్రహించబడింది :

'అష్టవర్షే చతుర్వేదీ, ద్వాదశే సర్వశాస్త్రవిత్ ।
షోడశే కృతవాన్ భాష్యం, ద్వాత్రింశే మునిరభ్యగాత్ ॥'

ఎనిమిదేండ్లనాటికే చతుర్వేద ( నాలుగు వేదములు ) విదుడయ్యెను. పండ్రెండేండ్ల ప్రాయముననే సర్వశాస్త్రపారగంతుడయ్యెను. పదునారేండ్లకే బ్రహ్మసూత్రాలకు భాష్యము చెప్పెను. ముప్పదిరెండు సంవత్సరములకే మునియై అవతారమును చాలించెను.

*

"Stand and die on your own strength, if there is any sin in the world, it is weakness, avoid all weakness, weakness is sin, weakness is death." 'బ్రతికినా చచ్చినా నీ బలముపైననే ఆధారపడియుండుము. ప్రపంచంలో దుర్బలత్వమే మహాపాపం, దుర్బలత్వమే మరణం. కావున దాని నెట్లయినను పోగొట్టుకొనుము.'

— శ్రీ స్వామీ వివేకానంద

# శ్రీ రామానుజాచార్యులు

క్రీ. శ. 1017 – వ సంవత్సరమున తమిళనాడునందలి పెరుంబూరు నగరమున శ్రీ రామానుజులవారు జన్మించిరి. తండ్రి కేశవాచార్యులు, తల్లి కాంతిమతి. జన్మకాలమున వీరికి 'లక్ష్మణాచార్యులు' అని నామకరణము చేసిరి. తరువాత వీరి మామగారైన శైలపూర్ణస్వాములవారు వీరికి 'రామానుజులు' అని పేరును నిశ్చయించినారు.

ఎనిమిదేండ్ల ప్రాయమున వీరికి ఉపనయనము చేసిరి. తండ్రిగారు తనగృహమునందే వీరికి విద్య నేర్పి 16 – వ ఏట వివాహము చేసిరి. వివాహానంతరం తండ్రిగారు పరమపదించిరి. తదనంతరం విద్యాకేంద్రమయిన కాంచీపురమునకు వెళ్లి 'యాదవప్రకాశు' అను సుప్రసిద్ధ వేదాంతులవద్ద శిష్యులుగా చేరి విద్యాభ్యాసం కొనసాగించిరి.

శిష్యులైన రామానుజులవారి ప్రతిభను, కుశాగ్రబుద్ధిని చూచి గురువుగారికి మనస్సులో ఈర్ష్య జనించింది. శిష్యుడు తనకన్నా తెలివితేటలలో మించిపోతాడనే బాధ మనస్సులో ఏర్పడింది. ఒక పర్యాయం ఉపనిషత్తులకు అర్థం చెబుతుండగా గురుశిష్యులమధ్య వాగ్వివాదము చెలరేగింది. శిష్యునకు సరైన సమాధానం గురువుగారు యివ్వలేకపోగా కొన్ని అపశబ్దములతో దూషించిరి. రామానుజులవారు నోరు మెదపక గాంభీర్యతతో ఆ దూషణ భూషణలను సహించిరి. కాని ఆత్మగౌరవమునకు మాత్రం గొప్పదెబ్బ తగిలినట్లు భావించి, ఆనాడు మొదలు రామానుజులవారు గురువుగారి వద్దకు వెళ్ళకుండా తనయింటనే అధ్యయనము ప్రారంభించిరి.

గురువుగారి ఆత్మాభిమానం దెబ్బతిన్నది. శిష్యునిపట్ల ద్వేషాగ్ని ప్రబలుచుండెను. ఏదోవిధముగా శిష్యుని పరిమార్చాలని గురువుగారు నిశ్చయించుకున్నారు. ఆంతర్యులైన శిష్యులతో సంప్రదించి త్రివేణి స్నానమునకని కుట్రపన్ని రామానుజులవారిని కూడా కలుపుకొని ప్రయాణం ప్రారంభించారు. యాదవప్రకాశ గారి శిష్యమండలిలో ఒకరైన రామానుజులవారి పినతల్లి కుమారులు గోవిందాచార్యులు గురువుగారి కుట్రను పసికట్టి రామానుజులవారికి రహస్యంగా వివరించారు. అప్పుడు రామానుజులవారు ఏదో ఒక మిషతో యాత్రను మానుకొని తిరిగి కాంచీపురం సురక్షితంగా చేరారు.

శ్రీరంగమునందుగల వైష్ణవమత విద్వాంసులైన యమునాచార్యులవారితో సన్నిహిత సంబంధం ఏర్పడింది. రామానుజులవారి బుద్ధికుశాగ్రతకు, తెలివితేటలకు, భాషణ విధానమునకు ముగ్ధులై యమునాచార్యులవారు, వారికి వైష్ణవధర్మ దీక్షను యిచ్చి తన వారసునిగా చేయ సంకల్పించిరి. కాని ఆ కోరిక వారి జీవితకాలంలో సఫలీకృతం కాలేదు. వారు దేహం చాలించిన పిదప వారి శిష్యులగు పూర్ణాచార్యులవారి వలన దీక్ష గైకొని రామానుజులవారు శ్రీరంగమునందలి గురుపీఠమును అధిష్ఠించిరి. వైష్ణవధర్మ దీక్షను గ్రహించిన తరువాత సన్యాసమును కూడ పుచ్చుకొనిరి. అప్పటి తననామమును 'యతిరాజు' లని ప్రకటించిరి.

శ్రీ రామానుజులవారు విశిష్టాద్వైతమును ప్రచారం చేసిరి. అనేక మతగ్రంథములను రచించిరి. దానిలో వేదాంత సారము. వేదాంత సంగ్రహము, శ్రీభాష్యము మొదలగునవి ప్రసిద్ధములు. తన శిష్యమండలితో భారతదేశములోని మారు మూలగ్రామాలను సహితం సందర్శించి మతప్రచారమును గావించిరి. అనేకమంది బౌద్ధమత పండితులతో, అద్వైతవాదులతో

చర్చలు జరిపిరి. వీరి ప్రతిభకు ముగ్ధులై, తల యొగ్గి వీరికి శిష్యులుగా అనేకమంది చేరినారు.

దిగ్విజయయాత్రను ముగించుకొని శ్రీరంగమునకు తిరిగి చేరుకొనిరి. తన శిష్యులకు మంచి శిక్షణ నిచ్చి ప్రతిభావంతులుగా చేసిరి. 120 సంవత్సరముల నిండు జీవితాన్ని గడపి క్రీ. శ. 1137 సంవత్సరము మాఘ మాసమునందు పరమపదించిరి. అవసానదశయందు తమశిష్యులందరిని ఒకచోట చేర్చి భావి కార్యక్రమమును వివరించి 'పరాశరభట్టు'ను తన వారసునిగా నిర్ణయించిరి. భగవంతుని శ్రద్ధతో ఆరాధించి, తన సమీపమున వున్న శిష్య కోటి నుద్దేశించి "నాయనలారా! మీరు మమ్మును గూర్చి దుఃఖింపరాదు. జీవితపు చివరి ఘడియలలో మాకానందముగా మీరు వీడ్కోలు ఒసగవలయును" అని ఉపదేశించిరి. తదుపరి ధ్యానములో నిమగ్నులై ప్రాణములను వదిలిరి.

శంకర మతమున జ్ఞానమునకు ప్రాధాన్యత యివ్వబడింది. రామానుజ మతమున భక్తికి ప్రాధాన్యత యివ్వబడింది. భక్తుడు తనకార్యమును కర్మయోగముతో నారంభించును. నిష్కామ భావముతో శుభకర్మల నాచరించుటే 'కర్మయోగము.' ఆ కర్మ యోగముతో వారికి జ్ఞానయోగము ప్రాప్తించును. జ్ఞానయోగముతో జీవుడు తన్ను తాను తెలిసికొనును. సత్యాసత్య, ధర్మాధర్మ వివేచనము వానికి కలుగును. జ్ఞానయోగము తరువాత భక్తియోగము ప్రాప్తించును. ఆ యవస్థలో మానవుడు సమస్తమును వదలి ఆత్మను కేవలము పరమాత్మునియందు లీనమొనర్చును. పరమాత్ముని ఆరాధనమునందే చిత్తమును లగ్నము గావించును. భక్తియోగమున పూర్ణుడైన మీదటనే జీవునకు ముక్తి సంప్రాప్తించును. ఈ దశలో జీవుడు తన్నుదాను భగవంతుని కర్పించుకొనును.

రామానుజ మతమున గురువునకు గొప్ప స్థాన మున్నది. గురువునకు ఏదో ఒక వ్యక్తిమీద కృపకలిగినచో అతడు కర్మ, జ్ఞాన, భక్తి యోగము లనెడి సోపానములను దాటకయే వైకుంఠవాసాధికారము పొందవచ్చును.

సమస్త ప్రపంచమంతయు మిథ్య యని శంకరుల మతం. శంకరులవారు బ్రహ్మము తప్ప తదితర మేదియు నున్నట్లు అంగీకరించలేదు. ప్రపంచం, జీవుడు. ప్రకృతి వైభవము లన్నింటిని మిథ్యగా నిర్ణయించిరి. కాని శ్రీ రామానుజులవారి విశిష్టాద్వైతమునందు బ్రహ్మమువలె జీవునకు, ప్రకృతికి సైతము అనాదిత్వము. అనంతత్వము గలదని అంగీకరించ బడినది. కావున వీరు తమమతమునకు "విశిష్టాద్వైతము" అను నామకరణము గావించిరి. అనగా ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి—యీ మూడును తమ తమ విశిష్టగుణముల కారణమున పరస్పర భిన్నములు. శ్రీ రామానుజులవారు విశిష్టముతో కూడ అద్వైతము అను పదమును కూడా పొదిగిరి. ఈ వస్తువులన్ని వేరువేరైనప్పటికి ఒకే శక్తికి అధీనములై వున్నవని సారాంశం. అన్నిటికీ అంతర్యామియగు పరాత్పరుడే మూలమని భావం. తాము క్రొత్త మతమును స్థాపించలేదనియు, తమ మతము వేదాంతమతమనియు ప్రచారం చేసిరి.

వీరి మతమున ముద్రా తిలకాదులగు బాహ్య చిహ్నములకు గూడా ప్రాధాన్యత యివ్వబడినది. ఈ మతమువారు శంఖ, చక్ర, గదా, పద్మము మొదలగువాని ముద్రలు తమ శరీరమునందు ధరింతురు. మస్తకమునందు ఉరుమణి తిరుచూర్ణములతో అలంకరించుకొందురు. ఏకాదశి వ్రతమును పాటింతురు. తులసిపూజ గావింతురు. అర్చనము పూర్తిచేసిగాని అన్నమును భుజింపరు.

*

# శ్రీ మధ్వాచార్యులు

శ్రీ మధ్వాచార్యులు దక్షిణ కర్ణాటక యందలి ఉడిపి క్షేత్రమునకు సమీపములోనున్న పాజక గ్రామమందు క్రీ. శ. 1198 సంవత్సరమున జన్మించెను. తండ్రిపేరు మధ్యగేహాభట్టు. తల్లి వేదవతి. అతనికి చిన్నతనములో 'వాసుదేవు'డని నామకరణం చేసిరి. బాల్యమందే ప్రతిభావంతుడైన వాసుదేవుడు సకలవేద భాగములను, ఇతిహాస పురాణములను స్వయముగా అభ్యసించి ఎల్లరినీ ఆశ్చర్యపరచెను.

సుమారు ఏడువత్సరముల ప్రాయమున వాసుదేవుడు తన తల్లితో ఉత్సవములు తిలకించుటకై 'నేయంపల్లి' యను గ్రామమునకు వెళ్లెను. అక్కడ శివుడను బ్రాహ్మణుడు పురాణకథను చెప్పుచుండగా వాసుదేవుడు మధ్యలో లేచి 'మీరు చెప్పియున్నది సరికాదు. ఇది వ్యాస, శుకాదుల సిద్ధాంతమునకు విరుద్ధమైనది' అని స్పష్టంగా నవ్వుచూ మెల్లగా చెప్పెను. అక్కడ వున్న వారందరూ ఆశ్చర్య చకితులయిరి. సరియైన అర్థము చెప్పుమని పట్టుబట్టిరి. అప్పుడు వాసుదేవుడు మృదుమధురమైన భాషలో స్పష్టంగా సరియైన అర్థం చెప్పగా ఆ శివ పౌరాణికుడు మెచ్చుకొనిరి.

మరొక సందర్భమున తండ్రి మధ్యగేహాభట్టు పురాణము చెప్పుచుండగా అడ్డుతగిలి తండ్రి చెప్పకుండా వదలివైచిన కష్టమైన పదాలకు సరియైన అర్థమును చెప్పి అక్కడ సదూవేశమైన వారందరిని ఆశ్చర్యచకితులను గావించిరి. వాసుదేవునకు ఎనిమిదవ సంవత్సరమున ఉపనయనము చేసిరి. బ్రహ్మచర్య నియమములను ఆచరించుచు, వేదములను పఠించుచు గుణశాలియై సంచరించుచుండెను. ఒకానొక సమయమున సర్పాకారమును

ధరించిన యొక దైత్యుడు తన విషజ్వాలలచే జనులందరిని బెదరించుచు వాసుదేవుని చంపుటకు రాగా, కాలి వ్రేలితో సునాయాసముగా వాని నదిమి చంపివైచెను.

ఒక్క చదువులోనే గాక ఆటలపోటీలలో కూడ పాల్గొని అందరికన్న మిన్నగా వుండేవాడు. గురువులవద్ద పఠించుచు, గురువులకు సహితం తెలియని విషయాలను చెప్పి ఆశ్చర్యపర చేవాడు. సకలవిద్యలను సాకల్యముగ నేర్చుకొని గురుకులమునుండి ఇంటికి వచ్చి శ్రీమన్నారాయణ భక్తిలో నిమగ్నుడయ్యెను. పదహారు వత్సరముల ప్రాయమునందే ప్రాపంచిక విషయములందు అనాసక్తుడై, సదా విష్ణుధ్యాన పరాయణుడై గురువైన అచ్యుత ప్రేక్షకులవద్ద సన్యాసదీక్షను పొంది 'పూర్ణప్రజ్ఞ' అను నామమును స్వీకరించిరి. ఉత్తమ శిష్యుడు దొరికి నందుకు గురువు అచ్యుత ప్రేక్షకుల వారు మనమున ఎంతో సంతసించిరి.

పూర్ణప్రజ్ఞులు సన్యాసమును స్వీకరించిన తరువాత రెండు నెలలలోనే ఆశ్రమమునకు వచ్చిన పండితులను జయించి ఆనంద ప్రదాయకమైన శాస్త్రమును వివరించి గురువులచే 'ఆనందతీర్థ' లను బిరుదును పొందిరి. ఆకాలంలో ప్రబలంగా వున్న బౌద్ధ, జైన, పాశుపత, అద్వైతాది మతములను నిర్దాక్షిణ్యాంగా ఖండించుచూ ఆనందతీర్థులవారు దక్షిణదేశయాత్రను ముగించిరి. మొదట గీతాభాష్యమును రచించి, గురువులకు సమర్పించి విష్ణువుని అవతారమేమైన బాదరాయణ మునిని చూడటానికి బదరికి వెళ్లిరి. బ్రహ్మసూత్రములపై వీరు ఒక వ్యాఖ్యానము వ్రాసారు. దానికి 'భాష్యము' లని పేరు. ఉపనిషత్తులపైన భాష్యం వ్రాసారు. ఋగ్వేదములోని మంత్రములకు వ్యాఖ్యానం కూడా వ్రాసారు. వీరు ప్రబోధించిన మతమును 'ద్వైతము' లేక 'మధ్వమతము' అంటారు. ద్వైతమనగా జీవాత్మ, పరమాత్మ రెండును వేరుగా నున్నవని భావము.

మధ్వమత స్థాపకులైన మధ్వాచార్యులవారు బదరి నుండి తిరుగు ప్రయాణంలో గోదావరి తీరమందు 'శోభనభట్టు' అను అద్వైత పండితునితో వాదోపవాదములను గావించి ద్వైత తత్వము వారిచే అంగీకరింప జేయించారు. వారు 'శ్రీ పద్మనాభ తీర్థ'లను నామముతో ఆచార్యులవారికి ముఖ్యశిష్యులైరి. 'త్రివిక్రమ పండితు'లను పేరుగాంచిన ప్రముఖ అద్వైత విద్వాంసులు సహితం ఆనందతీర్థులవారితో పదిహేను రోజులు అఖండంగా తర్కించి ఓడిపోయిన పిదప శిష్యులైరి. త్రివిక్రమ పండితులు మధ్వాచార్యుల వారి పూర్వప్రజ్ఞలను వివరిస్తూ 'వాయుస్తుతి' యను ఉత్తమ స్తోత్రమును రచించిరి. అందు వాయుదేవుల, హనుద్భీమ మధ్వావతారములను స్తుతించిరి. త్రివిక్రమపండితులవారి మూడవపుత్రులైన శ్రీ నారాయణపండితులు వారి చిన్నవయస్సులోనే మధ్వాచార్యులవారిని చూచి వారి తండ్రి, ఇతర బంధువులు, సమకాలికులు చెప్పిన విషయములను క్రోడీకరించి పూర్ణప్రజ్ఞుల చరిత్రను 'సుమధ్వ విజయ' మను పేరుతో ఒక గ్రంథమును రచించిరి.

శ్రీ మధ్వాచార్యులగారి మతానుయాయులు శ్రీకృష్ణుని పరమదైవముగా భావిస్తారు ఈ మతంలో భక్తికి ప్రధానస్థానం ఉంది. ఉడిపిలో శ్రీ మధ్వాచార్యులవారు పూజించిన కృష్ణ దేవాలయం కలదు. ఆనాటి సంస్కర్తలు, సాధువులు, భక్తులు, తమ బోధనలను దేశభాషలలో కావించిరి. అందువలన వీరి బోధనలు సామాన్య జనులలో బహుళ ప్రచారం పొందినవి.

శ్రీ మధ్వాచార్యులవారు తమ మధ్వశాస్త్రమును మిక్కిలి ప్రీతితో బోధించిరి. మఱియు శంఖముతో చక్రధారణము చేయించిరి. అనగా శంఖచక్రాంకనమును చేసుకొనినవారే శ్రీ మధ్వశాస్త్రమును తెలియుటకు అర్హులు. అందువలన ఆచార్యులవారు సజ్జనులకు శంఖచక్రాంకనమును చేసి తమ సిద్ధాంత

శాస్త్రమును ఉపదేశించేవారు. శ్రీ మధ్వాచార్యులవారు తమ అద్భుత శక్తితో పవిత్రమైన భారత భాగవత గ్రంథములను బాగుగా విమర్శించి "భారత తాత్పర్య నిర్ణయము, భాగవత తాత్పర్య నిర్ణయము" అను గ్రంథములను రచించిరి. వారు మొత్తము ముప్పదిఏడు గ్రంథములను రచించిరి. వీని నిపుడు 'సర్వమూల గ్రంథము' లందురు. క్రీ. శ. 1275–వ సంవత్సరమున శ్రీ మధ్వాచార్యులవారు పాజక క్షేత్రమందుగల తమ స్వగృహమున వైకుంఠము ( మృతులైరి ) న కరిగిరి.

*

## తులసీ మహత్యం

తులసి ఆకులతో కప్పిన శవం కొంతకాలం కుళ్ళిపోకుండా నిలువ వుంటుందని ఈమధ్య అమెరికన్ శాస్త్రజ్ఞులు పరిశోధనల వలన తెలుసు కున్నారు. జపానులో ప్రతి ఇంటా తులసీవనం ఉంటుంది. కలకత్తాలో ఒక యూరోపియన్ తన యింట తులసీవనం ఏర్పాటు చేసుకొన్నాడు. కారణ మేమిటని ఒక హిందువు ప్రశ్నించగా "ఓషధీలోకంలో తులసి మొక్కలో నున్నంత విద్యుచ్ఛక్తి మరి ఏ యితర చెట్లలోను లేదు. ఈ తులసిమొక్కలు ఉన్న ప్రాంతమున రెండు వందల గజముల మేర వరకూ వాయువు పరిశుద్ధంగా వుంటుంది. మలేరియా, ప్లేగు మొదలగు అంటువ్యాధులను, క్షయరోగమును కలిగించే క్రిములు ఆ ప్రాంతానికి చేరవు. దోమలు ఆ ప్రాంతానికి రావు. ప్రతిరోజూ సాయంకాలం తులసివనంలో షికారుచేస్తూ వుంటాను" అని చెప్పాడు, మన పూర్వీకులు తులసిచెట్టును అందుకే నిత్యం పూజించేవారేమో!

*

## ఉపపాండవులు

ద్రౌపది సుతులను ఉపపాండవు లంటారు. వారి పేర్లు:
1. ప్రతివింధ్యుడు 2. శ్రుతసోముడు 3. శ్రుతకీర్తి 4. శతానీకుడు 5. శ్రుతసేనుడు.

# గురునానక్

క్రీ. శ. 1468–వ సంవత్సరమున కార్తీక శుద్ధ పౌర్ణమినాడు పంజాబులోని 'టాల్వెండి' అను గ్రామములో నానక్ జన్మించెను. తండ్రిపేరు కాళుడు (కలూచంద్ ఖత్రీ). తల్లి త్రిప్తాదేవి. నానక్ తండ్రి ధనికుడు వ్యాపారముచే జీవించేవాడు, ఏడేండ్లు యీడు వచ్చిన తరువాత నానక్‌ను పాఠశాలలో చేర్పించారు. రెండు సంవత్సరముల తరువాత సంస్కృత పాఠశాలకు పంపిరి. వీరు చదువునందు ఆసక్తిని కనుపరచలేదు. అక్షరజ్ఞానము యథార్థజ్ఞానము కాదని భావించి పాఠశాలకు పోవడం మానివేశారు.

వయసు పెరిగినకొద్దీ వీరి మానసమునందు వైరాగ్యభావము పెరుగ జొచ్చినది. పుత్రుని స్థితిగతులను గ్రహించిన తండ్రి సుల్తానా పురమున నున్న నానక్ అక్కగారి వద్దకు పంపిరి. నానక్‌గారి బావయగు జయరామ్‌గారు నవాబ్ దౌలత్ ఖాన్ గారి వద్ద వీరిని ఉద్యోగమున జేర్చిరి. తరువాత వీరి వైరాగ్యమును మాన్పించుటకై గురుదాస పురము నందలి మూలచంద్రఖత్రీగారి కుమార్తెను యిచ్చి వివాహము చేసిరి. ఆమె పేరు 'సులక్షిణీ' కాగ 'సులక్ష్మి' అని పేరు మార్చిరి. వివాహానంతరం మూడేండ్లకు వీరి కొక కుమారుడు జన్మించెను. 'శ్రీచందు' డని పేరు పెట్టిరి. మఱికొంతకాలానికి మరొక కుమారుడు జన్మించగా అతనికి 'లక్ష్మిచందు' అని నామకరణము చేసిరి.

ఉద్యోగములో వచ్చిన ధనములో ఎక్కువ భాగాన్ని దానధర్మములకు నానక్ వినియోగించేవారు. వేదాంత బోధనలను చేస్తూండేవారు. ప్రజలలో పాతుకొనిపోయిన మూఢ విశ్వాసాలను, అజ్ఞానమును తన జ్ఞానబోధనలచే తొలగించి

వేసేవారు. వీరికి చాలామంది హిందువులే గాక మహమ్మదీయులు కూడా శిష్యులైనారు.

వీరికి ముప్పదేండ్లు వయస్సు వచ్చినది. వీరి హృదయమున దాగియున్న వైరాగ్యత్యాగాగ్ని జ్వాలలు బహిర్గతం కాజొచ్చినవి. వాటి నాపుటకు ఎవరికీ శక్యం కాలేదు. ఒక శుభదినాన తన సేవకుడగు 'భాయీమర్దానా' ను వెంటగైకొని దుఃఖించుచున్న ధర్మపత్నిని, పిల్లలను ఇంటనే వదలిపెట్టి సంచారమునకు బయలు దేరెను. పంజాబులోని వివిధప్రదేశములను సందర్శించి కాశీ, ప్రయాగ మొదలగు పుణ్యక్షేత్రముల కేగి అనేకమంది విద్వాంసులను, మహాత్ములను కలిసి వేదాంత చర్చలు గావించిరి. వంగదేశం, అస్సాం ప్రాంతాలను కూడా సందర్శించారు. దక్షిణాదిన పర్యటించారు. 'భాయీచాలా', 'భాయిమర్దానా' లను వెంట నిడికొని అరబ్ దేశమునందు కూడా పర్యటించినట్లు చరిత్రకారులు చెబుతున్నారు.

మక్కా యాత్ర పూర్తి చేసుకొని మదీనాను సందర్శించారు. రోమ్, ఇరాన్ దేశములలో పర్యటించి బాగ్దాదుకు చేరారు. బాగ్దాదును పరిపాలించుచున్న 'ఖలీఫా' వీరిని గౌరవించి విలువగల 'అంగీని' వీరికి బహూకరించారు. ఆ యంగీ మీద పవిత్రమైన ఖురాన్ మంత్రములు వ్రాయబడియున్నాయని చెబుతున్నారు. ఈ యంగీ సిక్కుల భాషలో 'చోలా' అని ప్రసిద్ధి గాంచినది. అది నేటివరకు సురక్షితముగా వుంచబడినది. ఆయన అభిమానులు ప్రతిసంవత్సరం, ఆ యంగీని దర్శించడానికి వెళ్లుతూంటారు.

వీరు బాగ్దాద్ నుంచి బుఖారాకు వెళ్లిరి. అచట వీరి ప్రియ సేవకులు 'భాయీమర్దానా' మరణించిరి. తదుపరి నానక్ గారు తిరిగి స్వస్థలమునకు జేరుకొని అవశేష జీవితమును తమయింట కతరాపురమునందు గడిపిరి.

వీరికి కొంతకాలానికి 'లహనా' అనుపేరుగల ఖత్రి యువకునితో పరిచయం ఏర్పడింది. ఈయన నానక్‌గారి ఉపదేశములకు ప్రభావితుడై శిష్యుడుగా చేరినాడు. శిష్యు లందరి కంటే ఈయనను అత్యంతప్రీతిపాత్రునిగా నానక్‌గారు తలంచెడివారు. గురునానక్‌గారు స్థాపించిన సిక్కు పీఠానికి 'లహనా' వారసుడయ్యాడు. ఈయన 'గురు అంగదదేవ' నామమున మిక్కిలి ప్రసిద్ధుడై సిక్కుల ద్వితీయ గురువుగా పీఠము నలంకరించారు.

గురునానక్ క్రీ. శ. 1526 సంవత్సరమున ఆశ్వయుజ శుద్ధ దశమినాడు పరిమపదించిరి. వీరు మూర్తి పూజలయందును, వ్రతములయందును విశ్వాసం చూపేవారు కాదు. ఆడంబరమునకు అవకాశం యిచ్చేవారుకాదు. గ్రుడ్డినమ్మకాలను, మూఢ విశ్వాసాలను నమ్మెడివారుకాదు. శ్రాద్ధమును బెట్టుట యందు వీరికి నమ్మకంలేదు.

నానక్‌గారు ఒక పర్యాయం హరిద్వారమునకు వెళ్లినారు. అచట పండాలు ఒక యజమానిచేత పిండములు, తర్పణాలు అర్పించచేయుచుండిరట. ఆ పిండజలములు పరలోకమున నున్న వారి పితరులకు జెందునని చెప్పుచుండగా నానక్ గారు విన్నారు. ఆ పండాలతో వాదనచేయుట మంచిది కాదని భావించి, స్వయముగా గంగాజలములోనికి దిగి పడమటి దెసకు అభిముఖులై నీరమును వెదజల్లు చుండిరట. పండాలకు ఆశ్చర్యము వేసి 'అటుల చేయుటకు కారణ మేమి'టని నానక్ గారిని అడుగగా కర్తార పురమునందు తమకు తోటలున్నవని, దానికి నీరు అర్పించుచున్నా నని బదులు చెప్పిరట. అంతట పండాలు తమలో తాము నవ్వు కొని "యీవ్యక్తి ఎంతటి అమాయకుడు! రెండు వందల క్రోసుల దూరమున నున్న తోటలకు గంగనుండి దోసిళ్ళతో నీళ్లు చల్లు తున్నాడు" అని వెటకారముగా అనిరట. అప్పుడు నానక్

గారు యుక్తియుక్తముగ "మీ రెంతటి అమాయకులో మీ రే స్వయముగా ఆలోచించండి. నేను చల్లిన నీరము ఈ లోకమున కే పోని పక్షంలో, మీ రొసంగు జలము పరలోకమున గల పితరుల కెలా చేరగలదు?" అనిరట. ఆయన మాటలకు పండాలు ఆశ్చర్యచకితులైరి.

వేదములలోని ఆర్యసిద్ధాంతములను కొన్నింటిని గ్రహించి తన సిక్కుమతమును తీర్చిదిద్దెను. అత నెప్పుడూ వర్ణవిభేదమును చూపలేదు. సకలజనులు సమానులేయని ఆయన విశ్వాసము. "గ్రంథసాహెబ్" అను మతగ్రంథమును గురునానక్ వ్రాసిరి. భక్తిరస ప్రధానమైన ఈయన మతము ప్రజలకు బాగా నచ్చినది. వీరి మతమును స్వీకరించిన వారిని 'సిక్కు' లందురు. సిక్కు జాతి సజీవమైన వీరజాతి.

*

## రామాయణ ప్రభావం

మన రామాయణ కథలు టర్కీ బర్మా, సయాం, చీనా, సిలోన్, కంబోడియా మొదలగు దేశములలో వ్యాపించి వారి సంస్కృతిలో అంతర్భాగమైనది. టర్కీలోని రామాయణమునకు 'రవోతన' అని పేరు. ప్రాచీన పారశీకమతము వేదమతము నుండియే వచ్చినది. వేదమంత్రముల ప్రక్కన జెండవెస్తా మంత్రములు నుంచినచో ఈ విషయం బాగా అర్థమవుతుంది. మన శర్వుడు శర్వగాను: మిత్రుడు మిత్రగాను; నరసింహుడు నైరోసింహగాను; వాయువు వాయుగాను పిలువబడు చున్నారు. దేవతా నామములలో భేదములేదు. ఉన్ననూ స్వల్పము.

*

"భగవంతుని ప్రత్యక్షముగ గాంచినది ఒక్క భారతదేశము మాత్రమే. భగవంతుని గాంచు ఆతురతగల వ్యక్తి భారతదేశము నెఱుంగ వలెను."

— VICENTE AUELINO

# రాజా రామమోహనరాయ్

రాజారామమోహనరాయ్ 1772-వ సంవత్సరం మే 22-వ తేదీన వంగదేశంలోని 'రాధానగరం' లో జన్మించారు. తండ్రి రమాకాంతరాయ్. తల్లి తారిణీదేవి. వీరిది చిన్న జమీందారి కుటుంబం. ఆధ్యాత్మిక శిక్షణలో తల్లిచేత ప్రభావితుడయ్యాడు. చిత్తశుద్ధితో ప్రార్థనలు చేసేవాడు. బాల్యంలోనే ఆరాధన అంటే అతడికి అపారమైన శ్రద్ధాభక్తులు కుదిరాయి.

రామమోహనుడు బాల్యంలో తన స్వగ్రామంలోనే వంగ భాష, సంస్కృతం కొంత అభ్యసించి, పెర్షియన్ భాషను కూడా పఠించాడు. కాని గ్రామంలో లభించిన ప్రాథమికవిద్య ఆ బాలకునికి సంతృప్తి కలిగించలేదు. అది గ్రహించిన తండ్రి పారశీక, అరబ్బీ భాషలను నేర్పించడానికి పాట్నా పంపాడు. అప్పటికి రామమోహనుని వయస్సు తొమ్మిది సంవత్సరాలు మాత్రమే.

పాట్నాలో రామమోహనుడు మూడుసంవత్సరాలున్నాడు. ఆ కాలంలో ప్రముఖులైన విద్వాంసులతో పరిచయం ఏర్పడింది. మౌల్వీలు అతనికి 'కురాన్' లో దిట్టమైన పునాది వేశారు. సూక్ష్మబుద్ధిగల విద్యార్థి గనుక చిన్నవయస్సులోనే మూల సిద్ధాంతాలను అవగతం చేసుకున్నాడు. యూక్లిడ్, అరిస్టాటిల్ గ్రంథాలకు అరబ్బీ భాషలోనున్న అనువాదాలను అధ్యయనం చేశాడు. పారశీక వేదాంతులైన సూఫీల కవితా తాత్త్విక విశేషాలు రామమోహనుని ఎక్కువగా ముగ్ధుణ్ణి చేశాయి.

'ముతాజాలీలు', మువాహుదీలు' రచించిన గ్రంథాలను పరిశీలించి పరవశుడయ్యేవాడు. హిందువులు చేసే విగ్రహారాధన, మూర్తి పూజ - హేతుబద్ధమైన ఆరాధనా విధానం కాదని

అతనికి తోచింది. కొంతకాలానికి పాట్నా విడచి స్వగృహం చేరుకున్నాడు. కొడుకులో వచ్చిన మార్పును గమనించి తండ్రి కలవరపడ్డాడు. తనపుత్రుడు ప్రాచీన సాంప్రదాయాలయెడ నిర్లక్ష్యంగా వుండటం చూచి తల్లి వ్యథజెందింది. తల్లిదండ్రులు అతని మీద పెట్టుకున్న పెద్ద పెద్ద ఆశలన్నీ భగ్నమై పోయాయి. రామమోహనుని మొదటి భార్య చిన్నతనంలోనే మరణించింది. సంవత్సరమైనా పూర్తికాకమునుపే తల్లిదండ్రులు బలవంతంగా రెండవ పెండ్లిచేసారు. ఆ చిన్నవయస్సులోనే బహుభార్యాత్వమంటే అసహ్యించుకొనేవాడు. 14 ఏండ్ల వయస్సులో వారణాసికి వెళ్లి సంస్కృతాన్ని కూడా అధ్యయనం చేశాడు. ఉపనిషత్తులు పూర్తిగా చదివాడు.

పదహారవయేట రామమోహనుని అభిప్రాయాలు ఒక స్థిరరూపం దాల్చ సాగాయి. అప్పుడే హిందూ సమాజంలో జీర్ణించుకొనిన విగ్రహారాధన, మూఢాచారాలను విమర్శిస్తూ ఒక వ్యాసం వ్రాశాడు. అది తండ్రి ఆగ్రహానికి గురైంది. తల్లి హృదయం గాఢంగా గాయపడ్డది. తాను పూజించే దేవతా విగ్రహానికి నమస్కరించని కొడుకు ముఖం చూడ నన్నది తల్లి తారిణీదేవి. తనమతాన్ని అగౌరవపరచే కొడుకుతో ఒకే చూరు క్రింద ఉండలేనన్నాడు తండ్రి రమాకాంతరామ్. తుదకు రామమోహనుడు కొంతకాలం స్వగృహాన్ని విడిచిపోవలసి వచ్చింది. హిమాలయాల మీదుగా సుదీర్ఘమైన పాదయాత్ర గావించి టిబెట్టు చేరుకొని అక్కడ లామాలతో పరిచయం ఏర్పర్చుకున్నాడు. అక్కడి ఆలయాలను సందర్శించాడు. పూజా విధానాలను పరికించాడు. ఆరాధనా విధానాలను గమనించాడు. వా రనుసరిస్తున్న ప్రాచీన కర్మకాండపట్ల అసహ్యమేర్పడింది. ఆ సంకుచితమైన స్థలాలనుండి తెగతెంచుకొని పోవలెననే భావం కలిగింది. కేవలం సత్యాన్వేషణకోసం

దూరభారం, ప్రయాసలు లెక్క చేయకుండా తనవలె ప్రయాణం చేసే అనేకమంది యాత్రికులను, సాధువులను, భక్తులను కలుసుకొన్నాడు. వారితో చర్చలు జరిపాడు. ఒక్క విశ్వేశ్వరునికి మాత్రమే భక్తి శ్రద్ధలతో ప్రణమిల్లవచ్చుననే భావం అతని హృదయంలో గాఢంగా నాటుకొన్నది. ఆ విశ్వ పరిపాలకుడైన పరమేశ్వరుణ్ణి అన్వేషించాలనే తహతహ అతనిలో జనించింది. అందువలన హిందూమత గ్రంథాలను అధ్యయనంచేయ నారంభించాడు. వాటి యెడల అతనికి అఖండమైన గౌరవం ఏర్పడింది. శాస్త్రాలను బాగా లోతుగా చదవడంవలన సందేహాలు తీరిపోయాయి. ఉపనిషత్తులు అతనిని ఎక్కువగా ఆకర్షించినాయి. ఏకేశ్వరోపాసన మినహా మరే యితర విధానం అతని మనస్సుకు నచ్చలేదు. రూపరహితుడైన ఏకేశ్వరుణ్ణి ఆరాధించడంలోనే ఆనందం వున్నదని గ్రహించాడు. ఢిల్లీపాదుషా వద్ద పది సంవత్సరములు పదవిని నిర్వహించి 'రాజా' బిరుదును కూడా పొందాడు. అక్కడ ఉన్నప్పుడు 'తుహీ ఫత్ - ఉల్ - మువాహిద్దీన్' (పరిశుద్ధాస్తికుల కొక బహుమానం) అనే గ్రంథం రచించాడు. అరబ్బీ, పారశీక భాషలలో వెలువడిన యీ గ్రంథంలో విగ్రహారాధనను నిశితంగా విమర్శించాడు. ఛాందస పండితుల విమర్శనలకు ఈగ్రంథం గురైంది. 1803 లో తండ్రి మరణించాడు. ఆకాలంలోనే ఈస్టిండియా కంపెనీలోని ఆర్థిక శాఖలో ఒక ఉద్యోగం లభించింది. తదుపరి రంగపూర్ కలెక్టర్ అయిన 'జాన్ డిగ్బీ' దొరగారివద్ద 1809 లో దివానుగా ప్రవేశించాడు. ఆయనతో సన్నిహిత సంబంధ మేర్పడింది. ఆంగ్లభాష నేర్చుకోవటానికి, ఆంగ్లేయ స్వభావాన్ని ఆకళింపు చేసుకోవడానికి ఒక మంచి అవకాశం లభించింది. అప్పుడు ఆయన వయస్సు 22 సంవత్సరాలు. ఆ కాలంలోనే జైన పండితుల సహాయంతో కల్పసూత్రాన్ని గూర్చిన విద్యను ఆర్జించాడు. హరిహరానందతీర్థస్వామితో

సన్నిహిత సంబంధం ఏర్పర్చుకుని తాంత్రిక శాస్త్రమును కూడా నేర్చుకున్నాడు. రంగపూర్ లో ఫలప్రదంగానే కాలం గడిపాడు. ఆయన సామర్థ్యం ఆయనకు ఎంతో గౌరవాన్ని సంపాదించిపెట్టింది.

1811 ప్రాంతంలో రామమోహానుని కంపించివేసే సంఘటన ఒకటి జరిగింది. అది ఆయన జీవితానికే ఒక మలుపుగా పరిగణించింది. అది అతని అన్నగారు జగన్మోహానుని మరణం. రామమోహానుడు తన వదినను సహగమనం చేయవద్దని ప్రతిమాలుతున్నప్పటికి, బలవంతంగా పురోహితులు, బంధువులు ఆమెను చితిమీద పరుండబెట్టి మంటలకు ఆహుతి చేసిన దృశ్యం. ఆ సమయంలో ఆమెను రక్షించలేక, భరించలేని ఆవేశంతో, ఆవేదనతో, ఈ ఘోర దురాచారాన్ని నిర్మూలించేంతవరకు విశ్రమించనని తనలో తాను శపథం పడుతాడు. సతీ సహగమన దురాచార నిర్మూలనం కొరకు రామమోహానుడు 1812 లో ప్రారంభించిన ఆందోళన ఆయన జీవితపరమావధి అయింది. 1828 జూలైలో విలియం బెంటింగ్స్ గవర్నరు జనరల్ గా మన దేశం వచ్చాడు. 1829 డిసెంబరు 4–వ తేదిన రాజా రామ మోహన్ రాయ్ ప్రతిజ్ఞ ఫలించింది. బెంటింగ్స్ సతీ సహగమనాన్ని శాసనబద్ధంగా నిషేధించాడు.

డిగ్బి 1814 లో భారతదేశం విడిచి వెళ్ళగానే రామ మోహానుడు కలకత్తాలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నాడు. తూర్పు ఇండియా వర్తకసంఘు ఉద్యోగమునుండి విరమించగానే శ్రద్ధగా గ్రంథపఠన సాగించడానికి, నూతన రచనలు కొనసాగించడానికి తీరిక, అవకాశం లభించాయి. ఈయన వేదాంత సూత్రాలను 1815 లో వంగభాషలోనికి అనువదించాడు. 1816 లో 'వేదాంతసారమును' వంగభాషలోను, 'వేదాంతము' ను ఆంగ్లభాషలోను తర్జుమా చేశాడు. అదే సంవత్సరంలో ఈశ, కేనోపనిషత్తులను వంగ, ఆంగ్ల

భాషలలోనికి; 1817లో కఠ, మాండూక్యోపనిషత్తులను వంగభాష లోనికి అనువదించాడు. వంగ, ఆంగ్ల భాషలలో వేదాంతాన్ని, ఉపనిషత్తులను అనువాదం చేయడం ఇదే ప్రథమం. 1823 లో "హిందూ స్త్రీల హక్కులను పరిమితంచేసే ప్రయత్నం" ("The Encroachment on the rights of Hindu Females") అనే పేరుతో ఆంగ్లంలో ఒక చిన్న పుస్తకం కూడా వ్రాశాడు. పిత్రార్జితంలోను, భర్తల ఆస్తులలోను, హిందూస్త్రీలు భాగ స్వాములయ్యే హక్కు లుండాలని వీరి అభిప్రాయం. 1827 లో 'వజ్రసూచి' అనే సంస్కృత గ్రంథాన్ని ప్రచురించాడు. కుల వర్ణ వివక్షతలకు వ్యతిరేకంగా వ్రాసిన గ్రంథం అది. 1826 లో వంగవ్యాకరణాన్ని ఆంగ్లంలో ప్రచురించాడు. దీనినే వంగ భాషలో "గౌడీయ వ్యాకరణం" అనే పేరుతో కలకత్తా పాఠ్య గ్రంథాల సంఘంవారు 1833 లో ప్రకటించారు. వంగ సారస్వ తానికి దీనివలన ఎంతో మేలు జరిగింది. వంగభాషలో గద్య రచనకు పూనాదివేసినవాడు యథార్థంగా రాజా రామ మోహనరాయ్.

1815 లో 'రామమోహనరాయ్' 'ఆత్మీయసభ' (స్నేహి తుల సంఘం) అనే ఒక చిన్న సంఘాన్ని స్థాపించాడు. మత వేదార్థ సంబంధమైన చర్చలు జరపడం. ధ్యానం చేసుకొనడం దాని ఆశయాలు. ప్రతిదినం హిందూ వేదపఠనం, ఆస్తిక గీతాలను గానం చేసేవారు.

1821 లో 'యూనిటేరియన్' సంఘాన్ని కూడా స్థాపించాడు. అజ్ఞానాన్ని పారద్రోలడం, మూఢాచారాలనుండి విముక్తిచేయడం, మూర్ఖత్వాన్ని అంతరింపజేయడం దాని ఆశయాలు. నైతిక సిద్ధాంతాలను పరిశుద్ధం చెయ్యడం, ధర్మకార్యాలను ప్రోత్స హించడం వారి ధ్యేయం. మేధస్సును, విజ్ఞానాన్ని అభివృద్ధిపరచే విద్యావ్యాప్తి వారి పరమావధి. 1822 లో ఆ సంఘం తరఫున

ఆంగ్లో-ఇండియన్ పాఠశాలను స్థాపించాడు. స్వదేశీ పిల్లలకు ఉచితవిద్యా ప్రదానం చేసేవారు.

క్రైస్తవ మతప్రచారకులు రామమోహనుని ఏవగించు కుంటున్నప్పటికీ ఆయన రచనలు ఐరోపా, అమెరికా ఖండాలలో అధికంగా మెప్పును పొందాయి. ఆయన రచించిన వేదాంత గ్రంథాలకు అమెరికాలో విశేష ప్రచారం లభించింది.

1817 లో సర్ ఎడ్వర్డ్ హైడ్ ఈస్ట్, డేవిడ్ హేర్లతో కలిసి రామమోహనుడు హిందూ కళాశాలను స్థాపించాడు. పూర్వాచారపరాయణులైనవారివలన ఆ కళాశాల పాలక వర్గంలో రామమోహనునికి స్థానం లేకుండా పోయింది.

వంగదేశంలో ఆనాడు మొదట పుట్టిన శిశువును గంగకు అర్పించు దురాచారం వుండేది. అతని ఉద్యమాలద్వారా ఆ దురాచారాన్ని అరికట్ట గలిగాడు. బహుభార్యాత్వమును కూడా కొంతవరకు అదుపులోనికి తేగలిగాడు. విధవలకు పునర్వివాహము చేయు ప్రయత్నములో కూడా కొంతవరకు సఫలీకృతుడైనాడు. ఇతని ఈ కృషిని ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు అనేక శాస్త్రము లను పరిశోధించి శాసనబద్ధము అగునట్లు చేసెను.

ఇతడు కలకత్తాలో 1828 ఆగస్టు 20-వ తేదీన బ్రహ్మ సమాజమును స్థాపించాడు. ఈనాటికీ ఆ దినాన్ని 'భాద్రోత్సవ దినం' గా జరుపుకుంటారు. అది ప్రథమ బ్రహ్మోపాసన సమావేశం జరిగిన శుభదినం. 1830 జనవరి 23-వ తేదీన నూతన బ్రహ్మసమాజ మందిర ప్రతిష్ఠాపన జరిగింది. ఈ సమాజం ద్వారా హిందూమతంలోని మూఢాచారాలను ఖండించుచూ ప్రచారం జరిగింది.

రాజా రామమోహన్‌రాయ్ గొప్ప సంఘ సంస్కర్త. రామమోహనుడు హిందూధర్మ శాస్త్రాలకు విరోధి అని ఆనాడు చాలామంది ఛాందసులు భావించేవారు. అది పొరపాటు. ఆయన

ఎంతో వినమ్రతతో మతగ్రంథాలను వ్యాఖ్యానించాడు. హిందూ ధర్మశాస్త్రాల సారాంశాన్ని బాగా అధ్యయనం చేసిన వాడు గనుక యథార్థమైన విషయాలను ప్రజల ముందర పెట్ట గలిగాడు. మూఢాచారాలను విడమరిచి చెప్పి వాని వలన వచ్చే అరిష్టాలను ప్రచారంచేశాడు. విగ్రహాలను మనుష్యులుగా భావించి, వాటికి ఆహారం యిచ్చి, వస్త్రధారణ చేసి, పిల్లలను చూసినట్లుగా చూడటం మానవుని మేధావికాసానికి ఏమాత్రం ఉపకరించదని నిష్కర్షగా చెప్పేవాడు. విశ్వశ్రేయస్సు ప్రసాదించిన విశ్వేశ్వరుని ఉపాసనలో అకుంఠిత విశ్వాసం అతనికి ఉండేది. వివిధ సాంప్రదాయల ద్వారా భగవంతుని ఆరాధించేవారందరిని ఒక చోట చేర్చి వారందరి మధ్య సమన్వయాన్ని సాధించడమే వారి ఏకైకమైన కోరిక. ఒక్క హిందూ సమాజంలోనే గాక, వివిధ మతాలలో వుండే దురాచారాలను అరికట్టడమే ఆయన పరమావధి. గ్రుడ్డినమ్మకాలను పారద్రోలి సత్యాన్వేషణకోసం సమరం కొనసాగించడమే ఆయన జీవిత ఏకైకలక్ష్యం. ఆయన ప్రముఖ మానవతావాది. ధర్మం, జీవితం ఒకటేనని నిరూపించిన అసాధారణ వ్యక్తి. అచంచల ఏకేశ్వర విశ్వాసం పునాదిగా మానస మందిర నిర్మాణం చేసుకున్న భక్తాగ్రేసరుడు. 'సమన్వయ దృష్టితో, సమిష్టి మానసికారాధన ఒక్కటే మానవ కళ్యాణానికి సాధనం' అని శంఖారావం చేసిన 'రాజర్షి.' అదే భావితరాల వారికి ఆయన యిచ్చిన సందేశం.

*

"పవిత్రాధ్యాత్మిక సంప్రదాయములకు పుట్టినిల్లుగ ప్రదీపించు అదృష్టవంతమగు దేశము భారతదేశమే. ఇట్టి పవిత్రాధ్యాత్మిక తేజస్సుతో సజీవముగ, చైతన్యవంతముగ యుగయుగములుగ నుద్దీపించుచున్న దేశ మొక్క భారతదేశమే. ఇట్టి సత్సంప్రదాయముల సుశిక్షణము నందించు ఏకైక పవిత్ర సాధనము సంస్కృత భాషయే."

— రీనో (RENOE)

# స్వామి దయానంద సరస్వతి

గుజరాత్ రాష్ట్రమందలి కతియవాడ మండలములోని 'టంకారా' గ్రామంలో క్రీ.శ. 1824–వ సంవత్సరమున దయానంద సరస్వతి జన్మించారు. వీరి తండ్రి అంబాశంకర్. దయానందుని అసలు పేరు మూలశంకరులు. వీరి తండ్రి శివభక్తి పరాయణులు.

అది ఒక శివరాత్రి. శివభక్తులు కావడంవల్ల రోజంతా ఉపవాసం వుండి రాత్రి సమయమున జాగరణ వుండి పూజలు చేయ డానికి తన కుమారుని, శిష్యులను వెంటబెట్టుకొని అంబాశంకర్ ఒక శివాలయానికి వెళ్ళాడు. ఆ రాత్రి చాలాసేపటి వరకు గాఢ నిష్ఠతో శివపూజ యందు నిమగ్నులయ్యారు. కాని అక్కడ చేరిన వారిలో దాదాపు అందరూ నిద్రాదేవి ఒడిలో ఒరిగారు. కాని కుమారుడగు మూలశంకరులు మాత్రం తదేక నిష్ఠతో శివపూజలో నిమగ్నుడై తన కార్యక్రమమును యథావిధిగా కొన సాగిస్తూనే వున్నాడు. ఇంతలో ఒక మూషికము వచ్చి శివుని నెత్తిపైనున్న పత్రములను, పుష్పములను, ముందున వున్న ప్రసాదమును ఆరగించుట కళ్ళారా జూచి మూలశంకరుల హృదయము పరితపించింది. "తన్ను తాను రక్షించుకోలేని శివుడు సమస్త ప్రపంచమును ఎట్లు పాలింపగలడు? ఇతడు నిజమగు శివుడు కాదు. నేను నిజమగు శివుని అన్వేషింతును" అని చేస్తున్న పూజలను మాని గృహమున కేగెను.

తరువాత కొలది దినములకు వీరి సోదరి మరణించినది. మరణ సమయమున అందరూ ఏడ్చుచుండినను, మూలశంకరులు మాత్రం చాలా నిర్లిప్తతతో చూస్తూ నిలబడి పోయినాడు. తరువాత కొంతకాలానికి వీరికి అతిప్రేమ పాత్రులైన పినతండ్రి గారు కూడా మరణించారు. వీరి హృదయం బద్ధలైనది. ఏమైనా

సరే మృత్యువును జయించి తీరాలనే కాంక్ష వీరిలో ప్రబలింది. జీవితంమీద విరక్తి జనించింది. జరామరణ దుఃఖములకు మూల మేమిటో తెలుసుకోవాలనే తాపత్రయం హెచ్చింది. ఇది గమనించిన తండ్రి మూలశంకరుల కు వెంటనే వివాహం చేయాలని నిశ్చయించుకున్నారు.

మూలశంకరులు ఒకనాడు ఎవరితో చెప్పకుండా గృహాన్ని వదలి వెళ్లిపోయారు. వేషమును మార్చుకొని 'శుద్ధ చేతను' డను పేరు పెట్టుకొని దేశదేశాలు తిరిగాడు. పిదప కొంతకాలానికి సన్న్యాసమును స్వీకరించి 'దయానందు' డయ్యెను. యోగులను, విద్వాంసులను వెదికికొనుచు దేశం నలుమూలలా సంచారం చేశారు. చిట్టచివరికి మధురలో మకాం చేసిన స్వామి విరజానందుల కడకేగి చాలాకాలం శిష్యుడుగా వుండి వేదశాస్త్రములను అధ్యయనం చేశారు. తనకు నచ్చిన గురువు లభించినందుకు దయానందులు ఎంతో సంతృప్తిజెందారు. యోగ్యుడైన శిష్యుడు దొరకినందుకు విరజానందులు సంతసించారు.

విద్యాసమాప్తియైన తరువాత దయానందులు గురువుగారికి కానుకగా కొన్ని లవంగములు గొనిపోయి వారి పాదపద్మముల కడనుంచి సెలవు యిప్పించమని ప్రాథేయపడినారు. ఆ దృశ్యమును చూచిన శ్రీ విరజానందులవారికి కనులు అశ్రువులతో నిండినాయి. గద్గదస్వరంతో "దయానందా! ఈ కొద్దిపాటి లవంగముల నొసగి నీవు నా ఋణమునుండి విముక్తుడవు కాదలచితివా! నే నీ లవంగముల నేమి చేయుదును? ప్రపంచము అంధకార బంధురముతో గప్పియున్నది. పొమ్ము! పోయి, యా యంధకారమును తుదముట్టించి విద్యాప్రకాశమును వ్యాపింపజేయుము. నేను గ్రుడ్డివాడను. ఏమియు జేయజాలను. కాని నీవన్నియు చేయగల సమర్థుడవు" అని గురువుగారు ఆశీర్వదించి పంపెను.

దయానందులు గురువుగారి యీ సందేశమును గొని కార్య క్షేత్రమున ప్రవేశించిరి. సుమారు 18 సంవత్సరములు అవిరామంగా భారతదేశమంతటా తిరిగి మతప్రచారమును గావించిరి. 1857-వ సంవత్సరం ఏప్రిల్ 10-వ తేదీన వీరు బొంబాయి నగరమున ఆర్యసమాజమును స్థాపించినారు. రెండేళ్ల తరువాత లాహోరులో దాని శాఖ నొకదానిని నెలకొల్పిరి. నాటినుండి వీరి కార్యక్రమము శరవేగమున సాగ నారంభించెను.

1883-వ సంవత్సరమున జోధపుర సంస్థానమున ప్రవేశించెను. ఒకనాడు యీ దర్బారునందు వేశ్యానృత్యము జరుగు సందర్భమున దయానందుల వారు అక్కడికేగిరి. అది చూచి వారు నిర్భయముగా నిండు దర్బారున యీ ప్రభువును ముక్కచివాట్లు పెట్టినారు. ఆ వేశ్య తన కవమానముగా భావించి దయానందుల మీద కక్షకట్టినది. ఆ కోటయందలి వంటవానితో మంతనాలాడి ఆ వేశ్య దయానందుల వారికి భోజన పదార్థములలో విషము కలిపి పెట్టించినది. ఆ విష ప్రభావము వలననే 1883-వ సంవత్సరమున దీపావళినాడు వేదమంత్రముల గానమొనర్చుచూ ఈ నశ్వర ప్రపంచమును దిగవిడిచి శ్రీ దయానంద సరస్వతిగారు శాశ్వత స్వర్గధామ మలంకరించిరి.

దయానందులవారు పరమాత్మని సర్వజ్ఞుడుగాను, సర్వశక్తిమంతుడుగాను, సర్వవ్యాప్తి, నిరాకారుడుగా భావించెడివారు. అందువలన వీరు మూర్తి పూజను అంగీకరించేవారు కాదు. విగ్రహారాధన ధర్మవిరుద్ధమని భావించేవారు. వీరి సిద్ధాంతములకు మూలము వేదములు. వేదములను ఈశ్వరవాణి యని ప్రచారం చేశారు. మృతపితరులకు శ్రాద్ధము పెట్టుట, తర్పణముల విడచుట వ్యతిరేకించేవారు. జీవించియున్న తల్లిదండ్రులకు, పెద్దలకు, సాధువులకు సేవచేయుటయే వీరి పరమావధి.

అంటరానితనము పెనుభూతమని, సమాజముపాలిటి చీడపురుగని ప్రచారం చేశారు. జన్మతో ఎవ్వడూ నీచుడుగాడని, నీచకర్మ చేయువాడే నీచుడని చెప్పేవారు.

జాతి కుల వ్యవస్థలను అంగీకరించేవారు కాదు. కాని వర్ణ వ్యవస్థను మాత్రము అంగీకరించేవారు. జన్మతో వచ్చిన కులాలకు ప్రాధాన్యత నిచ్చేవారు కాదు. కర్మను బట్టి కులాలు నిర్ణయించాలని కోరేవారు. బ్రాహ్మణ కార్యముల నొనర్చువారే నిజమైన బ్రాహ్మణులని, జన్మనుబట్టి కారని వాదించేవారు. అట్టివారు ఒక వేళ శూద్రుని ఇంట జన్మించిననూ కర్మల ననుసరించి బ్రాహ్మణ త్వమును పొందవచ్చునని వీరి దృఢమైన నిశ్చయము. శూద్రుడు సహితం కర్మల నాచరించి బ్రాహ్మణుడుగా మారవచ్చునని వీరి యభిప్రాయం. కులవిచక్షణకు ప్రాధాన్యత నివ్వక కులాలమధ్య సమన్వయాన్ని సాధించేందుకు దయానంద సరస్వతి తీవ్రకృషి సలిపారు. వీరు శుద్ధి యనెడి కార్యక్రమమును చేబట్టి వేలాది మంది క్రైస్తవులను, మహమ్మదీయులను హిందువులుగా మార్చారు.

ఉత్తేజపూరితమైన ఉపన్యాసాల ద్వారా, తర్కముతో కూడిన వాదనల ద్వారా ఆనాటి ప్రజలను చైతన్యవంతులను గావించారు. ఆనాటి సమాజంలో గూడుకట్టుకొని వున్న మూఢ విశ్వాసాలను పటాపంచలు చేసారు. మూఢాచారాలతో సతమతమై గాఢాంధకారము లోనికి పయనిస్తున్న సమాజానికి వెలుగును ప్రసాదించారు.

దయానంద సరస్వతి ఆధ్యాత్మిక తత్త్వమును అనుభూతికి తెచ్చుకున్న మహర్షి. తాము సత్యమును జీర్ణించుకొని 'సత్యార్థ ప్రకాశము' అను పవిత్ర గ్రంథమును భారత ప్రజలకు నందించిన ఉత్తమ పురుషుడు. వేదములందు బీజాక్షరములుగ నున్న మంత్ర ములలోని మహత్తును సర్వమానావళికి అర్థమగు సరళమైన శైలిలో అందించిన మహాత్ముడు దయానందుడు. మాలిన్యముచే

మఱుగున పడియున్న వేదములకు బాహ్యముగా గన్పించెడి దుమ్మును దులిపివైచి నిజస్వరూపమును, తేజస్సును యథాతథముగ జూపెట్టిన యోగిపుంగవులు దయానందస్వామి. గుప్తముగ దాచబడియున్న వేదములను వెలికి దీసి, సర్వమానవులకును సమముగ పంచిపెట్టిన పవిత్ర హృదయులు దయానందులు.

ఈ మహాత్ముడు తర్కశాస్త్రములో అందెవేసిన చేయి. ఆకాలమున ఈ మహాత్ముని కెదురుగా నిలువగల వ్యక్తి మరొకరు లేరు. తార్కికులలో తార్కికుడు, వాదోపవాదములలో అగ్రగణ్యుడు. హేతువాద పటిమ అద్భుతము. ఈయన వాక్పాటవము అసమానము. ఆధ్యాత్మిక విప్లవ శంఖాన్ని పూరించి ఆనాటి సమాజాన్ని జాగృతం చేసిన మహా మనీషి స్వామి దయానంద సరస్వతి.

*

"నీవు సంపాదించేదానికంటే తక్కువ ఖర్చుచేయడం నేర్చుకో. అలా చేయగలిగినప్పుడే నిన్ను మించిన ఆర్థిక నిపుణుడు ఉండడు."

— స్మిత్

"విరామము పేయి యిక్కట్లకు మూలము. కష్టపడి పనిచేయుటయే జీవిత సోపానము." — నెపోలియన్

"జీవితాన్ని ప్రసాదించినందుకు తల్లిదండ్రులకు, ఉత్తమముగా జీవించడం ఎలాగో నేర్పినందుకు ఉపాధ్యాయునికి ఋణపడ్డాను."

— అలెగ్జాండరు చక్రవర్తి

"తాను ఇచ్చేది మర్చిపోవడం, పుచ్చుకొన్నది జ్ఞాపకం ఉంచుకోవడం- ఈ గుణాన్ని స్నేహ మంటారు. — షేక్స్పియర్

"స్త్రీని ప్రేమించడానికి అందం కారణం కాకూడదు. అలాగే పురుషుని ప్రేమించడానికి ఐశ్వర్యం కారణం కాకూడదు." — పోప్

# రామకృష్ణ పరమహంస

అధర్మము ప్రబలి, ధర్మము నశించినప్పు డల్లా భగవానుడే ఒక ప్రవక్తరూపంలో జన్మించి ధర్మాన్ని సంరక్షించుతాడని మన నమ్మకం. ఇదే వాస్తవాన్ని గీత కూడ ప్రబోధిస్తున్నది.

హిందూమతం అద్వైతమని, విశిష్టాద్వైతమని, ద్వైతమని మూడు ముక్కలుగా చీలి ఒకరి నొకరు పెనుగులాడుకుంటూ, మనజాతిని బలహీనపరచిన తరుణంలో క్రీస్తు ప్రబోధకులు, మహమ్మదీయ ప్రవక్తలు హిందూదేశంలో విరివిగా ప్రచారం ప్రారంభించడంతో హిందూమతం సర్వనాశనమగునా యను స్థితికి దిగజారినది. అట్టి సంకట స్థితిలో భగవాన్ శ్రీ రామకృష్ణ పరమహంస జన్మించారు. అనైక్యమును బొందిన హిందూ హృదయమునకు పరిపూర్ణ వ్యక్తిత్వమును సముపార్జించినారు. భిన్నత్వమునందేకత్వమును ప్రదర్శించినారు.

శ్రీ రామకృష్ణ పరమహంస 1833–వ సంవత్సరమున వంగరాష్ట్రములోని హుగ్లీ మండలము నందలి 'కామార్పుర' యను గ్రామమున జన్మించిరి. వీరి తండ్రి ఖుదీరామచటోపాధ్యాయ, తల్లి చంద్రమణిదేవి. చిన్నప్పుడు వీరికి 'గదాధరు'డని నామకరణము చేసిరి. తదుపరి రామకృష్ణ నామము విఖ్యాతిలోనికి వచ్చినది.

విద్యాధ్యయనమున రామకృష్ణకు మనస్సులగ్నము కాలేదు. ఎంతో కష్టముమీద కొద్దిగా వంగ భాష నేర్చుకున్నాడు. సంస్కృతం నేర్చుకోమని తల్లిదండ్రులు కోరారు. పుస్తకం పట్టడానికి నిరాకరించాడు. కారణ మేమని తల్లి దండ్రులు ఒత్తిడిచేయగా "నేటి చదువుయొక్క పరమావధి ధనసంపాదనేగదా! అటువంటి చదువు నాకు అక్కరలేదు. నాకు నిజమైన చదువు కావలెను.

దాని ఉద్దేశ్యము రూపాయిలు సంపాదించుట కాదు" అని నిష్కర్షగా చెప్పివేశాడు.

1853-వ సంవత్సరమున కలకత్తా నగరమునకు మూడు మైళ్ల దూరమున గంగానది ఒడ్డున రాసమణిదేవి కాళికా మందిరమును నిర్మాణం గావించెను. రామకృష్ణ అన్నగారైన రామకుమారుని ఆ మందిరానికి అర్చకునిగా నియమించారు. వారితో పాటు రామకృష్ణ కూడా అక్కడికి వెళ్లి కాళికాదేవిని ప్రతి నిత్యము శ్రద్ధతో ప్రార్థించేవాడు. ప్రతిరోజు కాళికా విగ్రహము నెదుట నిలిచి "మాతా! నాకు దర్శన మిమ్ము" అని ప్రార్థించేవాడు. ఒక్కొక్కప్పుడు బాలునివలె ఏడ్చేవాడు. ఒకనాడు హఠాత్తుగా కాళికా దర్శనం సంప్రాప్తించింది. అప్పుడు స్పృహ తప్పి పడిపోయాడు. మరునటి దినమునకు గాని స్పృహ రాలేదు. స్పృహ వచ్చినప్పటికీ ఉన్మాదం మాత్రం తగ్గలేదు. ఇతనికేదో రోగమని చికిత్స చేయ నారంభించారు. మరికొందరు పిచ్చివాడని ఎగతాళి చేయడం మొదలుపెట్టారు. అయినప్పటికి రామకృష్ణుడు వీటిని లెఖచేయక కాళికా మందిరంలో ధ్యాననిమగ్నులై మాతను ఆరాధించుచుండేవాడు.

కాళికా మందిరమున 'తోతాపురి' అను నొక సన్యాసితో పరిచయం వీరికి ఏర్పడింది. యోగసిద్ధులలో ప్రసిద్ధులైన తోతాపురి వీరికి కొన్ని సిద్ధులను ఉపదేశించారు. రామకృష్ణుడు వారి వలన సన్యాసమును కూడా స్వీకరించాడు. కొలది దినములలోనే గురువును మించిన శిష్యులుగా ప్రసిద్ధి పొందడం వలన వీరికి 'పరమహంస' నామము సార్థకమైనది. పరమహంస అంటే 'యోగి' అని అర్థం.

వీరికి చిన్నవయస్సునందే శారదామణి తో వివాహమైనది. బాలిక అగుట వలన తల్లిదండ్రుల వద్దనే వుండేది. ఆమెకు యుక్తవయస్సు వచ్చేటప్పటికే రామకృష్ణ సన్యాసం

స్వీకరించడం జరిగింది. రామకృష్ణ స్త్రీలనందరిని కాళీమాత యొక్క అవతారమని భావించి ప్రతి స్త్రీని 'మాతా' అని పిలిచేవాడు. అర్ధాంగిని కూడా 'మాతా' అని పిలవడం వలన శారదామణికి కూడా సన్యాసము నొసగిరి. వివాహము జరిగినప్పటికి రామకృష్ణ, శారదామణిలు అవివాహితులుగానే వుండిపోయారు.

ఒకనాడు కాళికా మందిరమున వీరికి విదుషి బ్రాహ్మణి దర్శన మిచ్చినది. ఆమెయు సన్యాసమును స్వీకరించినదే. పరమ హంస ఆమెను చూడగానే 'తల్లీ' అని సంబోధించిరి. ఆమెయు వీరిపట్ల పుత్రప్రేమతో తాను నేర్చిన తంత్ర విద్యను పూర్తిగా నేర్పినది. వీరు తరచుగా భగవధ్యానమునందు నిమగ్నులై వుండే వారు. ఇతర ప్రపంచంతో ఏమాత్రం సంబంధం వుండేదికాదు. కూర్చున్నా, నడుస్తున్నా వీరెల్లప్పుడూ భగవంతుని గురించే ఆలోచిస్తూండేవారు. గంటల తరబడి తన్ను తాను మరచి సమాధి యందు లగ్నమై భగవద్భక్తియందానందమును చూఱకొనెడి వారు. వీరికి భగవంతుని సాక్షాత్కారము లభించినది. తరచుగా తమ స్నేహితులతో ఒక పురుషుడు మరొక పురుషుని చూచి నట్లుగా తాను భగవంతుని చూస్తున్నాను అని చెబుతూండేవారు.

వీరి భగవద్భక్తి, యోగచర్చలను గురించి చుట్టుప్రక్కలకు వ్యాపించినది. వీరి దర్శనార్థమై గొప్ప గొప్ప నాయకులు, పెద్దలు వస్తూండేవారు. ప్రసిద్ధ బ్రహ్మసమాజ నాయకుడు కేశవచంద్ర వీరికి శిష్యు డయ్యాడు. సుప్రసిద్ధ భౌతికవాదులైన నరేంద్రనాథ దత్తు (వివేకానంద) కూడా వీరికి శిష్యులైరి. పరమహంస గారి దర్శనమైన తోడనే అప్పటివరకు నాస్తికులుగా పేరుగాంచిన నరేంద్రనాథదత్తు ఆస్తికుడయ్యాడు. తదుపరి సన్యాసమును స్వీకరించి 'వివేకానంద' గా లోకవిఖ్యాతి నందుకున్నాడు.

1886-వ సంవత్సరమున పరమహంసగారు కంఠరోగ గ్రస్తులై శాశ్వతముగా నీ లోకమును వదలి తమ మాతృగర్భమున లీనమై పోయిరి.

పరమాత్మను గురించి పుస్తకాలు చదివినంత మాత్రాన ఉపయోగంలేదని భావించి ప్రత్యక్షముగా చూడవలెననే తలంపుతో కాళికాదేవిని మనసారా ఆరాధించాడు. ఆ రాతిబొమ్మ వెనుక ఏమున్నదో తెలుసుకోవాలనే ఆకాంక్షతో నిర్విరామంగా ఎడతెంపు ఎఱుగని ప్రార్థనలు గావించాడు. ఆ విగ్రహమును 'అమ్మా!' అని సంబోధించేవాడు. ప్రీతితో 'నా తల్లీ' అని పిలిచేవాడు. ఆ దివ్యమాత మాటిమాటికి అగపడుచు, దాగుచు ఆయనను విసిగించినది. అవిచ్ఛిన్నమగు దర్శనము కావలయునను కోరిక ఆయనలో ప్రబలినది. ఆరాటము హద్దులు మీరినది. యమయాతనను అనుభవింపలేక తుదకు ఆత్మహత్యకు సంసిద్ధుడైన వెంటనే ఆ దేవి కనికరించి సాక్షాత్కరించినది. అందువలననే పరమహంసగారు విగ్రహారాధనను సమర్థించారు. విగ్రహములు సచేతనము లనియు, సాక్షాత్ పరాత్పరుని రూపము లనియు వారు భావించారు.

గురువు ఘనత అవతారపురుషుని కంటే ఏమాత్రం తగ్గినది కాదని, గురువు భగవంతునితో సమానమని 'గురువు లేని దేగతులు లేవు' అను దృఢసిద్ధాంతమునందు పరమహంసగారికి సంపూర్ణ విశ్వాసం వుండేది.

వీరి దృష్టిలో స్త్రీ భోగవిలాసవస్తువు కాదు. పూజింపదగిన వస్తువు. కామదేవునకు దాసుడై భోగవిలాసములయందు ఆసక్తిగల నరుడు సిద్ధిని పొందలేడని వీరి విశ్వాసం. ధనమునకు దాసోహ మనరాదని, ధనమునే దాసీగా చేసుకొనవలెనని వీరి అభిప్రాయం.

జ్ఞాన భక్తి యోగములు రెండూ భగవంతుని ప్రాప్తికి సాధనములు. అయినప్పటికి జ్ఞానమార్గము అత్యంత దుష్కరమైనదని, భక్తిమార్గము మాత్రమే సులభతరమైనదని వీరి అభిప్రాయం. భక్తుడు తన యిష్టదైవమును నిష్కామ బుద్ధితో ఆరాధించిన యెడల భగవంతుని సాక్షాత్కరించు కొనవచ్చునని ఆచరణలో వీరు చూపించారు.

ఒక మతము గొప్పదని, మరొక మతము అల్పమైనదని భావించుట అవివేకమని వీరు చెప్పేవారు. మతములు, ఆరాధనా దైవములు, ఆచార పద్ధతులు వేరైనా అంతిమధ్యేయం ఒక్కటే నని, భగవంతుని దర్శించుటే వారి ఏకైక లక్ష్యమని చెప్పేవారు. భగవంతుడు లేడని వాదించే నాస్తికులకన్నా, భగవంతు డున్నాడని ప్రచారం చేసే ఆస్తికులను, వారు ఏ మతానికి చెందినవారైనా సరే, గౌరవించడం మానవధర్మమని ప్రబోధించారు.

సకల చరాచర సృష్టిని సృష్టించింది ఒక్క భగవంతుడేనని, ఈ సృష్టిలో నివసించే ప్రతిజీవిని గౌరవించడం విజ్ఞతగల మానవుని ధర్మమని ప్రబోధించారు. మతములకు గాని, మతమునందలి అంతఃశాఖలకు గాని, ఆరాధనాదులకుగాని విశేష ప్రాధాన్యత నీయక, మానవుని సహజ ధర్మమగు ఆధ్యాత్మికశక్తిని వృద్ధి చేసుకొనుటయందే మిక్కిలి ఆసక్తి చూపుతూ మాటలతోగాక, చేతలతో, సత్యనిష్ఠతో గూడిన త్యాగరూపమగు మానవసేవకు జీవితార్పణము గావించుకొనుటయే జీవితలక్ష్యం కావాలని శ్రీరామకృష్ణపరమహంస ప్రపంచానికి చాటారు.

*

## శంఖములు

శ్రీకృష్ణుని శంఖము పాంచజన్యము ; ధర్మరాజు శంఖము అనంత విజయము ; అర్జునుని శంఖము దేవదత్తము ; భీముని శంఖము పౌండ్రము ; నకులుని శంఖము సుఘోషము ; సహదేవుని శంఖము మణిపుష్పకము.

# కందుకూరి వీరేశలింగం పంతులు

శ్రీ వీరేశలింగం పంతులుగారు 1848 ఏప్రిల్ 16-వ తేదీన రాజమహేంద్రవరంలో జన్మించారు. ఆయనకు ఎనిమిదవ ఏటనే వడుగు చేశారు. అప్పటినుంచి శ్రద్ధాసక్తులతో మూడు వేళలా సంధ్యావందనం చేసేవాడు. భారత భాగవతాలలోని చక్కటి భాగాలను నిత్యం చదివేవాడు. విద్యార్థిగా వుండగానే కవిత్వం చెప్పడం మొదలు పెట్టాడు. భగవంతుడు మంచి ఆరోగ్యం యివ్వకపోయినా తెలివి తేటలూ, జ్ఞాపకశక్తి మాత్రం ఇచ్చాడు. ఒక్కసారి చదివితే చాలు పాఠంగాని, పద్యంగాని అలాగే మనస్సులో నిలిచిపోయేది. ఆయనకు విద్యార్థివేతనం కూడా లభించింది.

ఆయన ధనవంతుడు కాదు. పెద్ద పెద్ద ఉద్యోగాలు చేయలేదు. ఆయన కొంతకాలం రాజమహేంద్రవరంలోని ప్రభుత్వకళాశాలలోను, మద్రాసులోని రాజధాని కళాశాలలోను ప్రధానాంధ్ర పండితుడుగా పనిచేశారు. ఇంగ్లీషు పెద్దగా చదువుకోలేదు. తెలుగు దేశానికి, తెలుగు సాహిత్యానికి ఎనలేని సేవ చేశాడు. పుస్తకాలు వ్రాయడంతోపాటు పత్రికలు కూడా నడిపాడు. సుమారు 130 పుస్తకాలు రచించాడు. ఇందులో నాటకాలు, వచన రచనలు, శాస్త్ర గ్రంథాలు ఎన్నో వున్నాయి. పాఠ్యపుస్తకాలు మొదలు పండితులకు పనికివచ్చే పుస్తకాల వరకు ఆయన వ్రాశాడు. 'శుద్ధాంధ్ర నిర్వచన నిరోష్ఠ్య నైషధము', వచనము లేకుండా పెదవుల సహాయంతో పలికే అక్షరాలు (ప, ఫ, బ, భ, మొదలైనవి) లేకుండా అచ్చ తెలుగులో వ్రాయబడిన 'నైషధం' — అని దీని కర్థం. కాని రోజులు గడిచినకొద్దీ ఆయన దృష్టిలో మార్పు వచ్చింది. కేవలం పండితులకే అర్థమయ్యే భాషను విడిచిపెట్టి, నలుగురికీ సులభంగా తెలిసే భాషలో ఆయన రచనలు చేయసాగాడు.

చిన్నతనంలో అతనిని చూస్తే శుద్ధ శ్రోత్రియుడులా, విభూతి రేఖలు ధరించి కనుపించేవాడు. పెద్దవాడైన కొద్దీ అర్థంలేని ఆచారాలన్నా, పిచ్చినమ్మకాలన్నా, మూఢవిశ్వాసాలన్నా ఆయనకు తీరని అసహ్యాం కలిగింది. వాటిని మటుమాయం చేయాలని సంకల్పించుకున్నాడు. ప్రజలను వివేకవంతులను చేయాలని 'వివేకవర్ధని' అను పత్రికను ప్రారంభించాడు. ప్రజలను మూఢాచారాలనుండి విముక్తిచేయడానికి 'హాస్య సంజీవి' అను మరొక పత్రికను నడిపాడు. స్త్రీ విద్యను ప్రోత్స హించాలనే తలంపుతో 'సతీహితబోధిని' అనే మాసపత్రికను కూడా నడిపాడు. అనేక పత్రికలలో మూఢవిశ్వాసాలను, దురాచారాలను నిరసిస్తూ వ్యాసాలు వ్రాశాడు. పుస్తకాలను ప్రచురించాడు. వాటితోనే తృప్తిపడక మూఢనమ్మకాలతో విచక్షణను కోల్పోయిన ప్రజల మధ్యకు వెళ్ళి, వాటిని నిరసిస్తూ ఉపన్యాసా లిచ్చేవాడు. తత్ఫలితంగా మిత్రులకంటే శత్రువులు ఎక్కువయ్యారు. ఆయనను సంఘం నుండి వెలివేయడం కూడా జరిగింది. అయినప్పటికి ఆయన ఏమాత్రం చలించలేదు. తాను నిజమని నమ్మిన ఉద్దేశాలను వదలుకోలేదు. జాతి, మత భేదాలు కల్లలని, సంకుచిత మానవుడు సృష్టించిన అది ఒక విష వలయమని, సత్యాన్వేషణ జీవితలక్ష్యం కావాలని, విశ్వ శ్రేయస్సును ప్రసాదించిన విశ్వేశ్వరు నొక్కడినే ఉపాసించాలని బోధించే బ్రహ్మసమాజంలో చేరాడు.

వీరేశలింగం గొప్ప సంఘసంస్కరణోద్యమ కర్త. భర్తలు చనిపోయిన విధవరాండ్రకు పునర్వివాహం చేసేవాడు. సంఘ సంస్కర్తగానే కాక గొప్ప సాహిత్యవేత్తగా ప్రకాశించి భావి తరాలవారికి సులభశైలిలో అనేక గ్రంథములను అందించిన మహా మనీషి. ఈయన అనేక విషయాలమీద చిన్న కథలతో శీలము, సత్ప్రవర్తన, జ్ఞానములను ప్రబోధిస్తూ ఉపన్యాసా లిచ్చేవాడు.

ఈ ఉపన్యాసములు చదివి నేర్చుకోవలసిన విషయా లెన్నో వున్నాయి. వీ టన్నిటిని తన వివేకవర్ధని పత్రికలో ప్రచురించే వాడు. శ్రీ పంతులుగారి ఉపన్యాసములు ఆంధ్ర వాఙ్మయములో ఒక ప్రముఖస్థానాన్ని అలంకరించాయి. ఇవి ఆధునిక విజ్ఞానాభి వృద్ధికి పునాదులు వేశాయి. వీరి ఉపన్యాసముల శైలి అత్యద్భు తము. తెలుగున సలక్షణమైన శైలి నలవరచుకొనుటకై ఈయన ఉపన్యాసములు చదివితీరవలసినదే.

న్యాయం కోసం మొదటినుంచి నిర్భయంగా పోరాడిన నవ్యాంధ్ర నిర్మాత శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు. ఈయన ఒక ప్రముఖ సంఘ సంస్కర్త, ఒక సాహితీవేత్త, ఒక రచయిత, ఒక కర్మవీరుడుగా పేరు గాంచాడు. ఇన్ని సద్గుణాలు ఒకే వ్యక్తిలో మూర్తీభవించడం ఒక విశేషం. సంఘ సంస్కర్త లందరూ సాహితీవేత్తలు కాలేరు. సాహితీవేత్త లందరూ సంఘ సంస్కరణాభిలాషులు కాలేరు. రచయిత లందరూ ఉపన్యాసకులు కాలేరు. ఉపన్యాసకు లందరూ రచయితలు కాలేరు. కాని శ్రీ కందుకూరివారు మాత్రం అన్నిరంగాలలో సవ్యసాచిలా విజృంభించారు. మూఢాచారాలతో, పిచ్చినమ్మకాలతో పతనమైపోతున్న సమాజాన్ని మేలుకొలిపారు. అంధకార బంధురంలో పయనిస్తున్న అమాయక ప్రజలకు వెలుగును ప్రసాదించారు. ఈయన 'గద్య తిక్కన', 'దక్షిణ హిందూదేశ విద్యాసాగర' అను బిరుదులను కూడా పొందారు.

*

## భారత సరిహద్దులు

మహాభారతం, విష్ణుపురాణం, కాళికాపురాణాలను పరిశీలిస్తే 'సీఫా' అనబడే ఈశాన్య సరిహద్దు ప్రాంతం లోగడ హిందూరాజుల పరిపాలనలో వుండేదని స్పష్టపడుతుంది. హిందూరాజులు పాలించిన కామరూపరాజ్యం, టిబెట్టు భారతదేశాలమధ్య ఇప్పుడున్న హిమాలయశ్రేణివరకు వ్యాపించివున్నట్లు హ్యూయన్‌త్సాంగ్ తెలియబరిచారు. యోగినీ పురాణం కూడా ఈ అంశాన్నే ధృవపరుస్తున్నది. —డా. కె. గోపాలాచారి (విదేశాంగ శాఖాధికారి)

# స్వామి రామతీర్థ

20-వ శతాబ్దమునకు చెందిన భారతీయ యోగిపుంగవులలో అగ్రగణ్యుడు రామతీర్థ. ఈయన పంజాబులో గుజరాన్వాలా మండలమునగల మురళీవాలా అను గ్రామమున జన్మించెను. ఇతని తండ్రిపేరు హీరానందగోస్వామి. ఈయన తులసీదాసు వంశజుడు. ఇతని చిన్నతనములోని పేరు తీర్థ రామగోస్వామి. తండ్రి గొప్పవంశమునకు చెందిన వాడైనప్పటికి, ఆస్తులు అంతరించి పోవడం వలన దారిద్ర్యబాధను ఎదుర్కొనవలసి వచ్చినది. బాల్యమునందే తల్లిని గోల్పోవుటచే ఈయనకు దాదులు ఆవుపాలు అలవాటు చేసిరి.

రామాయణ, భారత, భాగవత కథలంటే అతనికి ప్రీతి. పురాణం ఎక్కడ చెబుతున్నా సరే అక్కడికి వెళ్ళి అమితానంద పరవశుడై శ్రద్ధతో వినుచుండెడివాడు. అనేకప్రశ్నలు వేసి రాముడు, కృష్ణుడు, భీముడు మొదలగు వారి జీవితవిశేషాలను తెలుసుకొనేవాడు. అంతేకాదు. వేదాంతగ్రంథములను చదువునప్పుడు, అతడు "జీవుడు అనిననేమి? పరమాత్మయననేమి? ఉభయులకు సంబంధమెట్టిది? కర్మ అననేమి? అది యెట్లు వచ్చినది?" అను ఉత్కృష్టమైన ప్రశ్నలను వేసి అందరిని ఆశ్చర్యచకితులను చేసేవాడు. ఈ ప్రశ్నలన్ని అక్షరాభ్యాసమునకు పూర్వమే అతనిలో ఉదయించాయి.

తండ్రి తన ముద్దుల ద్వితీయ కుమారునికి అక్షరాభ్యాసం చేసి పాఠశాలలో చేర్చినాడు. తోటి బాలురతో ఆట పాటలతో వృథాగా కాలము బుచ్చక, సర్వకాల సర్వావస్థల యందును ఏదో చదువుచునో, చింతన చేయుచునో, యోచించుచునో కాలం గడిపేవాడు. అన్నితరగతులలో ప్రప్రథముడుగా ఉత్తీర్ణుడై పాఠశాల విద్యను పూర్తిచేశాడు.

ఆర్థిక యిబ్బందుల వలన తండ్రి కళాశాలలో చేర్పించలేక పోయినాడు. కాని అన్నితరగతులలో ప్రప్రథముడుగా జయము పొందుటవలన విద్యార్థివేతనము లభించింది. కళాశాలలో చేరాడు. ఉత్సాహంతో కళాశాలలో కడు శ్రద్ధాసక్తులతో చదవటం మొదలుపెట్టాడు. రెండుపూటలా కడుపునిండా తినడానికి కూడా ఆహారం లభించేదికాదు. తొడుక్కోవడానికి మంచి బట్టలు కూడా లేవు. రెండు లాగూలు, ఒక చొక్కా, ఒక తలగుడ్డ మాత్రం వుండేది. అవే ఉతుక్కొని తొడుగుతుండేవాడు. రాత్రి పూట చదువుకోవడానికి దీపంలో తైలం వుండేదికాదు. ఒక పూట అన్నం మానుకొని, మిగిలిన ఆ కొద్దిడబ్బుతో నూనె కొనుక్కొని దీపం వెలిగించి అతిశ్రద్ధతో చదివేవాడు.

కూర్చున్నప్పుడేగాక నడిచేటప్పుడు కూడా చదువుతునే నడిచేవాడు. ఒకనాడు పుస్తకం చదువుతూ ఎచటికో పోతుండగా ఒక మిత్రుడు చూచి "రామా! నడచునప్పుడుకూడా చదువవలెనా? ఇది పాఠశాలకాదు. మార్గము" అనెను. అప్పుడు తీర్థరాముడు "నాకు విశ్వమంతయు పాఠశాలయే" అని జవాబు చెప్పెను.

అటుల, అతడు విశేష పరిశ్రమచేసి గణితశాస్త్రములో బి. ఏ. పరీక్షలో పంజాబు మొత్తములో మొదటివాడుగాను, అదే గణితశాస్త్రములో యం. ఏ. పరీక్షలో కూడా అత్యున్నతమైన శ్రేణిలో విజయం సాధించాడు. అప్పటికి అతనికి ఇరవై సంవత్స రాలు వచ్చినాయి. ఆహారపోషణ సరిగా లేకపోవడంవలన అతని శరీరం అస్థిపంజరమైనది. కన్నులు గుంటలు పడ్డాయి. ఓపిక నశించింది. పిల్లలకు చదువు చెప్పగా వచ్చిన కొద్దిపాటి ధనంతో ప్రతిరోజూ ఆవుపాలను త్రాగుతూండేవాడు. వ్యాయామము చేసే వాడు. కొద్దికాలానికే ఆరోగ్యం కుదుటబడింది.

కొంతకాలానికి అతడు చదివిన లాహోరులోని ఫార్మన్ క్రిస్టియన్ కళాశాలలో ప్రధాన గణితశాస్త్ర పండితుడుగా

నియమించబడ్డాడు. ఉపాధ్యాయుడుగా విద్యార్థుల మెప్పును పొందాడు. సంస్కృతము, హిందీ, పంజాబి, ఉర్దూ, పరిషియన్, ఇంగ్లీషు భాషలలో అపార పాండిత్యాన్ని సంపాదించాడు. ఆ యా భాషలలోని తత్వ గ్రంథముల నన్నింటిని శ్రద్ధతో చదివి అపార విజ్ఞానాన్ని సంపాదించాడు.

కళాశాలలో ఉపాధ్యాయుడుగా ప్రవేశించిన కొలదికాలానికే భార్య కాపురానికి వచ్చినది. భార్యా భర్తలు ఒకరి నొకరు బాగా అర్థం చేసుకొని అన్యోన్యప్రేమతో జీవితాన్ని గడపడం మొదలుపెట్టారు. వా రిరువురూ వేదాంత గ్రంథములను చదువుచూ, చర్చించుకొనుచూ కాలంగడుపుతూండేవారు. ఆత్మ సాక్షాత్కారము నిమిత్తము అప్పుడప్పుడు హిమాలయములకు పోయి తదేక నిష్ఠతో వేదాంతులతో చర్చలు గావించుచుండెడివాడు. కొంతకాలం గృహస్థాశ్రమమునందే వుండి భార్యకు వైరాగ్యమును, జ్ఞానమును బూర్తిగ గలిగించి, పిదప సన్యాసమును స్వీకరించి 'రామతీర్థస్వామి' గా పేరుగాంచెను.

తదనంతరం హిమాలయాలకు బయలుదేరెను. మార్గ మధ్యమున ఒకేసారి అయిదు ఎలుగుగొడ్లు ఎదురుబడ్డాయి. స్వామి వాటిని చూచి ఏమాత్రం భయపడక, నిర్భయముగా ముందుకు నడచిపోసాగెను. ఆ ఎలుగుగొడ్లు మొదట కొంత కోపాన్ని ప్రదర్శించినాయి. మరికొంత సేపటికి వాటంతట అవే స్వామి చెంతకు వచ్చి శిరములు వంచి వెళ్లిపోయాయి. స్వామి పర్వతాగ్రమునకు వెళ్లి ఒక గుహావద్దకు చేరాడు. అక్కడనున్న కొండవాండ్రు ఆ గుహాలోనికి పోవద్దని, భూతా లున్నాయని చెప్పినప్పటికి ఏమాత్రం లక్ష్యంచేయక ఆ గుహాలోనే నివసించడానికి నిశ్చయించుకొన్నాడు. ఆ గుహాలో ఒక్క భూతం కూడా స్వామికి కనుపించ లేదు. తేళ్లు, పాములు మాత్రం వున్నాయి. అవి కూడా స్వామిని ఏమీ చేయలేదు. కొంతకాలానికి శిఖరం దిగివచ్చి హృషీ

కేశము దగ్గరనున్న యోగులతో వేదాంతచర్చలు జరిపారు. సంధ్యా సమయంలో నిశ్చలంగా ధ్యానము చేసుకుంటూండగా, బంధువు డొకడు స్వామి జన్మస్థలమునుండి వచ్చి "నీ కుమారుడు చనిపోయెను" అని బిగ్గరగా ఏడ్చుచూ కేకలుపెట్టెను. అయినప్పటికి స్వామి ఏమాత్రం చలించలేదు. ధ్యానానంతరం ఆ దుర్వార్త విని కూడా, విచారించక నిర్మలమైన మనస్సుతో, చిరునవ్వు నవ్వుతూ "ఇదేమిటి ? గాలి వీస్తున్నదని, చెట్లు పెరుగుతున్నవని, నదులు ప్రవహిస్తున్నవని ఏడవడంలో ఎంత అర్థం లేదో, నీవు ఆ బాలుని మృతికి ఆక్రందించడంలో కూడ అర్థం లేదు. ఇది ప్రకృతి సహజం. ఇందులో శోకింపతగిన విషయం రవ్వంతగూడా లేదు" అనెను. ఎంతటి అతీతదృష్టి రామతీర్థులది !

తదుపరి అనేక పుణ్యప్రదేశములను సందర్శించి వశిష్ఠాశ్రమమునకు చేరెను. కొంతకాలానికి అరణ్యములను వదలి కొడియాకొండ మీదుగా డెహరాడూన్ వచ్చి కలకత్తా చేరి, ఓడ ఎక్కి జపాను వెడలెను. అచట పదిహేను రోజులు మాత్రమే వుండెను. స్వామి ప్రాచ్య విజ్ఞాన గౌరవము వెల్లడి యగునట్లు రెండు మహోపన్యాసము లిచ్చెను. జపాను పండితులు అతని సామర్థ్యమును ప్రశంసించిరి. పత్రికలు కొనియాడినాయి. తదనంతరం అమెరికా చేరెను. భారతీయ తత్వవిచారమును గురించి పెక్కు ఉపన్యాసము లిచ్చెను. అమెరికాదేశీయులు స్వామి ప్రతిభను వేయినోళ్ళ కొనియాడిరి. ఇంగ్లీషు భాషలో చక్కటి కవిత్వమును కూడా వ్రాశారు. తాను రచించిన 'భారతీయుల కొఱకు ఒక విన్నపము' అను పుస్తకమును అతనిని దర్శించవచ్చిన అమెరికా పాలకుని కొకనికి యిచ్చెను. దానిని అతడు ఎంతో శ్రద్ధతో పఠించి స్వామి గొప్పతనాన్ని గురించి ప్రచారం చేసెను. స్వామి అనేక పెద్దపెద్ద నగరములను సందర్శించి ఆర్యమతమును బోధించెను. సెంటు లూయి

నగరమున జరిగిన విశ్వైకమత్యసభకు మొదటి రోజున అగ్రాసనాధిపత్యము వహించెను. అక్కడ ఆర్యమతమును గురించి యిచ్చిన ఉపన్యాసములకు అమెరికనులు ఆశ్చర్య చకితులయిరి.

అచటినుండి జిబ్రాల్టరుకు వెళ్ళి ఈజిప్టుకు బయలుదేరెను. అచట మహమ్మదీయులు స్వామీజీ మహత్త్వమును తెలుసుకొని, అతను మహమ్మద్ యొక్క అవతారమని భావించి విశేషముగ సన్మానించిరి. అచట పరిషియన్ భాషలో అనేక ఉపన్యాసము లిచ్చి మహమ్మదీయుల మెప్పును పొందిరి.

అచటనుండి భారతదేశం వచ్చి అనేక స్థలములలో ఉపన్యాసాలు యిస్తూ దేశమంతటా పర్యటించెను. దేశ సంచారం అయిన తరువాత గంగోత్తరి మొదలగు పుణ్యక్షేత్రములను సందర్శించి, కాశీకి వచ్చి గంగలో స్నానము చేయుచూ మునిగి పోయెను. మఱల ఆ మహనీయుని భౌతిక కాయమును చూచిన వారెవ్వరూ లేరు. ఈ తీరున స్వామి రామతీర్థ పరమాత్మలో నైక్యమై పోయెను.

*

# సంపూర్ణ సమర్పణ

బుద్ధుడు ఒక భేరి దగ్గర పెట్టుకొని సంపూర్ణ త్యాగంచేసినవారు కనిపించితే భేరీ మ్రోగిస్తానన్నాడుట. బింబిసార మహారాజు తన ధనాన్ని చాలా పటాటోపంతో ఆడంబరంగా వచ్చి బుద్ధునికి సమర్పించాడట. కాని బుద్ధుడు భేరి మ్రోగించ లేదు. చాలాకాలం నుంచి తిండిలేక బాధపడుతున్న ఒక ముదుసలి త్రోవలో కన్పించగా బింబిసారుడు ఒక దానిమ్మ పండును యిస్తాడు. ఆ ముదుసలి ఆ పండును తినక, భక్తితో బుద్ధునికి యిచ్చి చనిపోతుంది. అప్పుడు బుద్ధుడు భేరిని మ్రోగించాడు. దీనివలన మనం ఒక నీతిని నేర్చుకోవచ్చు. ఒక పని సాధించాలంటే సంపూర్ణ సమర్పణ కావాలి.

# ఏసు క్రీస్తు

మేరీ పాలెస్టిన్ దేశంలో నజరాత్ అను గ్రామంలో నివసిస్తూండేది. ఆమె సదా దేవుని స్మరిస్తూ, దైవాన్ని ధ్యానిస్తూ కాలం గడుపుతూ వుండేది. ఆమె భక్తికి మెచ్చి ఒకనాడు దివ్యకాంతులతో తేజరిల్లుతున్న దేవదూతలు ప్రత్యక్షమై "భయపడకు మేరీ! భగవంతుడు నిన్ను అనుగ్రహించాడు. నీ పూజకు మెచ్చి కరుణామయుడైన, లోకరక్షకుడైన ఒక బిడ్డ నీ గర్భమున అవతరించబోతున్నాడు. నీ జన్మ సార్థకం అవుతుంది" అని చెబుతారు. కొంతకాలానికి మేరీ గర్భం ధరిస్తుంది.

మేరీ భర్తపేరు జోసఫ్. వడ్రంగం వృత్తిగా పెట్టుకొని జీవయాత్ర చేస్తుండేవాడు. దైవధ్యానంతో కాలం గడిపేవాడు. మేరీకి నవమాసాలు నిండినాయి. శీతాకాలం వచ్చింది. రోమన్ చక్రవర్తి ఆజ్ఞానుసారంగా జనాభా లెక్కలలో తమ పేర్లు చేర్చుకోవడానికి బెథెల్‌హాం పట్టణానికి ప్రజలందరూ పయనమై పోతున్నారు. వారితోపాటు జోసఫ్, మేరీలు కూడ ప్రయాణ మౌతారు. మూడవరోజు రాత్రికి వారిరువురు పట్టణానికి చేరుతారు. మేరీ బాగా అలసిపోతుంది. ఏ సత్రం వద్దకు వెళ్ళినా వుండటానికి ఖాళీ లేదంటారు. ఒక సత్రం యజమాని చిట్టచివరికి మేరీ అవస్థను చూచి జాలిపడి తన పశువుల పాకలో పడుకోవడానికి అనుమతి యిస్తాడు. ఆ దంపతులు ఆనాటి రాత్రి అక్కడ విశ్రమిస్తారు. ఆ రాత్రివేళ లోకరక్షకుడైన జీసస్ ప్రభువు ఆ పశువులశాలలో మేరీ గర్భము నుండి జన్మిస్తాడు. ఆ ప్రక్కనేవున్న గడ్డికంపలో మెత్తగా పక్కపరచి పసిపాపను భద్రంగా అందు పరుండబెడుతారు. అదే క్రీస్తుదేవుడు పుట్టిన పుణ్యదినం. అదే ప్రపంచానికి శాంతి సౌఖ్యాలను ప్రసాదించిన పరమ పవిత్రదినం.

అదే రోజురాత్రి గొర్రెలకాపరులు ఒక విచిత్రమైన, అద్భుతమైన దివ్యజ్యోతిని ఆకాశంలో చూచి విభ్రాంతులౌతారు.

ఆ దివ్యకాంతిలో ఒక బంగారురెక్కల దేవదూత రూపం వారికి కనిపించింది. ఒక సువార్త వారికి వినిపించింది. "నగరంలో ఒక పశువులపాకలో లోకరక్షకుడైన క్రీస్తు ప్రభువు జన్మించాడు. వెంటనే వెళ్ళి ప్రభువును దర్శించండి" అని చెప్పిన దేవదూత మాటలను విని ఆశ్చర్యపడి మరునాడు ఉదయం ప్రక్కనే వున్న పట్టణానికి వెళ్లి వెతికి వెతికి మేరీ, జోసఫ్‌లు వున్న ఆ పశువుల పాకలోనికి వెళ్ళి చిన్నారిబిడ్డను చూచి పాదాలకు ప్రణామం చేస్తారు. కమ్మని గీతాలతో సంతోషంగా స్తుతించి రాత్రి జరిగిన విచిత్ర సంఘటనను ఆ తల్లిదండ్రులకు వివరిస్తారు. అది విన్న మేరీ, జోసఫ్‌లు సంతోషంతో ఉప్పొంగి పోతారు. ప్రభువు పుట్టిన వార్త పట్టణంలో ప్రాకిపోతోంది. ప్రజానీకం చూచి పోతూంటారు.

జీసస్‌కు మేరీమాత చిన్నతనం నుంచే దయా, ధర్మమూ, ప్రేమా, త్యాగమూ మొదలగు సద్గుణాలను నూరి పోస్తూంటుంది. మంచి నీతులు చెప్పేది. కమ్మని నీతికథలు వినిపించేది. జీసస్‌కు పన్నెండేళ్ళ వయస్సు వచ్చింది. ఆనాడు యూదు లందరికి పండుగ రోజు. జెరూసలెంలో వున్న దేవాలయంలో పెద్ద ఉత్సవం జరుగుతున్నది. దేశం పలుప్రాంతాలనుంచి యూదులు వచ్చి అక్కడి దేవుని స్మరించి పవిత్ర బోధనలను ఆలకించే పవిత్ర శుభదినం అది. మేరీ, జోసఫ్‌లు జీసస్‌ను తీసుకొని అక్కడికి చేరుతారు. ఆ జన సమర్దంలో జీసస్ తప్పిపోతాడు. ఆ దంపతులు జీసస్‌కోసం పట్టణమంతా గాలిస్తారు. చివరికి ఆలయంలో మతాధిపతులు చెప్పే ఉపన్యాసాలు వింటూ, కూర్చున్న జీసస్‌ను చూచి ఆశ్చర్యపడి "ఇలా చెప్పకుండా ఎందుకు వచ్చావు బాబూ? నీ కోసం ఎన్నిచోట్ల వెతికామో! ఎంత బాధపడ్డామో!" అనిన తల్లి మాటలు విని జీసస్ "అదేమిటమ్మా, అలా అంటావు? నా తండ్రి అయిన దేవునివద్ద ఉంటే నీకు భయ మెందుకమ్మా!" అని అంటాడు. తరువాత జీసస్‌ను తీసుకొని తల్లిదండ్రులు స్వగ్రామం చేరుకుంటారు. వడ్రంగం పనిలో తండ్రికి తోడ్పడుతూ

మిగిలిన సమయంలో భగవంతుణ్ణి ప్రార్థిస్తూండేవాడు. కొంతకాలం గడచిన పిదప తండ్రి జోసఫ్ మరణిస్తాడు. తల్లికి ధైర్యం చెప్పి ఓదారుస్తాడు.

జీసస్ పెరిగి 30 ఏండ్లవాడవుతాడు. పీడితులైన ప్రజలకొరకు ప్రపంచంలో ప్రేమ సామ్రాజ్యమును నెలకొల్పడంకోసం ప్రవక్తను కాబోతున్నానని తల్లికి విన్నవించుతాడు. తల్లి అనుమతిని గైకొని జీసస్ ఇల్లు విడచి జార్డాన్ నది దగ్గరకు చేరుకుంటాడు. ఆ నదిలో స్నానంచేసి యోహాన్ వద్ద ధర్మదీక్ష అందుకుంటాడు. తదనంతరం జనసంచారం లేని అరణ్య ప్రాంతాలకు వెళ్లుతాడు. ప్రశాంతమైన ఒక ప్రదేశంలో ఏకాంతంగా నలుబదిరోజులు ఉపవాసదీక్ష వహించి దైవధ్యానంలో నిమగ్నుడై దివ్యప్రార్థనలు సల్పుతాడు. అఖండ మైన ఆత్మశక్తిని సంపాదించి, అద్భుతమైన మనోబలాన్ని ఆర్జించు తాడు. తన సందేశాన్ని అందరికి అందించడానికి సమర్థులైన శిష్యులు కావలసివచ్చింది. ప్రజలను ప్రేమించి, ప్రబోధించగలిగిన అనుచరులకోసం అన్వేషిస్తూ కోపెర్నహోం పట్టణం చేరుకుంటాడు.

ఆ పట్టణం ప్రక్కనే వున్న గాలైలీ సరస్సు దగ్గరకు వెళ్ళి చేపలు పట్టుకుంటున్న జాలరులను చూస్తాడు. వాళ్లకు ఆ రోజు ఎంత ప్రయత్నించినా ఒక్క చేప కూడ వాళ్ళ వలలో పడక పోవడం వలన నిరాశతో కృంగి నిస్పృహ జెంది వుంటారు. అట్టి వారిని పిలచి ధర్మబోధ గావిస్తాడు. నీతివాక్యాలు వినిపిస్తాడు. అక్కడే వున్న ఒక నావను ఎక్కి సరస్సుమధ్యకు పోనివ్వమంటాడు. సరస్సు మధ్యకు వెళ్ళిన తరువాత ప్రక్కన వున్న జాలరులనుచూచి "ఇప్పుడు వలలు వేసి చేపలు పట్టుకోండి" అని చెబుతాడు. జాలరులు వలలు వేస్తారు. చేపలతో వలలు నిండుతాయి. జాలరులు ఆశ్చర్యచకితులై జీసస్ ప్రభువు మనుష్యుల మనస్సులే కాదు, సరస్సుల రహస్యాలు కూడ గ్రహించగల మహానుభావుడు అని వారనుకుంటారు. అప్పుడు జీసస్ ఆ నలుగురు జాలరుల

(శిష్యులు) తో "ఇప్పుడు మీరు వలలలోనికి చేపలను చేర్చినట్లే, మన దేవుని రాజ్యంలోకి మనుష్యులను గూడ చేర్చగలుగుతారు! రండి. ఇక నావెంట రండి. నేను స్థాపించే ప్రేమసౌధానికి మీరు నలుగురూ నాలుగు స్తంభాలు!" అని చెప్పి శిష్యులను వెంట బెట్టుకొని ప్రయాణం కొనసాగిస్తాడు. క్రమంగా జీసస్ ప్రభువుకు పన్నెండుమంది శిష్యులు సమకూరుతారు. జీసస్ శిష్యులతోపాటు ఆ ప్రాంతమంతా విస్తృతంగా పర్యటిస్తాడు. ఆయన దయవల్ల రోగాలు కుదుటపడుతూ వుంటాయి. కళ్ళులేని కబోదులకు కళ్ళు వస్తాయి. ఆయన మహిమవల్ల మరణశయ్యమీద నున్న వారు సహితం లేచి కూర్చుంటారు. ఆయన చూపులు ప్రసరిస్తే చాలు ప్రజల వ్యాధులు తగ్గిపోతూంటాయి.

జీసస్ గాలిలీ సరస్సు తీరంలో వున్న హట్టీన్ కొండమీది మైదానంలో అఖండమైన జనసమూహాన్ని ఉద్దేశిస్తూ సుప్రసిద్ధమైన ధర్మప్రసంగంచేస్తాడు. నిత్యసత్యములైన నీతిసూక్తులను వివరిస్తాడు. ద్వేషం, మోహం, అబద్ధం, అపకారం పనికిరావని ప్రబోధం చేస్తాడు. భక్తివిశ్వాసాలు, నియమ నిష్ఠలు మానవులకు అత్యవసరం అన్నాడు. కీడుకుబదులు కీడుచేయరాదనీ, మిత్రులతోపాటు శత్రువులను గూడా ప్రేమించాలని ఉద్బోధించుతాడు. నిర్మలహృదయంతో దేవుని ప్రార్థించాలని, నిరాడంబరంగా జీవించాలని చెబుతాడు.

జీసస్‌కు బాలలంటే చాలా ఇష్టం. చిన్నపిల్లల మనస్సులలో మంచి భావాలను కలిగించాలని అనుకొనేవాడు. ఆప్యాయంగా ఆదరించి ప్రేమపూర్వకంగా పలకరించేవాడు. కమ్మని కథలు తేలిక భాషలో చెప్పి నీతిని బోధించేవాడు. జీసస్ ప్రభువు ప్రేమను గూర్చి ప్రసంగిస్తూ "మట్టివిత్తనం చాల చిన్నది. మంచినేలలో దానిని నాటితే చిన్న మొక్క మొలుస్తుంది. పెరిగి రెమ్మలతో కొమ్మలతో పెద్ద చెట్టు అవుతుంది. కొంతకాలానికి మరింత పెరిగి పెద్ద వటవృక్ష మవుతుంది. దాని నీడలో ఎందరో తలదాచు

కుంటారు. దాని కొమ్మలమీద ఎన్నో పక్షులు గూడు కట్టుకొని కాపురం ఉంటాయి. ఆ విధముగానే మన మనస్సులలో అందరి యెడల ప్రేమభావం మొలకెత్తాలి. క్రమక్రమంగా పెరిగి పెద్దదై ప్రేమవృక్షం వర్ధిల్లాలి. దాని నీడలో పేదసాదలూ, దీనులూ, దుఃఖితుల్లూ కష్టాలు మరచి తల దాచుకోవాలి. ఆ విధంగా విశ్వప్రేమ విలసిల్లాలి" అని జీసస్ మృదుమధురమైన భాషలో ప్రబోధం చేస్తాడు.

నిండు మనస్సుతో పెద్దల సూక్తులను వినాలనీ, విన్న మాటలను పాటించాలనీ, తప్పుచేసిన వాడికి పశ్చాత్తాపమే తగిన శిక్ష అనీ, చెడ్డపనులు చేసిన వాళ్ళను మనస్ఫూర్తిగా మన్నించడమే మంచి పని అనీ చెప్పేవాడు. ఆపదలో వున్నవాళ్ళను కాపాడటమే అన్నిటికంటే గొప్ప పని అని జీసస్ బోధించేవాడు. కళ్ళముందు కన్పించే తోటి మానవుణ్ణి ప్రేమించలేని వాడు కంటికి కనుపించని దేవుణ్ణి ప్రేమించలేడని వివరించేవాడు.

జెరూసలెంలో పవిత్రమైన పండుగరోజున జీసస్ ప్రభువు శిష్యులందరికి చివరి విందు ఏర్పాటు చేశాడు. రొట్టె, ద్రాక్షరసం అందరికీ యిచ్చాడు. విందు పూర్తికాబోతున్న సమయంలో ఆ విందుకు అర్థం వివరించాడు. ముక్క ముక్కలుగా కోసిపెట్టిన ఆ రొట్టెయే తన దేహం అన్నాడు. ఆ ద్రాక్షరసం తన రక్తమని చెప్పాడు. తన దేహం, తన రక్తం లోకం కోసం అర్పిస్తున్నాననీ, కొద్దికాలంలో తాను ఈ లోకం నుంచి వెళ్ళిపోతున్నాననీ చెబుతాడు. ఆ మాటలు వినిన శిష్యులందరూ ఖిన్నులై పోతారు. అర్ధరాత్రి అవుతుంది. జీసస్ శిష్యులతోపాటు గెతెసమనీ తోటకు విశ్రాంతి కోసం వెళ్లుతారు.

జీసస్ పేరు ప్రతిష్ఠలను చూచి ఓర్వలేని మతాధిపతులు ఏదోవిధముగా జీసస్‌ను పరిమార్చాలని నిశ్చయించుకుంటారు. శిష్యులందరూ గాఢనిద్రలో నిమగ్నులై వుంటారు. జీసస్ మాత్రం

దైవప్రార్థనలో నిమగ్నుడై వుంటాడు. అప్పటికే ప్రేమమూర్తి పైన పగబట్టివున్న పాపాత్ములందరూ, ఆయుధములతో ఆ తోటకు చేరుతారు. అప్పటికే ప్రార్థన ముగించుకొని ఒక చెట్టుకొమ్మను పట్టుకొని నిలబడి ఆ విద్రోహు లందర్ని చూస్తుంటాడు. తనను పట్టి బంధించి తీసుకొని వెళ్ళడానికి వచ్చిన వాళ్ళను ప్రశాంతంగా చూస్తూ "మీరు ఇంత శ్రమ ఎందుకు పడుతున్నారో నాకు అర్థం కావడంలేదు. నన్ను పట్టుకోవడానికి కత్తులు, కటారులు అవసరంలేదు. నేను ఎక్కడికైనాసరే మీవెంట రావడానికి అభ్యంతరంలేదు. వెళ్లుదాం పదండి' అని గంభీరంగా పలుకుతాడు.

ఆ విద్రోహులు జీసస్‌ను తీసుకొనివెళ్ళి కారాగారంలో బంధిస్తారు. రాజద్రోహనేరం క్రింద జీసస్‌కు మరణశిక్ష విధించుతారు. మతగురువు లందరూ ఏకగ్రీవంగా బలపరుస్తారు.

గోల్‌గోత్ అనే పర్వత ప్రదేశంలో జీసస్ ప్రభువును సిలువమీద ఎక్కించుతారు. ఒళ్ళంతా మేకులు కొట్టి చిత్రవధ చేస్తారు. ఆ బాధలను భరించలేక దేవుని స్మరించుతూ, "తండ్రీ! నా ఆత్మను నీకు అప్పగిస్తున్నాను. ఈ లోకానికి వచ్చిన పని సమాప్తమైనది" అని ప్రార్థన చేస్తాడు. జీసస్ దేహం అంతా రక్తసిక్త మవుతుంది. మరణవేదనలో మరల మరల దేవుని స్మరిస్తూ ప్రాణాలను విడుస్తాడు. దివ్యదీప్తులతో దిక్కులు వెలిగించిన ప్రభాకరుడు అస్తమించాడు. ప్రాణికోటిని పరస్పరం ప్రేమించు కొమ్మని ఆశీర్వదించిన అమృతహస్తాలు రక్తసిక్తము లైనాయి. ప్రేమజ్యోతులను వెలిగించిన ప్రేమమూర్తి పరలోకం చేరుకుంటాడు. అనాథలను ఆదరించి, పాపులను పవిత్రులను జేసి, దుఃఖితులమీద, పీడితులమీద దయ, కరుణలను కురిపించిన 'కరుణామూర్తి' ఏసుక్రీస్తు అనంత కాలగర్భంలో కలిసి పోతాడు. ఆ మహనీయుడు నేడు మనకు భౌతిక రూపంలో కనుపించకపోయినా ఆయన ప్రవచించిన నీతిసూక్తులు శాశ్వత నిత్యసత్యాలు.

# మహమ్మదు ప్రవక్త

మహమ్మదు ప్రవక్త జన్మించక పూర్వం అరబ్బు దేశం హింసాప్రవృత్తికి పెట్టినది పేరు. సుసన్నకుటుంబాల పెద్దలు మద్యపానానికి దాసులై, బలహీనవర్గాల ప్రజలను క్రూరాతి క్రూరంగా హింసించుతూ ఆజన్మాంతర బానిసలుగా చేసుకొని అనేకకష్టాలను పెట్టి బాధించుతూండేవారు. ప్రతి కుటుంబానికి ఒక కులదైవం. ప్రతి ఇంటా వేరు వేరు దేవతలను పూజించేవారు. మరికొందరు నక్షత్రాలను, సూర్యచంద్రాదులను ఆరాధించేవారు. స్త్రీ జాతిని హీనంగా, ఒక భోగవస్తువుగా చూచేవారు. తండ్రి తదనంతరం అతని ఉంపుడుగత్తెలను సంభోగించుట ఒక గొప్ప విషయంగా భావించేవారు. ఆడశిశువు జన్మించగానే భర్త కోపాగ్నికి తాళలేక తల్లియే తన కన్నబిడ్డను భూమిలో పూడ్చి పెట్టేది. అటువంటి భీకర, భయంకర అమానుషకృత్యాలతో హింసాప్రవృత్తి ప్రజ్వరిల్లుతున్న దినాలలో ఒక కరుణామయుడు, ప్రేమస్వరూపి ఉద్భవించి శాంతి సందేశాన్ని యిచ్చి ప్రశాంత వాతావరణాన్ని నెలకొల్పాడు. అతనే మహమ్మద్ ప్రవక్త. పవిత్రమైన మక్కా పట్టణమున క్రీ. శ. 571-వ సంవత్సరమున ఖురైషు కుటుంబమున జన్మించాడు. తండ్రి అబ్దుల్లా, తల్లి బీబీ అమీనా. మహమ్మద్ పుట్టుటకు కొలదిమాసాలకు పూర్వమే తండ్రి మరణించడం వలననూ, ఆరవయేటనే తల్లి మరణించడం వలననూ తాతగారింట పెంచబడుతాడు.

12 సంవత్సరాల వయస్సు వరకు తాతగారివద్ద పెరిగి, ఆయన కూడ మరణించడం వలన, మహమ్మద్ పోషణ బాధ్యత అతని పినతండ్రి అయిన అబూతాలిబ్ మీాద పడ్డది. మహమ్మద్ పిన్నవయస్సులోనే సజ్జనుడుగా, దయాదాక్షిణ్యములు కలిగిన

హృదయశాలిగా, అమీనుగా (పరులసొమ్మును పదిలపరచు వాడు, ధర్మకర్త) పేరు ప్రఖ్యాతుల నందుకున్నాడు. 25–వ సంవత్సరమున బీబీ ఖుతైజాతో వివాహం జరిగింది. వివాహమైన 15 సంత్సరాలకు అల్లా అనుగ్రహం వలన మహమ్మద్ ప్రవక్త అయ్యారు. దరిమిలా 10 సంవత్సరాలపాటు మక్కా పట్టణంలో ఇస్లాం మత ప్రచారమును, అల్లా సందేశాలను ప్రజలకు బోధించారు. క్రీ. శ. 622–వ సంవత్సరమున అల్లా ఆజ్ఞానుసారం మక్కా పట్టణం వదలి మదీనా పట్టణమునకు వలసపోయిరి (హిజరిత్ చేసిరి). ఆ శుభముహూర్తమును మహమ్మదీయులు. నూతన సంవత్సరముగా పరిగణించుదురు. దానినే 'హిజ్రీ' సంవత్సరము అందురు. అనగా మహమ్మదీయ ఇస్లాం శకారంభ సంవత్సరం. అదియే క్రీ. శ. 622 జూలై. మహమ్మద్ వారికి అల్లాచే 'జిబ్రయీలు' అను దేవదూత ద్వారా పంపబడిన సందేశాల కూటమియే ఇస్లాం మతము యొక్క పవిత్ర గ్రంథం. దానినే 'ఖురాన్' అందురు. మహమ్మద్ ప్రవక్త మదీనాలో మతబోధ గావించి హింసాప్రవృత్తిని రూపు మాపారు. శాంతియుత వాతావరణాన్ని నెలకొల్పారు. ప్రపంచ ప్రజలకు అవసరమైన సత్య సందేశాన్ని అందించారు. ధర్మ మార్గాన్ని చూపించారు. తమ 63–వ సంవత్సరమున పరలోకమున కేగిరి.

అల్లా తప్ప వేరొక దైవము లేడని ఇస్లాం మతస్థుల గాఢ విశ్వాసం. యావత్ సృష్టిని అల్లాయే సృష్టించాడని వీరి నమ్మకం. అల్లా ఆజ్ఞానుసారమే సూర్యచంద్రాదులు నడుస్తున్నారని, ఆయనే యీ సర్వప్రపంచానికి కారణభూతుడని వీరి కృతనిశ్చయం. అల్లాయొక్క దూతలు, ఆయన ఆజ్ఞల ననుసరించి రేయి పవలనక నిర్విరామంగా కార్యనిర్వహణలో నిమగ్నులై వుంటారని వీరి దృఢనిశ్చయం.

మానవులకు నీతివాక్యములను బోధించి ముక్తిమార్గము జూపించుటకు ధర్మకర్తలను రాయబారులుగా కొంతమందిని అల్లా నియమించెను. వారిని 'రసూల్, నబీ లేక ప్రవక్త' అని పిలుచుదురు. వీరు అల్లాయొక్క ధర్మసందేశాలను లోకము నందు ప్రజలకు బోధించుచుందురు. అట్టివారిలో మహమ్మదు చివరి ప్రవక్త.

అల్లాచే పంపబడిన పవిత్ర గ్రంథాలు నాలుగు. 1. తవు దాతు, 2. జబూరు, 3. ఇంజీలు, 4. ఖురాను. ఖురాను మహమ్మదువారిద్వారా పంపబడిన పవిత్ర గ్రంథము.

ఆదినుండి కలియుగాంతం వరకు ఉద్భవించిన యావత్ జీవకోటి అల్లా ఆజ్ఞానుసారము ఒకే సారిగా లేవబడుదురుట. ఆనాటి పవిత్ర దినముపేరు 'ఖయామత్.' ఆనాడు అల్లా ఎదుట తమ తమ కర్మకాండలు వెల్లడి అయి తగిన ఫలమును అనగా మంచి కర్మగలవారు 'జన్నత్' (వైకుంఠం), పాపకర్మగల వారు 'దోజక్' (నరకం) అనుభవించుదురని ఇస్లాం మత విశ్వాసం. ఈ విశ్వాసాలను నమ్మేవారిని ఇస్లాం మతస్థు లందరు. ప్రపంచ ప్రఖ్యాతిచెందిన మతములలో ఇస్లాం మతం కూడ ఒకటి.

ఇస్లాం అనగా శాంతిమార్గమును అనుసరించుట. అది విగ్రహారాధనను అంగీకరించదు. ఈ మతమును అనుసరించువారు ఈ ఐదు నియమములను నమ్మి ఆచరించవలెనని మహమ్మద్ ప్రవక్త చెప్పారు. 1. 'నమాజ్' అనబడు ప్రార్థన. 2. 'జాకెట్' అనబడు బిక్షవేయుట. 3. 'రమ్‌జాన్' అను నెల కఠిన ఉపవాసము. 4. 'హాజీ' అనుబడు మక్కా తీర్థయాత్ర 5. 'జిహాద్' అనబడు నిరంతర ముస్లింమత వ్యాప్తికై పోరాటం సాగించుట.



*

" సత్యజీవితము యొక్క పర్యవసానము అమృతముగను, అసత్య జీవితము యొక్క పర్యవసానము కాలకూటవిషముగను పరిణమించును.

— శ్రీ మహర్షి మలయాళస్వామి

# ధ్యానయోగం

"రెండురాత్రుల నిద్రవల్ల కలిగే విశ్రాంతి ఎంతో, అది ఇరువై నిమిషాలపాటు ఆచరించే ధ్యానం వల్ల లభ్యము కాగలదు" అని ఫెయిర్ ఫీల్డుకు చెందిన శాస్త్రజ్ఞుడు, ఇంటర్‌నేషనల్ యూనివర్సిటీ ప్రెసిడెంటు, ఫిజియోలజీ ప్రొఫెసర్ అయిన డా. కేన్ వెలెస్ చెప్పారు. ఆయన ఇటీవల ఢిల్లీలో జరిగిన ఇంటర్‌నేషనల్ ఫిజియోలజీ కాంగ్రెసు 26-వ మహా సభలో ప్రసంగిస్తూ "మానసిక వికాసంతో పాటు వ్యక్తిత్వాన్ని సహితం ధ్యానయోగం పెంపొందింప జేస్తుంది. దానివలన వినమ్రత వస్తుంది. ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. కార్యదక్షత అభివృద్ధి జెందుతుంది. ఉద్రేక భావాలు, హింసాప్రవృత్తి అంతరిస్తాయి. నిద్రపట్టక పోవడం అంటూ వుండనే వుండదు. మద్యం, సిగరెట్లు మరియు యితర మత్తుపదార్థముల పట్ల హేయభావము కలుగుతుంది" అని చెప్పారు.

హవాయి యూనివర్సిటీలో పనిచేస్తున్న కాలియర్, షీటన్, జాన్సన్ అను ముగ్గురు శాస్త్రజ్ఞులు ధ్యానయోగంను గురించి పరిశోధనలు జరిపి "ఈ ధ్యానయోగం అవలంబించే విద్యార్థులలో స్మరణశక్తి, జిజ్ఞాసా ప్రవృత్తి పెరుగుతుంది. మత్తుపదార్థాలు సేవించడం మానుకొంటారు" అని చెప్పారు.

1963 - 1972 మధ్య కాలంలో పాశ్చాత్యదేశాలలో రెండు లక్షల మంది విద్యార్థులు ఈ ధ్యానయోగం నేర్చుకొన్నారట, ఒక్క అమెరికాలో ప్రతిమాసం 14 వేలమంది విద్యార్థులు ఈ ధ్యానయోగమును సాధన చేస్తున్నారట.

ఈ ధ్యానయోగ విషయము గురించి మన ఋషులు ఏనాడో చెప్పారు. అనుభవంగా చేసి చూపించారు. ఇప్పుడు విదేశీయులు ధ్యానయోగం మహిమను గుర్తించి సాధన చేస్తున్నారు.

*

# అస్పృశ్యత

"తిరిగి పుట్టాలనే కోరిక నాకు లేదు. ఒకవేళ పునర్జన్మ అంటూ ఎత్తవలసివస్తే అస్పృశ్యునిగానే జన్మించి వారిని సేవించాలని కోరుకుంటాను.

దేవుడు సృష్టించిన ఈ భూమిపై ఎవరూ అధికులు కాదు, ఎవరూ అధములు కాదు.

దేశభవిష్యత్తును తీర్చిదిద్దడంతో తమకూ పాత్ర ఉన్నదని నిరుపేదలు సైతం గుర్తించగలగాలి. దేశంలో నిమ్న తరగతి, ఉన్నత తరగతి అనే తరతమ భేదా లుండకూడదు. అన్నివర్గాలు సామరస్యంగా కలిసి మెలిసి జీవించాలి. ఇట్టి భారతదేశాన్ని సృష్టించడానికి నేను పాటు పడుతాను."

— గాంధీజీ